శ్రీశైవాయనమః



సంపాదకులు,

కొడిమేల రాజలింగారాధ్యులు

# సరస హృదయానురంజనము.



అభినవ కాళిదాస బిరుదాంకిత

ములుగు పాపయారాధ్య ప్రణీతము.

ఇది

... - ముదిగొండ వీరేశలింగ శాస్త్రిగారిచే నేచూడఁబడి

శ్రీ కొడిమేల - రాజలింగారాధ్యుల వారిచే

శైవప్రచారిణీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపించఁబడినది.

కాపీలు. ౫౦౦

శా. ౧౮౪౧. వెల రు — —౦

## పీఠిక.

మహాకవి శ్రీ ములుగు పాపయారాధ్యులవారిచే రచింపఁబడిన ప్రబంధములలోఁ "దలమానికమునందగు" సరసహృదయానురంజనంబు"ను దగినంతవిశ్రాంతి లేకున్నను శ్రమజేసి "శైవప్రచారిణి" పత్రికా ముఖంబునఁ బ్రచురించి యాంధ్రలోకము మన్ననకుఁ బాత్రులగు బ్రహ్మశ్రీ ములుగు వీరభద్ర శాస్త్రిగారు దానింగూర్చి యొకపీఠిక వ్రాయుటకు నన్నుఁ గోరియుండిరి. సమర్థతయే గాక వ్యవధియుఁ జాలినంత లేకుండుటచే నాయీ యలంతి విమర్శనము పరిహాసాస్పద మగునని యెఱింగియుఁ బెద్దలయాజ్ఞ శిరసావహింపవలయునను నభియుక్తోక్తి ననుసరించి యిక్కార్యంబున కుంగడంగు నాసాహసమును విద్వద్వరేణ్యులు క్షమింతురుగాక.

ఆంధ్రభాషాయోషను జక్కఁగా నలంకరించిన కవిత్రయము నాదర్శముగాఁ గొని, శ్రీనాథాది మహాకవులనేక దివ్యప్రబంధము లొనరించి చిరస్మరణీయులైయుండుట యెల్లరకుఁ దెల్లంబ కావునఁ జర్వితచర్వణ మగునని తద్విషయమును విరమించి యట్టివిద్వత్కవిశిఖామణులలో నొక్కర నందగు నీ గ్రంథకర్తలు తమగ్రంథము నెట్లురచించిరో వివరించుచు మున్ముందు వారిచరిత్రముం గూర్చి కొంచెము ప్రశంసించి ప్రస్తుతమునకు వచ్చుచున్నాఁడను.

### — * ములుగు పాపయారాధ్యులు. * —

వీరు కౌండిన్యసగోత్రులు. శ్రీగురుపట్టభద్రవేమనారాధ్యుల వంశమునందు జన్మించినవారు. అక్కమాంబా సంగమేశ్వరులకుఁ బౌత్రులు. భ్రమరాంబా వీరేశ్వరులకుఁ బుత్రులు. త్రివిధలింగార్చనాపరులు షట్స్థలజ్ఞాన సంపన్నులు. వీరు సంస్కృతాంధ్రములలో ననేకరసవత్ప్రబంధముల నొనర్చియుండిరి. వీరి కభినవకాళిదాసబిరుదము గలదు. ఇక్కవీంద్రునకు సంగమేశ్వరారాధ్యులనియుఁ బాపయారాధ్యులనియు నామద్వయ మున్నట్లీక్రిందపద్యముల వలన దెలియుచున్నది.

మ, వరపుం భావసరస్వతీ చతురతా, వాల్లభ్య సంసూచనా
కరపాతంజల వాగ్విశుద్ధ కవితా, కల్హార చామీకరాం
కురతస్నిగ్ధని బంధబంధుర కథాం, కుమారాంకిత గ్రంథ క
ల్పర తోత్సాహిని పాపయార్య సుకవీ! ప్రత్యక్ష శోభానిధీ; సరస. ఆ. ౧. ప. ౨౧.

సీ. పదపదార్థనిబంధ, బంధురంబుగ ధరాతలమెల్ల నెఱుఁగు కళం- తేనచరిత్ర
సరసశృంగారాను, షంగముల్ తవణిజ్యా, పఁగ నహల్యావధూ- పరిణయంబు
ధీమజ్జనస్తవ్య ధీమజ్జనోన్మేష కరముగా నలఘూ- శ్వరచరిత్ర-
లసదలంకారలా- లసవిశంకటముగాఁ బఱఁగునింద్రాత్మజా పరిణయంబు

గీ. శతకపూజాస్తవంబుల సంఖ్యసంఖ్య మీ ఘనీవు ప్రసంగించు మేలికావ్య
రచనమా కెల్లసమ్మదాగ్రితః భౌసర్చ్, సరసరుచి సాంద్ర! సంగమేశ్వరకవీంద్ర

వేమనారాధ్య చరిత్రము.

ఇందు సహజ సోమయ సంగమేశ్వర శాస్త్రి పితామహీ యానామధేయంబునఁ బిలువక పాపయని పిల్చుచుండెను. క్రమక్రమంబున నదియు సుప్రసిద్ధమయ్యెను. పితామహి మెడగల గౌరవ మర్యాదలచే గ్రంథముల యందుఁ గూడ పాప యారాధ్యులనియుఁ గవి చేవాడఁ బడినది. వీరి విద్యాగురువులు పండితాగ్రేసరులగు శ్రీపతి పండితారాధ్యుల శంభులింగారాధ్యులని యీ క్రింద పద్యము సాక్ష్యమిచ్చుచున్నది.

సీ. ఆరాధ్యసింహాసనాంబురాశికిఁ బూర్ణరాకాసుధాంశుఁడే సమ్యముగ
శివహృద్గత తపశ్శ్రీక సాపాదనప్రౌఢిమ్మంబిమెవ్వాని శిక్షణంబు
షడ్దర్శనీ వచస్సాహిత్య నిధిసరో విహారస్మ కాళమే విబుధుచునము
భక్తి భావాంబుని బంధశాంభవ మహాసింధురంబెవ్వాని. చిదభివృద్ధి
గీ. పటుశేముషీశాఖి కాశిఖా పటునిరుద్ధ జాతవేద ప్రమాణ నిశ్శంక బిరుద
మెవనికీరేడు జగముల నెసఁగుచుట్టి శంభు లింగార్య దేశిక స్వామిఁ గొలుతు.

సరస. ఆ. ౧, ప. ౧౧,

ఇమ్మహాకవిశేఖరునకుశిష్యులై శ్రీరామ చంపూప్రణేత బాడ్లమూడి శ్రీరామశాస్త్రి చివుకుల మహాదేవశాస్త్రి మున్నగు నెనుబదిమంది పండితోత్తములైరి. వీరి నెఱిఁగినవారును వీరి ప్రశిష్యులు పెక్కురు నేటికిని గలరు. వీరుభయవ్యాకరణ రహస్యములఁ జక్కఁగ నెఱింగినవారు. "కల్యాణచంపువు" మున్నగునవి గీర్వాణ భాషా వైదుష్యంబునకును, "సర్వమధురము" మున్నగునవి యాంధ్రభాషా వైశారద్యంబునకును, నిదర్శనములు. ఏతత్కృత గ్రంథములు.

కల్యాణ చంపువు. ఏకాదశీచంపువు. ఆర్యాశతి [సంస్కృత కావ్యములు) సర్వమధురము (అచ్చ తెలుఁగు కావ్యము) వేమనారాధ్య చరిత్రము, అహల్యా సంక్రందనీయము, సరసహృదయానురంజనము (మిశ్రకావ్యములు) దేవీ భాగవతము. (ఆంధ్రీకరణము) 12 స్కంధములు. వేమనారాధ్య చరిత్రములోని, ॥సీ॥ పదపదార్థ" యను పద్యములోఁ జెప్పఁబడిన "శంతను చరిత్రము, ఇంద్రాక్ష్మాపరిణయము ఘూర్జర చరిత్రము ప్రస్తుతముగాన రాకున్నవి. ఇవిగాక శివస్తోత్ర సముచ్చయము మున్నగునవి కొన్ని ప్రచారములోఁ గలవు.

మఱియుఁ దారావళి యనియు శశికళ యనియు రెండు చిన్ని పొత్తములు గాన బడుచున్నవి. వీనిఁగూర్చి రెండు కథలు గలవు. పాపయారాధ్యులకు మంచి యోగాభ్యాసము గలదు. ప్రతిదినంబును శివాలయంబునకేగి స్వామి నిదర్శించినఁ గాని భుజించునాచారము లేదు. ఒకనాఁడు కృష్ణాతీరమున యోగాభ్యాసముఁ జేసికొని శివాలయమునకరుగునప్పటికి కుమతుల దుర్బోధ చేనర్చకులు కవాటమును బంధించి యుండఁ గరిగిరి. అదిగని మానకథానాయకుఁడును" మ

2౬
c.

క్తిద్వారము తెల్పుఁడీయుఁ గదె చాముండా! జగజ్జననీ! "యనుమకుటముతోఁ గొన్ని పద్యములను జెప్పఁగాఁ గవాటములు వీడిపోయి భగవద్దర్శన మయ్యెను. ఈ పద్యముల మొత్తమునకు తారావళి యనిపేరు. నిర్వాణ కాలమునమోహాసనము నంఁదధి వసించి రాజరాజేశ్వరీ మంత్రముఁ బఠించి షోడశ ప్రవాళ మాలికం ద్రిప్పుచుఁ బ్రవాళమున కొక్కొక్క పద్యముచొప్పున" మహా, ప్రస్థానావసరం బుడాసెనఁ జేర్పక నీవెసూ భ్రామరీ! "యనుమకుటముతోఁ బదునారునునాయకమణి కొకటియు మొత్తము పదునేఁడు పద్యములు రచించెను. ఈమొత్తమునకు శశికలయని పేరు. సహజముగా శివాద్వైతమునకుఁ జెందియున్నను నిర్యాభిజ్ఞునకు శుద్ధాద్వైతము నందే యభిమానమున్నట్లీ క్రింది పద్యముల వలనఁ దెలియుచున్నది.

క. ఆత్మాఖండాకారస, దాత్మక సద్వృత్తి విమయాసై స్వేతరవా
సాత్మచిదం శాశ్రమమా నాత్మకు సికేను మ్రొక్కులర్పింతుశివా!

సరస. ఆ. ౧. ప. ౨౧౩.

క్రీ. శ. ౧౭౫౯. ౧౮౫౭ వరకు రమారమి ౯౮ సంవత్సరములు జీవించియున్నట్లును, శ్రీ రాజా వాసిరెడ్డి వేంకటాద్రి నాయని సంస్థాన విద్వత్కవిశిరోమణియు, నాబాల్య మిత్రంబును గురువులునై యున్నట్లును శ్రీమంటిగు వీరభద్ర శాస్త్రిగారాంధ్రాభ్యుదయము సంపు. ౧ సంచి. ౨౩ లో వ్రాసియున్నారు.

సీ. అష్టదుర్గాటవీహం వీరరతిరాజు, సాళ్వ గజఘటా చక్రవర్తి
రాజాధి రాజవీర ప్రతాపనుమండు గతిదుర్గ గండరగండబిరుదు
రమ్యచాళుక్య నారాయణ రాణ్మౌళి, క్రౌంచపట్టణ పురవర్గింభ కర్త
జన్నికట్టడి గుత్త జట్టి మల్లుఁడు, రెడ్డికన్నాట నృపరమా కాముకుండు
గీ. వాసిరెడ్డి కులాబ్ధిజై వాత్సకుండు, వేంకటాద్రీంద్రుఁడతి కృపావృష్టిసుగుప
సిరులసలరారి బ్రాహ్మణ శ్రేష్ఠులెల్ల క్ష్మాతలము యూపనిరవ శేషముగఁ నొనిరి.

సరస. ఆ. ౧. ప. ౧౭౦

అని ప్రశంసింపఁ బడిన శ్రీనాయని వారినిగూర్చి యిందు గొంచెము ప్రశంసించుట యవసరమని తలంచెదను.

శ్రీరాజా వాసిరెడ్డి జగ్గన్నగారికి శ్రీఅచ్చమ్మగారికి క్రీ. శ. 1761 సం॥ 27 ఏప్రియల్ వృషచైత్ర బ ౮ సోమవారమున జన్మించి క్రీ. శ. 1783 శుభకృత్సం॥ మున సింహాసనారూఢులై మహారాజాధిరాజ బహదర్ సర్ దేశముఖ్ మన్నేనార్ సర్కార్ ముర్తుజానగర్ ముస్తుఫానగర్ మన్నెరాయ మన్నేహంవర శంకర, బసవ, వీరప్రతాప, రాజమార్తాండ, గండరగండ, ఇత్యాది బిరుదాంకితులై, సైన్యా

దొర తనము వారికి రెండులక్షలు నజరుపట్టి నవరత్నకిరీట భుజ కీర్తులు సర్ పేచ్, కలగ్గి, తేగ, కంఠి, డాల్, తల్వార్, యేనుగు, అంబారీ, రెండు వేల సవార్లు, వగైరా బహుమతులను మూడు వేల మన్సబుదారీ మధిరఖమ్మం వగైరా గ్రామాదులకు ఫర్మానా, మన్నెసుల్తాన్ కితాబునుబొంది మద్రాసు దొరతనము వారివలన ఖిల త్ అత్తర్ దాన్ పన్నీరుదాన్ పాన్దాన్ వగైరా బహుమతులను క్రీ. శ. 1802బంద తు జిల్లా నందిగామ పరగణా కల్ దిండి కొండ పల్లి పరగణా ఆకుల మన్నాడు. నెమలి ఇనుకుదురు వగైరా 20½ గుంటూరుజిల్లా కొండవీడు, వినుకొండసీమలు రాయపూడిచామర్తిసమ్తులు కేతవరం పరగణా పొన్నూరువంటు రాయల కొండూరు పల్లెలుకొల్లూరుమంగళగిరి నిజాంపట్నం। వగైరా 31½ రాజ మహేంద్ర వరము జిల్లా పలివెల నగరం వగైరా 44 గ్రామాదులకుసనది మిక్కియత్ ఇస్తిమిరార్ కానాత్ జాగీర్దారు వలన ఉస్తేపల్లివగైరా గ్రామాదులకు ఫర్మానాను బొంది మంగళగిరి శ్రీనృసింహస్వామి వారికి అమరా వత్యమ రేశ్వరస్వామివారి కద్భుత విమానమండప ప్రాకార గోపురములను, మఱికొన్ని గ్రామాదులలో శివకేశవాద్యాలయ గోపుర ప్రాకార మండపాదులను చేబ్రోలులో బ్రహ్మాలయమునుం నిర్మింపంజేసి, అష్టోత్తర శతాలయములలో నొక్కపర్యాయ మొక్కలగ్నమున శివప్రతిష్ఠల గావించి సనాతన నూతన దేవాలయములలో స్వర్ణధ్వజ శిఖరప్రతిష్ఠలొనరించి, హిరణ్యగర్భక్రతు వొనరించి సంతత మృష్టాన్నదాతలై మూడుపర్యాయములు సువర్ణ రజతతులాభారములు దూగి, ధర్మముసేయుంచి నిరుపమానములైనసప్తసంతానములు వడసి 66అగ్రహారము లిచ్చి తండ్రిగారి పేరుతో జగ్గయ్యపేట తల్లిగారి పేరుతో "అచ్చమ్మపేట" తమబిరుదములతో రాజుపేటమన్నెసుల్తాన్ పాలెములను నూతనోద్ధారణ గావించి కాశీరామేశ్వరశ్రీశైలాది దివ్యయాత్రలు సేవించి అసంఖ్యాకముగ ఈనాములు ఖండ్రికలు గోదానములు వగైరా లిచ్చి నెమలి వాహనా యాఢులై అదని లక్ష్మీపురము పిమ్మట అమరావతి రాజధానిగాం జేసికొని గజతురగ సవారి సామంత విద్వత్కవి ప్రముఖ పరివృతులయి 33 సం॥ ములు ప్రభుత్వము జేసి, కీర్తిధ్వజము లెత్తించి జగన్నాథబాబు రామనాథబాబు గార్లనుదత్తత జేసి కొనిన వారు శ్రీ వాసిరెడ్డి వేంకటాద్రి నాయుడు రాజా బహదర్ మన్నె సుల్తాన్ వారు" వీరు క్రీ. శ. ౧౮౧౬కు సరియగు ధాత సం॥ మున కీర్తిశేషులైరనియొకరు చెప్పుచున్నారు. ప్రభుజీవితానంతరమునందుమనకవివీరులు శ్రీనాథాదులవలె విలపించుచుం గొన్ని పద్యములు వ్రాసిరంట కానియవియింత వరకు లభించుట లేదు. వీరింకను స్తోత్రి

ములు శతకములుమున్నగా శతాధిక గ్రంథములు రచించినట్లువినుచున్నాడను. వీరిగ్రంథములయందన్నిఁటిలోఁబ్రసిద్ధివహించినదీసరస హృదయానురంజనము.

## — * కృతివిమర్శనము. * —

ఇది శ్రీనాయిని వారిప్రధాన మంత్రి పౌత్తూరికాళిదాసామాత్యుని ప్రియసోదరుఁడగు కుశలవరామ మంత్రి కంకితము చేయఁబడినది.

ఇందుగ్రంథకర్త తనసర్వతోముఖ పాండిత్యమును వెల్లడించిరనుట వింతకాదు. శివరహస్య ఖండమునుండి యీకథగైకొనఁబడె ననికొందరు చెప్పుచున్నారు. కానినాకాగ్రంథములభింపమినాంధ్రీకరణమునుగూర్చి ప్రస్తుతమేమియు వ్రాయఁజాలనైతిని. కవిత్వము ద్రాక్షాపాక మనఁబడి చదువఁజదువనింపునింపుచుండును. యతిప్రాసముల కైయేర్చికూర్చిన కట్టుపదము లిందెందును గానరావు. మహాకవి శ్రీనాథుని తర్వాతి సీసపద్యముల రామణీయక మీకవిశిరోమణికే కుదిరినదని నాయభిప్రాయము. భాషసలక్షణమై ధారనిరాఘాటమై నిర్మలగంగాప్రవాహమువలెసలక్షణమై హృదయంగమమై నిండారియున్నది. మతావేశమను దురభిమానముతో దైవదూషణ మొనర్చి యధఃపతితులగు కుమతులకీ గ్రంథము చక్కఁగా బుద్ధిఁ జెప్పుచున్నది. కవికిఁగల సమత్వము శైవభక్తి శివకేశవుల పరస్పర సంబంధముచే నీగ్రంథమునందుఁ బోధింపఁబడినది. ఇందుసంస్కృతము రెండువంతులుగను ఆంధ్రమొక వంతుగను గూర్పఁబడినవి.

## శైలి.

సీ. ఆరఁగాఁగినపట్టు టావుల దుగ్ధముల్, తన్విఁ దీరఁగనెందుఁ ద్రావలేదె?
ప్రీలఁ బండిన వింతవింత మామిడి పండ్లు నోరూరఁగా మెక్కవారులేరె?
తెల్లఁదేనియపాల తిమ్మనంబులు గ్రోలి లేటవి యించుకలేక త్రేన్పలేదె?
మీగడల్చక్కెరల్ మెదపి సంకీసుండ భుజియించి వికటులై పోరలలేదె?.

గీ. యన్నియుఁటులుండ నిమ్మమాటెన్నఁదరమె, భాగ్యవతినైనయట్టి మప్పార్వతి యన్నసత్రంపుటా నందమవని సురల కమృత సేవనమయ్యె నేమనఁగఁగలము.

స. ౧. ప ౧౪౦ పు ౩౬

సీ, శైశవంబున నిన్నుజదివించుచోఁ జేయుదుడుకుతోడ నెగుర్చుద్రోహమయ్యె
సమధికాభ్యుదయాన సరసింగుభంగి సంధుకుటంబుఁ బిత్రు ద్రోహమయ్యె
నెదురెఱుంగక యీశ్వరేశు నొఁదలమీఁద చూఁచుట జేనశా ద్రోహమయ్యె
విరహిణీ సంతాప కరకరోల్లపనాప్తిఁ గొడవుట స్త్రీవధ ద్రోహమయ్యె

గీ. నొకట రెంటమూఁటు నొనరంగ నాల్గింట, ద్రోహివనుచు నలువ సాహసించి నడిమహాబిలమున బడఁ ద్రోసె నటులయ్యు మానరావె? మాభిమానచింత.

స. ఆ. ౩. ౧౪౦

సీ॥ ఏనాఁటివారలో నెఱుఁగరించుక యమ్మాప్రకృతివారలు గారు పరులుగాని
గుణవంతు లాకారు గుఱుతులేమియును లేవు బ్రహ్మవిద్యేపమ్ము పట్టుఁగొమ్మ
జాతిమాలినవారు సదసద్వి లక్షణాల్ పరమ వైరాగ్య సంచరణ పరులు
మానవం బెఱుఁగరు మర్యాదలును లేవు దుస్సహాయులు జగద్ద్రోహ కృషులు
గీ॥ వారితో బాంధవపు బొత్తు వసముగాదు, తెలిసికలియంగ రాదన్న పలుకవిన మెఱి
యిట్లు కన్నుల నీయంగ నిచ్చగించు మఱపునకు నందచాజోలి మానుటొప్పు॥

సరస. ఆ, ౪, ప, ౭౬,

చ॥ భరితము మాకనర్పితమ్ము నైమదియించుక లేదు ముందు మీఁ
దరసిరసాధి పూరిగ శివార్పణఁ జేసితి మింతమీఁదఁ బు
వ్వాకలవ మైనసోకినర సజ్జలు వుత్తుచుటంచు నేమనుల్
తిరుణులతోడఁ జెప్పి ప్రమథ వ్రజముల్ భుజియించి రత్తరిన్.

సరస, ఆ, ౫, ప, ౧౪౬,

## —* ఔచిత్యము. *—

క. గరుడధ్వజ రంజితరిథ, వ్యరధారోహణ మొనర్చి ఖచరచర కోటుల్
దరతర మరుదేవాంగనా ప్తారయెదురుగ వచ్చెఁబర్హ్వా హయునకు నంతన్॥

సరస, ఆ, ౧, ప, ౫౭, పు, ౫౯.

## —* కల్పన *—

సీ. పలుకనేర్పరి యంచుఁ బలుకకుటేంతి యొకాని కలనైన నప్పతంబుఁ బలుకనేరఁ
డోర్పునేర్పరి యంచు నూహించుటే కాని యొకలపేవతకంబు లోర్వనేరఁ
డీయనేర్పరి యంచు నెంచుటింతియె కాని యొంతవారికి మనం బీయలేడు
పెట్టనేర్పరి యంచుఁ బెద్దలందురు గాని ప్రియసూక్తిఁ బెడచెవిఁ బెట్టలేదు
గీ. సత్యనిరతర గాంభీర్య సరసతలకు, మేటులగువారి లోపల మేలుబంతి
ఘనుఁడు ధాత్రా వంశ పావనుఁడెసుమ్ము రాజనయతంత్రి ధరలోన రామమంత్రి.

సరస. ఆ. ౧. ప. ౧౬౯. పు. ౪౦

## —* భావప్రకటనము. *—

సీ. పని సెపంబునఁ జెలుల్ పైటలోరఁగ నప్పయంతంతఁ దొలఁగుటాయ్యనఁ దలంచి,
సందుసందుల గవాక్షముల నడందు లసుందరుల్ గుజగుజల్ జూపుపెట్టిఁగి,
తలఁపులెల్లనుదీఱఁ దలఁపులన్నియు నొక్క తటినుతిల్లువ ప్రేమధార్ట్య మేఁచెగి,
తక్కుఁదానే చెప్పినఁ దందరఁ జగుతించి నిలువెల్ల గరుపాటు నిండుకొంగి
గీ॥ యమృతవల్లికి ప్రథమసత్వానుభవము, దారసిలనంతలోన సౌందర్యవల్లి
శాఖవయవస్థ యొదవుట నగ్రజాత యెడల్ మాటున నలపోక యొదుగఁ జొచ్చె॥

సరస, ఆ, ౫, ప, ౨౧౯

## —:స్వభావ జ్ఞానము.:—

క. భ్రమపడియడు బిడ్డనుని పండుగ పబ్బములన్ సువాసినీ
స్త్రీ మముష్టఁ బిల్వనంపుట యొకానొక నాఁడునులేదు బ్రాహ్మణ

ప్రమదమునఁ బచ్చటతుకలు పైనిడుటల్ లవణేగ ప్రముక్కుటుం
టిమి యుడిబంధ్ము భావమెకి కడిండి స్వరాగములిస్తు సెల్లు నేకి
సరస. ఆ, ౪, ప, ౯౭

సీ. చాలఁబోదంచి యచ్చముగ వేలిన రాజభోగంపు బియ్యంపు టోగిరమ్ము,
కళుకుమేలిమి వన్నెఁగులికి ఘుమ్మనఁదావి గమ్మకమ్మనికొ్రొత్త కండిపప్పు,
ఆజ్యధారాధూప నావిష్కృతరసాను కూలమైమీగుత్తియ్య గూరఁగంపు
లడిచిడాచినముక్క ళాపిరిక్కఁడు నావడిళమైన పచ్చళ్ళ తిండములును
గీ. అనగమ్మన వాసించు నానగమ్ము దప్పలము మిరియాలచే దనియుఁచారు
ఫంచదార పొరంటిన పచ్చిపులుసు హారషారుల పంక్తి నొడ్డించి రలరుఁబోంట్లు.
సరస. ఆ, గీ, ప, ౧౨౬,

ఉభయ భాషా పాండితీ శోభితమునకీ క్రిందిపద్యములు దాహరణముగాఁ జూచుకొనునది.

—: సంస్కృత రచన :—

సీ. ప్రస్థానభేరికా భయదభాంభారావ బధిరితాశాకోణ భద్రగజము,
గజఘటాఘీంకార గర్జావదాసాగ శమితతాపత్ర విష్ట పచరంబు
వరతురంగతరంగ వల్గచ్చము నేల్ల నాళంకితాభ్ర గంగాశతంబు
మణిశతాంగ శతాంగ ఘృణిగణద్యుస్థలీ ఖద్యోత ఖద్యోత కల్పనంబు
గీ. సకలశుభదాయక ప్రకాశప్రభావ చటుల భటకోటి కిలకిలోద్భట మహోగ్ర
సింహరవభీషణంబౌచు జెలఁగెనమ్మ యూరవాహన జైత్రయాత్రోల్లసనము.
సరస. ఆ, ౧, ప, ౨౪౫,

—: ఆంధ్రరచన :—

క. కన్నెలయిరవుగ నుదుటం గన్ను గలుగు వేల్పు మిన్న గాదిలిచెవయుఁ
గన్నుగల మింటిమమతల మన్నెటికపుదంట లాలుసాలుగ నేసెన్.
సరస, ఆ, ౨, ప, ౪౨, పు, ౬౬,

ప్రబంధమునందుఁ బోధింపఁ దగిన వర్ణములన్నియును చితరీతి నందందు నెలకొల్పఁ బడియున్నవి. విస్తరభీతినిటను దాహరింపక విడచుచున్నాఁడను. వర్ణనాధిష్ఠంబున నిందుం దండు హితంబు లుపదేశింపఁ బడినవి. యిట్టి క్రింది పద్యములు గన్నుఁడు.

సీ. కవితావిలాస సంఘటనాపటిమల కిచ్చుటే గాదులో మెచ్చనేర్చు
కడఁగి ధర్మాధర్మ ఘనపరిష్కారమ్ము లేర్పుటే గాదుతాఁ దీర్పనేర్చు,
వేదాంత వాక్యార్థ విజ్ఞానసారంబు దెలియుటే గాదాత్మఁ గలయనేర్చు,
బంధుబృందంబులో పలసెయ్య మలరంగ నించుటే గాదు లాలించనేర్చు
గీ. చతురుదాకర పరివృత క్ష్మాతలాంత కాంతి దామాత్య వర్గ విశ్రాంత గుణని
తాంతవరగుణ పేటియై తనరు రామ చంద్రసచివేంద్రునకు నెందు సాటిగలదె.
సరస. ఆ, ౧, ప, ౬౯,

సహృదయ హృదయానందనంబు గానుండాడు యమకంబుం గూడఁ గాన వచ్చెడిని.

సీ. జయముచేఁ బరలోక భయముచే, ధర్మనిర్ణయముచే, నరపాల నయముచేత,
ధనముచే, విబుధ వర్ధనముచే, పుణ్యసాధనముచే, దక్షమండనముచేత,
జలముచే, ఘనభుజాబలముచే, బటుతపఃఫలముచే, జగమెచ్చు కులముచేత,
శమముచే, బంధుసంగమముచే, విభవసంక్రమముచే, విమయసంయమముచేత
గీ. ననుపమానపరిభావ భావానవరాగ సంగతి చిరంత నాధీశ సమితిమీఱ
వెలసె జినరామలింగ భూవిభుఁడు స్వాంతరంగ బహిరంగ శోభనాభ్యాగతుల.

సరస. ఆ, ౧, ప, ౧౯౨

లేఖకము ద్రాపక ప్రమాదపతితములగు దోషములిందు గానఁబడుచున్నవి. ద్వితీయము ద్రణమునవి సవరింపఁ బడునని నమ్ముచున్నాఁడను. ఇందలి వర్ణనములను ప్రమాణములు కల్పనములతి మనోహరములు. కథాసంవిధానము కడుంగడు రమణీయము ఉపమాద్యలంకారములకు గనియై మాధుర్యాది గుణములకు నిలయమై భాషామతల్లికి మౌక్తికహారమై సరససహృదయానురంజనమొనర్చు నీ సరసహృదయానురంజనము మహాకవి శ్రీములుగు పాపయారాధ్యులకు బ్రతిబింబమై తనరు ననుట కేమాత్రమును సందియము లేదు. ఆధునికకవులకే గాక పూర్వకవులకును నీఫక్కి పెక్కు మాఱదికలవడ లేదనుట సాహసము గాదని విన్నవించుకొనుచున్నాఁడను.

ఈవిద్వద్వరేణ్యుని గ్రంథములనుండి కొన్ని పద్యములును సమస్యాపూరణమును జాటుపద్యరచనము సహృదయహృదయానందమునకైయొత్తిచూపుచు నీపీఠిక నింతటితో విరమించుచున్నాఁడను.

శ్లో. శ్రీవేంకటాద్రి నృపతేర్గుణరత్నరాశేరేకాదశీవ్రత విశేషకథా ప్రసంగః
చంపూప్రబంధ తిలకోభజతి ప్రతీతిం విద్వన్నుతా మతిశయోర్తిధరాగరిష్ఠః
శ్లో. వీరశ్రీవేంకటాద్రి స్ఫుట పటుతరదోస్తంభ నిర్దంభకుంభ
క్షిగ్గస్వర్భాచ భుక్తద్విపదధిపమశోపి క్రమాబ్జార్కబింబే
హారంహారం స్ఫురంత్యా స్త్రిభువనమమలేతద్యశోద్యుస్రవంత్యాః
పూరేస్నాతీవనో చేదుకు గణమిషతః కింబభుస్స్వర్బదాని.

ఏకాదశీ చంపువు.

శ్లో॥ శ్రీశైలభ్రమరాంబా ధీశే కేశీకృతాఖిలాకాశే
శ్రీశనుతే శాశసితే పాశచ్ఛేదిని మమాశయో భూయాత్॥
శ్లో॥ రాజశిరోమణి రాసీ, ర్భాగిభుజంగావళీ పరిష్కారః
శైలకన్యకా నాథ్యల మిత్యార్యా శతమర్పయే గ్రహేశేశ॥ ఆర్యాశతి॥

శ్లో. శ్రీయం డిశతు కేళికాష్ఠ భవనదర్పణోంతస్థ్సలీ నిజప్రతికృతేక్ష హా స్వమరుచిస్వభావేదధత్
పరస్పరపరియాత్మతాం పరికలయ్య యద్భాసతే జ్వలత్ప్రకరం మహాస్సమరసం సనాతీనరం.
శ్లో. స్తువంతినిందంతి హసంతి యేపుః స్తువామ నిందామ హసామ తానయి
యథావయంచైష కిము త్తమగ్రతా గుణాగుణజ్ఞైపృథ మస్తితాంగతాః.

కల్యాణ చంపువు.

ఉ. అకులుఁ గాయలుఁ మెసవియందము కానల పాలుచేసి పే
రీకలుదీయు కోడిపతె నిట్టులునీఅడి బోతిమింక నే
ట్లాకప జేయువాఁడ సాబకారెకు బోయెకు బుట్టుబమ్మరోయే
లాకలిగించెనీవ డెగదారెయెఁగ దావలవంతవంతయయ్యన్॥ సర్వ. 3వి

క. ముప్పదిలక్షలమణులును గప్పురముం గస్తురియును గందమువలువల్
ముప్పందుము ముత్తెమ్ములు నొప్పెకు పేను వాడత్రోడ నోడలుమునిఁగన్.

వేమసారాధ్య చరిత్రము.

క. ఎడఁబాయరాని మమతల విడనాడను గానిసతుల వేదనలనుచే
పడిహరి హాయుఁడను బడలఁడె పడఁతులపై మోహభరమ పారము గాగన్.

అహల్యా సంక్రందనీయము.

సీ. దిక్కాల భామినీ దీర్ఘ వేణికలపై, నెవ్వాని పదధూళి పువ్వుబంతి
సుకకోటు లెవ్వాని చూపుకోపులదండ, నాంఛితా పేకుచే వదలలేరు
సర్గస్థితిధ్వంస సహజకృత్యములకు, నెవ్వానిభ్రూసంజ్ఞ హేతుసత్తు
అద్వితీయుండయ్యు సద్వితీయభ్రాంతి, నెవ్వాఁడుజగముల నెసక మెసగు
గీ. తలఁపువలఁపులలోఁజొచ్చి తాను నేను ననెడిమెలపుల గలిపుచు నఖిలభూత
చేతనంబెల్ల దానయై చిక్కు లేనపు నట్టి చిజ్జ్యోతి విశ్వేశు డతఁడ కాడె.

ప్రథమస్కంధము. ప, 113 శ్రీమత్ దేవీభాగవతము.

శా. ప్రస్థంబెక్కి ఋషీలునం జగ్గు జారస్వచ్ఛ కాలాహిచే
దుస్థంబైనను వామలూరువున కేల్దోచ్పంగ పచ్చుకదహా
గ్ని స్థానంబున నిల్వవచ్చునది సంధింపంగ రాదిమ్మహా
ప్రస్థానావసరంబు డాసెదరెఁ జేర్వన్ నీవ సూభాగ్యవతీ! శశికల.

శా. ముక్తాపాండురహాస చంద్రికలు కెమ్మోవింగు బాలింపహా
ద్వ క్త్రాపశ్రేయి విన్నవించి పతికెంతే ప్రేమఁబుట్టించి ప్రా
గుకాళీ చరణాంగ దారవసముద్యోతాంగి వైవచ్చినీ
ముక్తిద్వారముతల్పుఁ దీయగదె చాముండా జగజ్జీవనీ. తారావళీ.

—* సమస్యా పూరణము. *—

శా. శీంద్రాంశః కరణంబువన్ ఘనము వర్షాకాల మేఘుతుర
ప్రేంగనస్య స్ఫుటసస్య వత్సకలకే దారప్రతీరంబులన్

సంగ్రహీతయ్యెఁడు రాజరత్న శ్రీమతి శ్లాఘ్యా కృతిందోఁచెసీ
"రంధ్రంబయ్యె శిలీంధ్ర మాంధ్యమున సైరంధ్రీ పురంధ్రీమణీ"

క. అజాత్రిజిత క్రమాకలి తజాప్త భజించి కనక తతిఁదొప్పఁగనా
బ్జాప్తత గ్రహగతింగని "వజ్రపు మొనమీఁద నొక్క వాపిజనించెన్"

—* చాటుపద్య రచన. *—

చ. కలుషసరిత్తరీ ప్రపిత గస్థకరీ మహిభృత్కరీ భజా
వలచిదురీ దయారసవి శాలఝరీ నిగమార్థమాధురీ
ఖలగజకేసరీ విభవ కంపిత మేరుగిరీ నతాంబరీ
జలపదరీవరీ కుహర భాస్వరీ యడరీగిరీ హరీ.

సీ. ధరణినే విభుఁడద్య తనభోజ రాజంచు విద్వద్గణంబుచే వినుతిఁగాంచె
తెలియనే ఘనుఁడిఁదా నింతనరాధేయుఁ డని రాజసభల విఖ్యాతిఁగాంచె
నేమహాప్రభువనవ్యడిలసధునాతన రుక్మాంగ దుండను ఖ్యాతిగాంచె
నేన్నపుఁడై దయఁగీ నార్జునుండని ఘనులచేతఁ బ్రస్తుతులు గాంచె

గీ. అఖిల విద్యాపరిశ్రమాక్యంతదాన శౌరిహరివాస రాత్యంత చర్యవడపి
నట్టి శ్రీవాసిరెడ్డి వంశాబ్ధిపూర్ణ చంద్రుఁడన వేంకటాద్రి ధాత్రీంద్రుఁ డలరు.

చ. కమలము లర్క కాంతినివి కాసమునొందు నటుల్ మనీషి హృ
త్కమలము లుల్లసిల్లఁ దనకమ్మని పల్కుల ముద్దులొల్క ప
ద్దెములను గూర్చి కావ్యమునుదద్దడి నొద్దిక నీకొదక్క ని
క్కము కవిలోక పూర్తికముగా నిను నెంచెద సంగమేశ్వరా!

జగ్గయ్యపేట.　　　　సంపన్నమంబ సింగరాచార్యులు.
12- 9- 26　　　　శతావధాని.



# విషయసూచిక.

—* సరసహృదయానురంజనము - ప్రథమాశ్వాసము. *—

| విషయము. | | | పుట. |
| --- | --- | --- | --- |
|  |

—* సరసహృదయానురంజనము - ద్వితీయాశ్వాసము. *—

| | | | |
| --- | --- | --- | --- |
|  |

—* సరసహృదయానురంజనము - తృతీయాశ్వాసము. *—

| | | | |
| --- | --- | --- | --- |
|  |

సమాప్తము

# విజ్ఞప్తి

ఆర్యులారా!

ఈ సరసహృదయానురంజన ప్రణేత యగు ములుగు పాపయారాధ్యులు మాపెదముత్తాతగారు. వేదశాస్త్రాధ్యయనం బొనరిచిన యీపండితా ఖండలుఁడు క్రీ॥ 1783 వ శతాబ్దమున శ్రీరాజా వాసిరెడ్డి వేంకటాద్రిప్రభువర్యుల యాస్థానంబున విద్వత్కవీంద్రుఁడై సర్వ సత్కృతులందుచు నాచంద్రార్కయ శస్థ్సితి సమర్థకముకృతియకాయః "అదుష్టసగుణసాలంకారశబ్దార్థయు గళంకావ్యమ్మను" మమ్మటభట్టోక్తియు] "కావ్యం గ్రాహ్యమలంకారాత్" అను వామనసూక్తియు" కావ్యశోభాకరాన్ ధర్మానలంకారాన్ ప్రచక్షతే" అను[ఆచార్య దండివచనము] ఇత్యాదితత్స్వరూపప్రబోధక వాక్యజాలంబుఁ బూర్వోత్తర పర్యాలోచనంబునఁ బరిపాలించి శతాధిక ప్రబంధములనుభయభాషల రచించి రాజాస్థానంబుల "మహాకవి" "అభినవకాళిదాస" ఇత్యాదిబిరుదంబుల నందినధన్యతముఁడు.

వాసిరెడ్డి వారిసంస్థానమున నాబాల్యమునుండి వర్ధిల్లి శ్రీరాజా వా॥ వేంకటాద్రి ప్రభువర్యుల సత్సభ సర్వవిధకవితా చమత్కృతు లంజూపినగ్రంధభాగము కీ॥ శే॥ వేమనారాధ్య భాగ్యత్రయా యుర్వేద శిఖామణి కోటిలింగా రాధ్యులవారి యొద్దఁజూచితి. ప్రస్తుతమది లభించలేదు.

ఈయనఘుఁడు కాలవశమున జీవగఱ్ఱ యగు నాయని విడనాడిముప్పది యారు వత్సరంబు లెటులో జీవించి క్రీ 1832 లో నమరావత్య మరేశ్వరునియందు సాయుజ్యము నొందెను.

ఇక్కవి గ్రంధములకొన్ని 74 వత్సరములకే ప్రశిష్యులు ప్రపౌత్రులు జీవించియుండఁగనే కాలగర్భమునని మిడియుండుట కడుంగడు విస్మయమును విషాదమును గలిగించునని వేఱచెప్పనక్కఱలేదు. 10 సంవత్సరములు సంపూర్ణప్రయత్నములు సేయఁగా

1 శ్రీమద్వేమనారాధ్య చరిత్రము 2 సరసహృదయానురంజనము 3 సర్వమధురము [అచ్చతెలుఁగు] 4 కల్యాణచంపుప్రబన్ధము (సంస్కృతము) 5 అహల్యాసంక్రందన విలాసము 6 శివస్తోత్ర సముచ్చయము 7 శ్రీమద్దేవీభాగవతము [1, 2 స్కంధములు] 8 ఏకాదశీ చంపూప్రబంధము (సంస్కృతము) 9 ఆర్యాశతి (సంస్కృతము; కొంతభాగము) ఈతొమ్మిది గ్రంధములుమాత్రము నాకు లభ్యములైనవి.

మాపినతండ్రులు విద్యావిశారదులు లక్ష్మీకటాక్షవిభ్రాజితులు నగురా

మలింగారాధ్యులవారు ప్రభృతులు శ్రీపాపయారాధ్య భారతీసంసేవనము నా కుఁ బ్రసాదింపఁ దలఁచి మునుపలుప్రయత్నములాచరింపరుకాని వేఱు కారణమునచింపనను వగునా? తగువాటి సౌకర్యములు లేకున్న నేతద్గ్రంథ ప్రకటనము స్వకృత్యమని యెంచిరక్తాక్షి సంవత్సరమునఁ గేవలాంధ్రప్రబంధమగు సర్వమధురమును ముద్రింపించితిని.

పిమ్మట మిశ్రకావ్యమగు నీగ్రంథమును ముద్రింపించు యత్నము నకు గడంగి శ్రీశైవప్రచారిణీ పత్త్రికాధ్యక్షులు బ్రహ్మశ్రీ కొడిమేల రాజలింగారాధ్యులవారి యాజ్ఞ శిరసావహించి స్వీయపత్త్రికాముఖమునఁ బ్రకటించుట కియ్యకొని దీనివారికి సమర్పించుకున్నాఁడను

ముద్రితములగు "సర్వమధుర" సరసహృదయానురంజనముల చిరకాలమునఁ బాఠక మహాశయుల కరకమలము లలంకరించు స్థితిగల్గెనేని దదీయములగు నితరగ్రంథములను వత్సరంబున కొక్కొక్క పుస్తకము వంతునఁ బ్రచురింపఁ గలభాగ్యము, నాకుఁగల్గెడినని విన్నవించుచున్నాఁడను.

బ్రహ్మశ్రీ ములుగు రామలింగారాధ్యులవారు పుత్త్రవాత్సల్యంబున శ్రీమద్దేవీభాగవతాది గ్రంథములఁ బ్రసాదింప నభ్యర్థితులు నంగీకారయుతులగుదురు గాతమని విన్నవించుచున్నాఁడ.

నాద్వితీయ ప్రయత్నమునకు మహోపకృతిగా శైవప్రచారిణి యన్వార్థాభిధయగురీతిగా శ్రీపాపయారాధ్య భారతికిఁ బ్రఖ్యాతి గల్గించిన మహాశయులగు శ్రీరాజలింగారాధ్యుల వారును, ముద్రణావసరమున స్వీయపత్త్రికా సంపాదకత్వభార మొదలనిడి కొనియు స్వకృతి కన్యకగా సర్వాలంకారములిడి పరికాశింపఁ జేసిన 'విద్వాన్ ముదిగొండ వీరేశలింగ శాస్త్రులవారును, ఈ సరసహృదయానురంజన పీఠిక వ్రాయుఁడని యభ్యర్థితులయినంతమాత్రమున తమ భాషాభిమానమును బ్రకటించుచు దత్కార్యము నిర్వహించిన మస్మిత్రులు శ్రీమాన్ శతావధాని సంపన్ముదుంబ సింగరాచార్యులు గారును ప్రశంసనీయులగుట ననేకాభినందన సహస్రము లర్పించుచున్నాఁడను.

అస్మద్వంశమూల పురుషుఁడగు శ్రీమద్వేమనారాధ్యుల వారి చరిత్ర నీసంవత్సరమున ముద్రించు ప్రయత్నము జరుగుచున్నందున మావంశవృక్షమిందు బొందింపఁబడనందులకుఁ బాఠకులు మన్నించుదురుగాత.

జగ్గయ్యపేట
12. 9. 1926

విద్వజ్జనవిధేయుఁడు.
ములుగు వీరభద్రయ్యశాస్త్రి





శ్రీ సాంబగురవేనమః

# సరసహృదయానురంజనము.

## ప్రథమాశ్వాసము.

### — ఇష్టదేవతాప్రార్థనము. —



వర్థిల్లఁగ సంబక త్రయమునన్ సృష్టి స్థితి చ్ఛాదన
ప్రావీణ్యం బెఱుఁగంగఁ జేయుచుఁ బర బ్రహ్మంబు దానై సమ
ద్భావాంభోరుహ చంచరీక కలనా పారంగతుండౌ మహా
దేవుం డీశుఁడు మత్కృతీశునకు నుద్దీపింపఁ జేయున్ సిరుల్.

ఉ. మువ్వురు మూర్తులం గనుచు ముజ్జగముం దగవారి చెయ్వులన్
నివ్వటిలంగ సేయుచు మ నిప్రకరంబుల చిత్తవీథులన్
మవ్వము గుల్కఁ జిన్మయ సు మంబుల బూజలుగొన్న యుంబదా
నివ్వసుధం గృతీశ్వరున కిచ్చుఁ జిరాయురవాప్తి నిచ్చలున్.

సీ. సతిరోమ రాజితో సరియాట వివరించి నందకమ్ముఁ గరమ్మ సందు నునిచి
పతికన్ను దోయితోఁ బ్రతియాటఁ బఱికించి కమలాను షంగమ్ముఁ గర మొనర్చి
సఖిభ్రూయుగమ్ముతో జతయాట మదినెంచి సుమటశార్ఙమ్ముబా హువ్రసమర్చ
పతికడ నీవల్వ పసిమి యుద్దియటంచు నట్టిడాల్ నెమ్మేన సందగించి
స్వాంత రుత్కాంతపై నిట్లు సందడింప స్థిరపతీరబ్ధి బయలెక్కి తేటపఱుప
నెసఁగు వలపుల కడలిలో నీదునాది రమణుడిత్తును కుశలవ రాము సిరులు.



ఉ. హంస తురంగుడై పరమ హంసల కెల్లను పాస్య మాను పై

హంస సుధాకరానల గుహాంతర వర్తనలక్ "జగన్మయో
హంస" యటంచు నెంచిన మహాత్ముల హంస నిరోధ వేళలో
హంసము దానయావిధి కృతార్థుం జేయుత మత్కృతీశ్వరున్.

పిలువం బేరును మ్రొక్క దేవుడును గాన్పింపంగ రాకున్నచో
గలయన్నామ విభేద మేర్పఱచి చక్కన్ విష్ణు రుద్రాదులం
గలుగం జేయుచు జీవకోటికి సమగ్ర శ్రేయము గూర్చునప్
ప్పలుకుం గొమ్మ కృతీశ్వరేష్ట మొనగూర్పం జాలుగా కిమ్మహిన్.

నిత్యానంద చిదాత్మ రూపమున నెంతే మీను మీఁదైన దా
నత్యంతాదరవృత్తి జీవులకు నా యా మానుష వ్యక్తి చే
సత్యార్థం బొసఁగంగ భూతలమునన్ జన్మించు నారాఘవా
పత్య శ్రీరఘురామమూర్తి సకలైశ్వర్యంబు మాకీవుతన్.

ఏపుఫుంబోణి పుట్టిల్లు నాగేటి చాలేనాతి గుణామణుల్ వేనవేలు
ఏలోటి కొనరింతు రెల్లరు జేజేల నేయింతి సకలార్థ మీయఁ జాలు
నేనాతి సౌందర్య మించుమించుల నేలు నేయన్ను నుతిదరిఁ జేయించుకీలు
నేకొమ్మ కనుదోయి మెలమి వాలుం గమీ లేబోటి నవ్వు రేరాజురాలు
అట్టి కడలికి గట్టిగా నట్టనడుమఁ గట్టఁ గట్టించి నలఁదాగు దిట్టగొట్టు
జెట్టికైనట్టి యిల్లాలు శ్రీసమృద్ధి కుశలవామాత్యున కొసంగుఁ గోర్కెదీఱ.

మత్స్య కూర్మ వరాహ మహితకల్పన మొంది నారదస్తుతుల నానందమెనసి
వామనాకలనచే వర్ణనీయతఁ గాంచి రామనామ త్రయీ రసికుఁడగుచు
బుద్ధ భావమున సంపూర్ణత సాధించి దశమీవివేక సంధాన మేర్చి
స్ఫుట తరాంతర్ద్వీప భూతిఁ జెన్నలరారి నిగమవాగ్వైదైక నిష్ఠఁ దవిలి
యవని "నారాయణో వ్యాస" యనెడుసూక్తి వ్యాటిలఁ జేయునట్టి నిర్ణిద్ర భాసు
వ్యాసు నభినుతిసేతు నద్వైతసిద్ధిఁ గుశలవామాత్యునకుఁ గృప గూర్పఁ గోరి.

దక్షాధ్వరధ్వంస తాండవాడంబరాధార రౌద్రోన్నిద్రు వీరభద్రుఁ
బ్రారంభితక్రియా భంగ పర్వతపక్ష భిదురశౌర్య సనాథు విఘ్ననాథు
బ్రాహ్మీ పరంపరా పారదృశ్వ క్రమాభరణ భూషితగాత్రుఁ బవనపుత్రు
నిఖిల ధర్మాధర్మ నిశ్చయాపాదనాభ్యర్హ తేజస్సుస్యు హయవరాస్యు
మదిఁ దలంచెద దుష్టని ర్మథనకావ్య నిర్వహణకీర్తి విజ్ఞాన నిర్మలతల
నెనసి కుశలవ రాము ... సప్తసంతతి కృతి ప్రభూధమా ద్యంత మొనయ

మ. నిరతిన్ బ్రహ్మ ఋషివ్రజమ్ముఁ బ్రబలిప న్నిర్ణేతృ దీక్షావిధిన్
సరణుల్ దప్పినఁ దత్సదోంతరమున న్నాత్మాత్కృతి-న్యాయబో
ధరమా శ్లేషుల జేసె పూనియయుంచి త్రుంచబట్టి స్వగ్రోధ మూ
లవేటు స్గ్గాటమహానటు స్వాటు నుపశ్లాఘింతు వాక్సిద్ధికిన్.

— గురువందనము. —

సీ. ఆరాధ్య సింహాస నాంబురాశికిఁ బూర్ణ రాకాసుధాంశుఁడై రమ్యమూర్తి
శిష్య హృద్గత తమ శ్ఛేదనా పాదనా ర్చిష్మంత మెవ్వాని శిక్షణంబు
షడ్దర్శనీవచ స్సాహిత్య విధి సరో విహార స్మరాళమే విబుధు మనము
భక్తి భావాంబూని బాధ శాంభవ మహా సింధురం బెవ్వాని చిదభివృద్ధి
పటుశమీ శాఖ కాశిఖా పటనిరుద్ధ జాతవేదప్రమాణా ని శ్శంక బిరుద
మెవని కీరేంపు జగముల నెసఁగునట్టి శంభులింగార్య దేశిక స్వామిఁ గొలుతు.

— కవిస్తుతి. —

ఉ. భారవి హేమ చంద్ర కవి భల్లట బిల్హణ కాళిదాస మా
యూర మురారి చోళ నిచు ళోద్భటు లాదిగ నాద్య భారతీ
పారగులం ద్రిలింగ కవి భాస్కర భాస్కర యజ్వ పోతరా
ఢ్యీరుల సూరులం గృతిమ తిస్థిర తారతి క్షాత్మ నెన్నెదన్.

— కుకవి నింద. —

కం. కాకవు లారా, కపి వాక్పాక గ్రథనాను కూల్య, పాటచ్చరతా
శ్రీకర కేకరతలు మా, పైఁ గొలుపకుఁ డిదియె మాకుఁ, బదివే లింపుటల్,
శా. ఏతాదృగ్విధ వాక్పరంపరల బ్రాహ్మీసిద్ధికిన్ దేవ తా
పఘాతిం గౌరవ గౌరవోల్లస దను స్ఫూర్తిం బొసంగించి ని
ర్ణేతృ ప్రాభవ శూన్యులం గుకవుల న్నిందించి పౌరాణిక
వ్రాతస్తవ్య కథాను భావ్య సుషమా భవ్యంబుఁ గావ్యంబొగిన్.

వ. విరచింపం దలంచి యుక్తి-రచనా చుంచుమన స్సముదంచనా శ్యంచి

తుండనై కూహకోత్సాహ దురవగాహంబగు నూహం బెనంగు సమయంబున.

సీ. తన కీర్తి కర్పూర తతులు ధాత్రికి గంధ పత్వంబు సార్థభా వమునఁ జొనుపఁ
దనదానధారల ర్థినికాయ దారిద్ర్య చటులానలార్చులఁ జల్లనార్ప
దనమంత్రశక్తులు జనపాలకైశ్వర్య సస్యంబులకునబ్జ సమితిగాఁగఁ
దనరూప మిందుకుం దాస్త్రాములకునైనఁ బలుమాఱు మదిసిగ్గు పాటుఁ బెనుప
రాజమాన్య గుణవ్రాత రాజమాన్య రాజసచివాగ్రిగణ్యుఁడై రాజసభల
మెచ్చునచ్చులగుమిగూర్చు మృకులహృదయు రమ్యనయమంత్రికుశలవరామమంత్రి.

సీ. విద్వద్వ తంసముల్ వివిధ ధర్మాధర్మ విధులొక్క వైపున విస్తరింపఁ
గవితానిబంధనా కర్కశప్రాచుర్య కవులొక్క యోరఁగాఁ గ్రందుకొనఁగ
నఖిలమనోరథా వాప్తిజాతామోద యాచకావలి యొక్కయెడల నిలువ
సాక్షీభవచ్చైల సత్ప్రపత్పరితిచ్ఛాయ బంధు బృందం బొక్క పజ్జనలమ
సరసవీణావినోదగా నరసధుర్య గాయకవ్రాత మొకచెంతఁ గలయఁబర్వ
మణిగణోజ్జ్వలమూసభా మంటపమున రక్తిగొలువుండి కుశలవ రామమంత్రి.

సీ. విబుధసీమంతినీ వృత్తవక్షోజచం దనకర్దమములలోఁ దాండవించి
భుజగపుంగవవధూ వ్రజహారహీరప్ర భాచకచ్చకలక్షోఁ బ్రతిఘటించి
హరిదంగనామనో హరపరిగ్రహాకటీ తటదుకూలములతోఁ దారసించి
కుకురులాటవరాట కోసలాదినృపాల లలనాస్మితములతోఁ గలసిమెలసి
యలరునేమంత్రిసత్కీర్తి యతఁడురాజ మాన్యమంత్రాంగశక్తిశుం భన్నిశుంభ
సంభృతోత్సాహమత్కృతి స్వామియైన రమ్యనయతంత్రి కుశలవ రామమంత్రి.

వ ఒక్కోలగంబుగాఁ గొలువుండి యనంత: మణి ఘృణి ప్రచయ పరిష్వంగ
రంగదుత్తుంగ తరంగ సముజ్జ్వలన సింహాసనంబున నుదయ గిరి శిఖరస
మారోహణంబున నెసంగు ననంత మణి వసువున నుల్లసిల్లుచు నిరంతర
నిరంతరాయ సౌమనస్యాభిసస్యానూన గరిమంబున విబుధులగు విబుధు
లును, భవ్య కావ్య సమాఖ్యాన బంధ బంధురతా రామణీయ కంబునఁ
గవులగు కవులును, మంత్రాంగ నుచర్చికా చర్చా సమారూఢ మనో
వ్యాపార పారీణతల గురువులగు గురువులును, సురభీ సమయాను బాధి
రసావస్థాన సంసూచ నంబున గణికలగు గణిక లును, భువన భయంకరా
హి భయంబులకు నరేంద్ర పటులగు భటులును, నక్షాంతక శ్యామా ప్రతి
పాదన వ్యూహ... ...హితులగు పుూ

తులునుంగొలువ నెడనెడ గుణసింధువులగు బంధువుల యప్రాపు గౌరవధురాపరీపాక సురభిళంబులగు వాగమృతంబుల మేను నిరుపమానసుఖస్థితిం బొరయ సాట్టహాసంబును సపులకోద్భేదంబును ససమసుషమా సమారూఢతారకా సముల్లసనచుంచు చంచన్నయన దృక్తరంగమ్మునునగు పునరుక్తి సంధాన కౌశలంబునకు నివ్వెఱవడు నాగరికరసికజనంబుల మనంబులకు రసార్ద్రితం బొడగట్టంజేయుచు నర్థిసమాదరణంబుల సురధరారుహ మహిమంబులు సంసూచిత గంధగంధాంశంబులై వెల్లివిరియ శిబిదధీచి సురమణి ప్రముఖ నిఖిలోదార ధిక్కరణవిత్త హృత్తామరస సరస సమున్మేష వశంబునం గవిజనతా ఘనతాసంపాదకయశః పారంపరీపరీరంభ సంభావనా విశేషసంగ్రహణ హేలాతత్పరుండై పొత్తూరి కులకలశ పాథోనిధాన రాకా హిమకరుండగు నమ్మంత్రికంఠీరవుండు.

మ. నను విద్వజ్జనజాలలాలిత వచో నైపుణ్యవత్సంభగుం
భనధారాళకవిత్వ తత్వకలనా పారంపరీపారగున్
ఘనదైవజ్ఞ కలావిచక్షణమనః కౌశల్యుం జేరంగర
మ్మనిరావించి వచించె నంచితవచో మాధుర్య మేపారంగన్.

మ. వరపుంభావసరస్వతీ చతురతా వాల్లభ్య సంసూచనా
కరపాతంజల వాగ్విశుద్ధకవితా కల్హారచూళీరసాం
కురితస్నిగ్ధ నిబంధబంధురకథాం కూరాంకితగ్రంథక
ల్పరతోత్సాహివి! పాపయార్య సుకవీ! ప్రత్యక్షశోభారవీ!

క. రసనవకము తేనియ సా రసమునం బలెనీదుచిత్త రాజీవమునన్
రసవంతము గావున సా రసరణి వివరింతు నొక్క రమ్యతరోక్తిన్.

క. ఆరాధ్యమూర్తులరు మీ రారయ బంధువులు గురువులై తిరిగానన్
గౌరవమున నోపాపయ గారూ! యాశీర్వదించి గ్రంథమిడందగున్.

చ. సరస మృదూక్తివైభవము సత్కవిలక్షణ పాటవంబు బం
ధురసుగుణానుషంగమును దుష్కరసాహితిం గల్గుమేటివీ
వరయుగం బాపయార్య! విబుధావళిమెచ్చంగ నొక్కగ్రంథమి
ప్పురుసునం జెప్పిమాకునుశుభంబుగ సత్కృతిం గూర్పంగాందగున్.

క. అనిజనితానందముతో ననుంగనియమ్మంత్రివరుండు నవ్యతరయశో
ఘనతాదిమజ్జనతాజయ వినుతాతిశయమ్ము గ్రమ్మ వెండియుం బలికెన్.

శా. సంతానోత్తమమైన గ్రంథకృతిమ త్సంతానమందర్థికిన్
సంతానద్రుములైన ప్రగ్గడలను చ్చైర్లీలనంకించిన
త్సంతానమ్ములుమెచ్చఁ బుణ్యతరమా చారిత్ర మీవాద్రుతిన్
సంతానస్థిరకీర్తి సంపదలుమిం చంగూర్చిమాకీదగున్.

ఉ. రాజసభాభిరంజకపురాతనపుణ్య కథాసుధార్ద్రమై
రాజకిరీటగౌరవధు రామధురాచ్ఛ గుణాలవాలమై
రాజిలుకావ్య మొక్కఁడు చిరంతనపుణ్యరమానుభూతికు
త్తేజకమాకృతిన్నుడివి తేర్పుము మద్హృదయాభిలాషమున్.

ఉ. నావిని నూత్నకావ్యరచ నావినివేశిత చిత్తవృత్తినై
కేవలకల్పనాకథల కించిదుదంచన భావమూనిపు
ణ్యావహపూర్వ సత్కథల నారసి యారసికాగ్రయాయికా
పోవనిమోదమీనెడు న పూర్వకథన్ రచియింపఁ గోరుచున్.

వ. అప్పుడొప్పులకుప్పయగు నప్పురుషసింహంబర్పించు కప్పురంబును గొప్పలైన యొప్పులకుప్పలనొప్పు హాటకముద్రికాముద్రిత వీటికాశతంబును, సుగంధగంధిల ప్రశస్తవస్తుకోటి కోటీరంబగు పాటీరంబును, పటుపటక్షోదిత పటవాసక్షోదంబుల సుకుమారంబులగు దుమారంబులనభినవ జాంబూనదాంబర విభూషణాడంబర సంబోధనంబుల నింపుసంపాదింపుచు సబహుమానంబుగ విడిదికనిపినంగదలి నిజమందిరంబుఁ బ్రవేశించి సహృదయ హృదయాహ్లాదంబగు నేతత్కావ్యంబున రచియింపం దలంచిన వాఁడనై, కృతిపతివంశావతారంబభివర్ణించెద.

-* కృతీశ్వరువంశకథనము *-

సీ. బాసవాల్ధోరకంటి పాపనితలఁదాల్చు టాపదుద్ధారకుఁ డౌటఁదెలుపఁ
గట్టినెచ్చెలిమాయ కలికిఁగౌఁగిటఁజేర్చు టఖిలేశ్వరేశ్వరుం డౌటఁదెలుప
బకుగుతాపసికెక్కు టకుగొక్కటిచ్చుట యతిభక్తవత్సలుం డగుటదెలుప
నపరంజిమలవింటి కనువుగావించుట యఘటితఘటనాంకుఁడగుటఁ దెలుప
వఱలుశశిశేఖరుఁడువిష్ణు వల్లభుండుభృంగివరదుండుగిరిధన్వి త్రిభువనములఁ
గనఁగరక్షింపననఁపద ఁుతవహించి సకల కారణమైయొప్పుసాంబమూర్తి.

సీ. ఏదేవ దేవున కెల్ల బ్రహ్మాండముల్ చదురుసేయంగని చ్చాగృహాళి
ఏమహా పురుజగ త్సృష్టికల్పనముల కాణాచియగుమూల కారణంబు

ఏపరంజ్యోతికి నిహ పరంబులు రెండు సాధ్యాస వికృతులై సందడించు
ఏయనిర్వచనీయుఁ డేమియుఁ దాఁ గాక యన్నియుఁ దానయై యలరుచుండు
అట్టితత్త్వాదితత్త్వమే మట్టుమీఱి వెలుఁగునకుమూలమైనపె న్వెల్గు శివుఁడు
చిద్ఘనాకారుఁడైనని శ్శ్రేయసంబు వాగ్మనంబులకందని వస్తువతఁడు.

శా. ఆసక్త్యేశ్వరునందుఁ గల్పితభిదాధ్యాసంబునన్ గర్తృతా
భ్యాసుల్ మువ్వురు వేల్పులుద్భవిలిర వ్యక్తస్వభావంబునన్
భాసాం సేవధులందు సృష్టికలనాపారీణుఁడై విశ్వవి
న్యాసంబొప్పఁగఁ జేసె వాక్పతిశతానందారవిందార్కుఁడై.

శా. ఇచ్ఛావర్తనమాచరించుచు మనోభీష్టైకసంసర్జనా
త్యచ్ఛప్రౌఢి ఋషీంద్రసర్గము సమర్థంబొప్పఁగావించె న
ప్రచ్ఛన్నాత్మసుఖైకభోగులయి రాబ్రహ్మణ్యులకోటిలో
నచ్ఛిన్నప్రభనొంచెనొక్కముని యాఖ్యందాను గౌండిన్యుఁడై.

ఉ. అమ్మునిరాజసంతతుల నంతములై చెలువొంద సందుహ
ద్యమ్మయి భోగభాగ్యనయ ధర్మముఖాఖిలపర్గసాధకా
ర్థమ్ములఁ గీర్తిపౌరుషభ రమ్ముల నాత్మవిచారధీరసా
రమ్ములఁ గార్యనిర్వహధు రమ్ములఁ బొత్తురియన్వయంబిలన్.

సీ. సత్యభాషలహరిశ్చంద్రునితోఁ బొత్తు దీనపోషణల రాధేయుపొత్తు
స్థిరధర్మవృత్తిఁ గుంతీసుతాగ్రజుపొత్తు శౌర్యసారమున భాస్కరునిపొత్తు
సకలవిద్యాప్రౌఢి శతమన్యుగురుపొత్తు హితవైభవములదేవేంద్రుపొత్తు
స్ఫుటధైర్యమున హేమభూమీధరముపొత్తు విపులకీర్తులఁ బాలవెల్లిపొత్తు
రక్షణంబున నిందిరారమణుపొత్తు దానమానంబులనుదము తామెపొత్తు
గానఁ బొత్తూరివారన ఘనతఁ బ్రబలె వసుధఁ గౌండిన్యగోత్రులా వారికపుడు.

శా. ఆవంశాంబుధిఁ బూర్ణచంద్రుఁడయి విద్యావిక్రమజ్ఞానస
ద్భావానుగ్రహనిగ్రహప్రశమసంధాకార్యనిర్వాహస
త్సేవాకర్మఠచిత్తశుద్ధి జనిత క్షేమంకరస్వైరలీ
లావాల్లభ్యములభ్యమై వెలసెఁ బోలన్ రాజు రాజత్ప్రభన్.

సీ. సతతవిశ్రాణన శ్రద్ధాగరిష్ఠత యర్థిపంకేరుహార్కాభమయ్యె
నిబిడమంత్రోల్లాస నిశ్చయాత్మప్రౌఢి జనపాలజనతాబ్ధిచంద్రమయ్యె
అనుపమానాత్మభవాంగసౌందర్యమ్ము యోషిచ్చకోరికాజ్యోత్స్నయయ్యె
జపతపోభ్యాసని శ్చలచిత్తవిశ్రాంతి సకలతాపసకులాచార్యమయ్యె.

నిగమసిద్ధాంత వివరణో న్నిద్రగరిమ ధర్మసంరోధికులదావ దహనమయ్యె
నిలనుబోలమరాజ మహీంద్రుమహిమ హిమకరార్కులుగలదాక నెసఁగుటరుదె

చ. పురుషవరేణ్య గణ్యుఁడగు పోలమరాజను పూర్వశైలమం
దురుతరకాంతిశాలురయి యొప్పిరి పుత్త్రులు రామలింగమం
త్రిరుచిర భోగభాగ్యముల దీపితుఁడై కులవృద్ధికారపిఁ
డరయమదన్వయాభరణ మాననవారలనుప్పెసూర్యుఁడై.

సీ. దుర్గాధిపతులెల్లఁ దొలఁగక తనమాత్ర శక్తిచేఁ గార్యముల్ సక్కఁబఱప
యాచకుల్ ధనయీవి ననయంబుధనికులై యలకాధిపతినైన నపహసింప
నతిథులుదనయింట నమృతాన్న తృప్తులై యలసుధాశనపాళి నతకరింపఁ
బటుకవుల్ దనచేతి పారితోషికమంది మదిభోజసత్కృతుల్ మఱపుఁగొనఁగ
వెలసెనేమంత్రి కుండిణీ స్థలసమగ్ర నిగ్రహానుగ్రహక్రియా నిరతినఖల
జనులఁబాలింపుచున్నట్టిసచివకులల లాముఁడౌరామమంత్రిఁబోల్పంగఁగలరె.

క. అమ్మంత్రికొమ్మబంగరు బొమ్మయనంజక్కఁదనము బొలుపెసఁగఁగజా
గమ్ములమాకుల నిద్దపుఁ గొమ్మయనందనరెఁబట్టు గొమ్మయిధరకున్.

సీ. పలుకుచందమెసర స్వతిగాదువివరింపఁ బావనత్వమునన ప్పగిదియయ్యె
సిరిహరిప్రియయంచుఁ జెప్పటింతియకాదు వైభవంబునను న ప్పాటియయ్యె
స్వాతంత్ర్యమునహైమ వతిసాటియేకాదు భూషణోద్వృత్తినప్పోల్కిఁగాంచె
సహనంబుననె ధాత్రి సరివచించుటకాదు ద్విజపోషణములన త్తెఱఁగుగనియె
నేమిచెప్పఁగవచ్చు న య్యింతిపురుని దంతియోగాక సంపంగి బంతియొక్కొ
యనఁగసొంపొంది వెలఁదుల యందుమేలు బంతియైపార్వతమ్మసంపదలఁదనరె.

క. ఆరామ మంత్రికులపతు లారాయనఁదనయుఁగాంచె నర్థివ్రజమం
దారున్గనకాచలసమ ధీరున్ సింగయ్యనామ ధేయునుదారున్.

క. రాజనఁజనుయశమునసుర రాజనఁజనుభోగమునధ రానలయధురా
రాజదాౙజనయజ్ఞత రాజిలునాసింగరాజు రతి రతిరాజై.

క. మాటలునిక్కంబులకున్ మూటలువేయించెఁబెక్కు మురహరుపేర్లన్
దోటలు శ్రుతిహిత గతులే యాటలుమాసింగరాజు నభినుతిఁదరమే.

సీ. పలుకునొక్కొకచోటభాషాచమత్కార మమృతంపుఁగొలఁకులై యూపరింప
గులుకునొక్కొకచోటఁ గుధర స్తనీనవ శ్రీగంధచర్చలు చెమటజాఱఁ
జిలుకునొక్కొకచోట సిరులుయాచకవాటి తలపులకురువులై ధరణిమెరయ
నలుకునొక్కొకచోట నగ్రసన్నులభయ భ్రాంతులింతింతలై పఱచిపోవ

మంత్రిమాత్రుండె సురరాజ మంత్రిమంత్ర తంత్రశతలక్ష్యసంధాన ధర్మమర్మ
కర్మకర్మఠుఁడైన యా ధర్మమూర్తి సింగరాజును సుతులఁజ స్ఛింపఁదరమె.

క. ఆమంత్రిదేవిసూరమ నామమ్మున వెలసెఁ బతియ నారతసుఖలీ
లామృదులాలనకుందగి కోమలసౌందర్యరతియొ కోయన నెందున్.

శా. ధీరుండై తగసింగరాజుగనియెన్ దీవ్రప్రతాపోదయున్
హారస్ఫారయశఃపటీర పరిలిప్తాశావధూటీచయున్
ధీరోదాత్తుని రామలింగ సచివున్ దేవాధిపప్రాభవున్
ధారాధీశ సమానదానుఁ గృతసం థాబాధసంధానునిన్.

సీ. ఎదుటదేహియటన్న నించుకేనియుఁ గొంకు దానెఱుంగండర్థి దానవేళఁ
గలముఁబట్టైనటన్నఁ జలపట్టిఁ శక్కణా లెక్కైనన్నొక్క చేఁజక్కఁబఱచుఁ
బలుకుపన్నిదమన్న భయదభైరవవీర భద్రాదులకునైన భయముగలపు
చెదిరించెనన్న ఫణీశవాగీశుల తోనైనవాదించు ధూర్తశక్తిఁ

గీ. గలిగియును పూర్ణశమదమాక్రాంతచిత్తసుఖరసాస్వాదియై మహాయిఁ జొక్కువాఁడు
రామలింగయ్యనాఁడు శ్రీరామరామ యర్థిదారిద్ర్య మొక్కటేయణఁగిచనియె.

క. శంభుధ్యాన పరాయణ జంభారిసతీసమాన శాశ్వతవిభవో
జ్జృంభితయై శాంభవినా గంభీరవతీలలామ కలదాతనికిన్.

క. రతియో సోయగమున హరి సతియో సంపూర్ణభోగ సంపదవాప్తిన్
సతియో పతివ్రతామతి సతి నా శాంభవమ నెన్నఁ జాలుటయెట్లో.

గీ. కనియె నారామలింగయ్య ఘనుని వినయ ధనుని న్నపకార్యముఖ్యసాధనుని దాన
ఘనునిఁ బాపన్నయను మంత్రి జనునిఁ దనదు ఘనపితౄణంబు సర్వంబుఁ గ్రాగిపోవ.

సీ. కలిమిపూవుంబోణి కాపురంబుగనిల్చె ధర్మవర్తనముదత్పరతఁ గనియె
దానదాక్షిణ్యముల్ దండబాయకనిల్చె జ్ఞానవిజ్ఞానముల్ స్థానులయ్యె
శమదమంబులునువి శ్రాంతిఁ జెందిసుఖించె భక్తిభావనలాత్మ బాయవయ్యె
స్వరసకవిత్వసంపదఁ వినలరారె సంగీతతాదాత్మ్య భంగిపొంగె
పరమపావనుడైన యప్పాపరాజ మంత్రిచంద్రుని విడువకి మ్మాడ్కి సుగుణ
జాలమెల్లనురత్నరిం ఛోళియనగ లలితమోహనలీల నలంకరించె.

మ. వరషాస్త్రూరికులాబ్ధిచంద్రుఁడగు పాపన్నప్రధానాగ్రణిన్
గరముల్ కల్పకశాఖలంచు బుధసంఘంబెల్ల మెచ్చంగను
ర్వరవిప్రావళి నిత్యదానములఁ బూర్ణశ్రీలఁ జెన్నొందుచున్
గరమొప్పాతఁ సువర్ణశైలశిఖసంఘాతమ్మనానిమ్ములన్.

క. శ్రీభారతీసుఖానుభ వాభోగధురంధరుండ వార్యస్థిరతా
శోభితుఁడక్కచ్చమ్మను ప్రాభవమున బెండ్లియయ్యెఁ బాపన్నధరన్.
క. చక్కఁ అతోమలచిరాకో యిక్కమలదళాక్షినగ నింపుగ తేనెల్
గ్రక్కెడునుడులంగడుసరి యక్కచ్చమ్మను గణింప నలవియెగవిక్రన్.
క. అమ్మంత్రికొమ్మనెనయుచు గమ్మనివిలుకాండ్రమువ్వురి గనెనాజనతా
సమ్మతుఁడైనృపసభలకు గమ్మనఁబుత్రత్రయంబుఁ గవియోగనిమై.
చ. అనఘుఁడు రామచంద్రసచి వాగ్రణిలింగనమంత్రిసింహమన్
జనపతిపుంగవుల్ వినయ సాహసవిక్రమ దానమంత్రవ
ర్తనలను జీవభావముల తత్పరులై కడుమెచ్చుబుచ్చిరా
జును జనరక్షణక్షమత నార్యజనంబులు మేటులౌననన్.
సీ. శైవధర్మముజగ జ్జనములెల్లనుమెచ్చ ధరఁబ్రకటించు ను ద్దండశక్తి
బ్రహ్మతేజోవివ ర్ధనములాభంబుగా నార్జింపనేర్చిన యమలపటిమ
సారస్వతోల్లాస సంధానముగణించు పరమపావనవచః ప్రాభవంబు
రాజభోగాభోగ రంజకప్రౌఢిమ ననురక్తిఁబాలించు ఘనవిభూతి
దనరియారామచంద్ర ప్రధానియిట్టి గుణములార్జించిమించిన కోసలేశు
మనుమనిగ్రహించు నపరజ న్మంబనంగ దనరెనార్వేలకులపవి త్రతఁదనర్చి.
క. లింగయ్యమెఱసెనహిపా లింగయ్యమునందునణఁచి లీలారచనా
లింగనగాతూహలము ప్పొంగంగులమెల్లదాన పొగడించిజనిన్.
సీ. సాటిమంత్రులవనీ వాటికోయిలమాడ్కిరంజింపఁజేసికా ర్యములనెఱపు
నరపాలసభలఁగి న్నరపాలవిభులచేబహులక్షకులనయిన భరమొనర్చు
బుధబృందమునబ్జ బుధుండుదామరగుంపుచాడ్పుననంద గింపఁజేయు
విబుధాగముఁబైన విబుధాగమముపోల్కినడవడిదారిద్ర్య మడఁగఁజేయు
నెంతవినయగుణంపుమెం పెంతవిజయమెంతసౌజన్యమేమని మెంచవచ్చు
నీవితీవినటంచుసంభావి తుఁడగులింగనామాత్యుఁడోనెరు నేగణింప.
క. ఆలింగమంత్రిమణియి ల్లాలింగణుతింపవశమె యాదెమ్మనుత
ల్లీలావతినెనయుచుశుభ శీలుండాతండు గనియెఁ జెలువుగసుతులన్.
సీ. మాదరాచలధీరుఁడిందుకుందకదంబ సుందరుండైనము కుందరాముఁ
డక్షీణధనకృత్య టాక్షవీక్షణరక్షి తార్థిసార్థుండువిూ నాక్షిదాసు
సంగీతసాహిత్య సరసవిద్యాసమా సంగకౌశలినర సింగమంత్రి
కన్నంతవేడిన కన్నఖిన్నగనర్థి మన్నించియిచ్చుపా పన్నశర్మ

రామనామసుధారసా రచితనిత్య తృప్తిరామయ్యమంత్రినా దేవతరువు
లర్థిగల్గినమాద్రిచె న్నలరిరపుడు లింగనామాత్యవార్థి సల్లీలమెఱసి.

ఉ. అంతననంతరమ్మునన యావనధుర్యుఁడు బుచ్చిరాజు సా
మంతనృపాలసత్సభల మన్నన గాంచి దయార్ద్రసై కవి
శ్రాంతవిశాలలోచనవి సారణలన్ ద్విజరక్షసల్పియా
కాంతసమస్తపుణ్యుఁడయి గర్జిలెదుర్జనభర్జ నంబులన్.

క. రామారతివల్లభుఁడగు రామయ్యయుననఁగవీర రాజనసుజన
క్షేమంకరులిరువురుగుణ ధాములు బుచ్చయ్యమంత్రి తనయునితనయుల్.

సీ. పరసతీ పరధనా పహరణ క్రియలందు దూరులై సజ్జనా ధారులగుచు
కులసమా చారాను గుణవర్తనైక సంశీలురై సరసవా గ్జాలు రగుచు
జనపాలకాస్థాన సదనోచితక్రమా రంభులై సతతని ర్దంభు లగుచు
నజ్ఞాన విధ్వంసి విజ్ఞానసాధితా ద్వైతులై సమసుఖా న్వీతులగుచు
నన్నదమ్ములురామలిం గాఖ్యమంత్రి వీరమంత్రీంద్రుఁడునువేన వేలుజనులు
వేవిధంబులఁబొగడనా త్వేలకులము వెలయనిహపరసౌఖ్యముల్ గలిఁగిమనిరి.

వ. అప్పరమ పావనంబైన వంశంబులోన.

శా. రాజాస్థానములం బ్రసిద్ధిగనువా రల్ మంత్రివర్యుల్ మహా
తేజశ్శాలురు గల్గరో నృపనయ స్థేమంబులార్జింపరో
రాజాస్థానమునన్ బృహస్పతిబలెన్ రాట్కార్యముల్ దీర్పఁగా
నోజల్ బాపురె రామచంద్రునకుజో డూహింపఁగానేదు రే.

మ. దరబారీనెరహోషులన్ తుజుగుబల్ దాలద్బడాయించిబం
దరు గోల్కొండ మొకల్మకాములమమం దల్లీనిజామాదులం
దరుమెచ్చై చ్ఛిరసావహించగపసం దామంత్రశక్తుల్ రహిం
చిరవాఙ్మూపుచు రామచంద్రసచివ శ్రేష్ఠుండుమించెన్ ధరన్.

సీ. కల్పవృక్షంబేమి కసటించెనోగాని యింద్రలోకంబుపై నెలమిమానె
గగనమండలముపై కనరేలపుట్టెనో చంద్రుండుపుడమి సం చరణమరగె
ఖచరబోధంబేల కట్టిపెట్టెనోగాని గురుఁడుసర్వంసహాస్ఫురణుఁడయ్యె
దనవై భవమునసే తక్కువగాంచెనో విబుధేంద్రుఁడిహలోక విహృతిగాంచె
ననుచుబొత్తూరి కులకల శాంబురాశి చంద్రుఁడైనట్టి శ్రీరామచంద్రసచివు
దానసౌందర్యనయభోగ తత్పరతలఁ గాంచిమెత్తురుబుధజనుల్ గలసిమెలసి.

సీ. కవితావిలాససం ఘటనాపటీయుల కిచ్చుటేగాదులో మెచ్చనేర్చు
కణగిధర్మాధర్మ ఘనపరిష్కారమ్ము లేర్చుటేకాదుతాఁదీర్చనేర్చు
వేదాంతవాక్యార్థ విజ్ఞానసారంబు దెలియుటేగాదాత్మఁగలయనేర్చు
బుధబృందంబులో పలనెయ్యమలరంగ నించుటేకాదు లాలించనేర్చు
చతురుదాకరపరివృత ఘూర్మితలాంత కాంతరామాత్యవర్గవి శ్రాంతగుణని
తాంతవరగుణపేటియై తనరురామ చంద్రసచివేంద్రునకు నెందు సాటిగలరె.

క. ఆరామచంద్రుకీర్తికి గీరామాహారహీర గిరివరశరశ
శ్రారామవాటికామృత సారామలరుచులుకుచులె సరకుగొనంగన్.

క. అక్షీణసంపదలచే భిక్షుసభం దెగడుసచివ విబుధేంద్రునకున్
బ్రేక్షావతీమణి విశా లాక్షియనందరుణితనరు హారికిరమయనాన్.

సీ. పరపూరుషులభ్రాతృ భావంబుగాఁజూచుచన్న దానమునందు నన్నపూర్ణ
యర్థివేడినయంత నడుగుదప్పకయిచ్చు ననుఁగుల యెడలనెయ్యంబుతఱుచు
పండితాళులఁబ్రోచు పనిమనోధర్మంబుహరిహరసిద్ధని త్యవ్రతంబు
పరమార్థబుద్ధిత త్పరతకుఁబుట్టిల్లుధర్మానుకూలవ ర్తనముగుణము
నిత్యసౌభాగ్యలక్ష్మియా నెలఁతగనినకన్నుదోయికిసాఫల్య గరిమకలదు
త్రవ్వితండమ్ములైసిరుల్ తనగృహముననలరఁదనరారునవ్విశా లాక్షిదేవి.

శా. చుట్టుంగైదువజోదుకుంగమలనా సొంపొందిముక్కంటికిన్
గట్టులాతియనిబిడ్డనాకడుపుబం గారయ్యకున్వాణినాఁ
బట్టంపుంబువుబోణియైచెలిమిగు ప్పన్ రామచంద్రుండమిం
బుట్టంజేయుచునవ్విశాలమసుఖా భోగమ్ములం జెందఁగన్.

క. అద్దంపతులకుఁగలిగిరినిద్దంపుగుణంపువలపు నిఖిలసభలలో
నెద్దిక,గొలుపఁగవిద్దెలబుద్ధులపోత్రులయిసుతులు పుడమితొడవులై.

సీ. కులవృద్ధజనములు కోటీశుఁడౌనసధరణిపాలురుయుగం ధరుఁడనంగ
నవలాలితండెసూ నవమన్మథుఁడనంగదీనజనాళిరా ధేయుఁడనఁగ
ధీమంతుఁడీతఁడే దేవగురుండననరిజనమ్ములువిక్ర మార్కుఁడనఁగ
గవికోటిభోజరా జవతంసమనియెన్న సత్యవాక్కునహరి శ్చంద్రుఁడనఁగ
భక్తసంఘంబుపుంభావ భక్తియనఁగసద్గుణంబులకాస్థాన సదనమగుచు
నందనులలోనఁబెద్దయా నందరాయుఁడొందెసత్కీర్తికులపాళి కందెయనఁగ

ఉ. ఉమ్మలికమ్ము లేక బహుయోజనదూర సమాగతార్థి జా
తమ్ముల కిష్టసంపదలు దార్చుచు వల్లభుచిత్త మాత్త భో
గమ్ములఁ దేర్చుచుం బనుల గద్దరియై విలసించి మించి పే
రమ్మయనంగ నాసచివహంసునకుం దగెఁబువ్వుబోణియున్. ౨౬
క. అప్పురుష సింహు నవరజుఁ డొప్పులకుం గుప్ప యగుచు నురుగుణ మణులం
గుప్పుచు గాళీదాసుం డొప్పెంగవిజననిధానమో యితఁ డనఁగన్. ౨౭
సీ. కట్టించెఁ బటుశిలా ఘటితసస్తులవప్ర దీపశంభుముకుంద ధిష్ణ్యపాళిఁ
బెట్టించెశాల్యన్న పృథుల సూపాజ్యపూర్ణాన్న సత్రములు విప్రావళులకు
ధట్టించె ధర్మవిధ్వంసమార్గోల్లాస కుటిలదుర్జనకర్మ పటలమెల్ల
రెట్టించెఁ గర్ణాంబరీష మాంధాత్రాది దానశౌండుల గుణాదానగరిమ
గీ. నట్టనడుమైన నేరేటి మిట్టగలుగు నట్టియుద్యోగి జనములోఁ బెట్టుజెట్టి
గట్టిగా నీతఁడని పేరుఁ బెట్టవచ్చు ననగఁ దగ కాళిదాసు వేయనఁగనేల. ౨౮
సీ. సరస సాహిత్యాను షంగసత్కవిబృంద మనయమ్ము నునయంబు నభినుతింప
దర్కమీమాంసాది తతవచఃపటుశాస్త్రి సంఘంబులందంద సందడింప
వేదాంత వాక్యసం విత్సామరస్యార్థ వేత్తలాత్మాద్వైత విధులు దెలుప
బంధు బృందోల్లాస బహుళప్రసంగ సంగతచమత్కారముల్ కందళింప
గీ. ముందు సడిసన్నమంత్రుల ముప్పు దిద్దరాదు గణుతింపఁదగునన నఖిలగుణము
లందు దనసాటితానయై యందమొందెఁ గవిజనోల్లాసుఁడైనట్టి కాళిదాసు. ౨౯
సీ. అతిథిశతంబుతో నాప్తవర్గంబుతో గజఘోటికాందోళికములతోడ
శ్రీశైల కాళహస్తి చిదంబరాదిది వ్యక్షేత్రయాత్రలొప్పరయఁ జేసి
వెలయసేతుస్నాన విధిసల్పి రామేశు నాజ్ఞఁదాశిరసావహించిపూర్ణ
యాత్రగా శ్రీవారణాశి కిఁగాశికిఁ జనిమరుద్వాహినీ సలిలములను
గీ. దోఁగి విశ్వేశు సేవించి దురితవిపినవహ్నియనఁ దేజరిల్లియివ్వసుధఁ బ్రబల
వంశపావనుఁడనఁగ నవార్యశక్తిఁ గవిజనోల్లాసుఁడైనట్టి కాళిదాసు. ౩౦
సీ. ఒకవేళఁ గవిజన ప్రకటప్రబంధముల్ పరపుచో భోజుఁడై యొరపు నెరపు
నొకవేళఁ బండిత ప్రకర గోష్ఠులుసేయు చో విక్రమార్కుని సొంపునింపు
నొకవేళ నాంధ్రభాషోక్తిపారంపరల్ దెలియుచో రాయల తీర్పుదార్పు
నొకవేళ గానామృతోల్లాసమునఁ జొక్కుచో మధురాధీశు సొలపుగలపు
గీ. నన్నివేళల నొక్కతీరివిధి వికేలుతలుపుల కురువలో కిన్న రేశు
గనుల పుట్టిండ్లొ భళిరెయకాళిదాసు జన్మసంపత్తి కారణ జన్మవృత్తి. ౩౧

చ. లలితరమా మనోహరవిలాసము నంగొలువున్న వేళ వి
చ్చలవిడి హాటకాంబరవిసర్జన సేయుచు నాత్మలోపల
దలపమ తత్క్రియన్ శ్రుతిహితంబును సాగద కాళిదాసము
త్రులతల పుష్పచిత్రమని తోపఁగఁ జేయువసుంధరాస్థలిన్. ౪౨
శా. కాళిదాసు యశంబు విక్రమము శౌర్యం కన్నులాదు వెన్నెక్క దిశా
పాళిం భ్రమ్మరఁ దాగత్సుభ హంస యుగ విభ్రాంతిన్ హరి బ్రహ్మలు
ద్వేల ప్రక్రియఁ బట్టఁజూతు రనఁగా వింతే జగంబెల్ల త
ల్లీలల్ చూచుచుఁ బుష్పవంతులను టోలిన్ డెంద మందెన్నఁగన్. ౪౩
సీ. పరలోకములె కాదు పరలోకములనెల్ల బయలు సేయించిన భద్రమూర్తి
కన్నవారికె కాదు కన్నవారికి నెల్లపుణ్యలోకంబిచ్చు పుణ్యజన్మ
యగ్నికే కాదు ప్రత్యర్థికి గలయంగ దానవత్వముఁ జూపు ధైర్యశాలి
వనము లే కాదు జీవనములు చేయుచో మృదులతల్ పెంచున మేయగుణుడు
గీ. నాడు సారస్వతమ్ముల నేడు సిరుల వెలయఁ జేయుచు నాకాలభేదము నధ
రాపతికిఁ గీర్తులార్జించు రాజ్యపూజ్య కాళిదాసును వర్ణింపఁగలరె కవులు. ౪౪
ఆ. అగ్రభార్య దనరు నమ్మాత్రివరునకు సక్థినిస్వతాప హర్షరూపాణి
పూజితార్థి తూణి పుణ్యవ్రతశ్రేణి కీరమధురవాణి కృష్ణవేణి. ౪౫
వ. మఱియును. ౪౬
శా. లీలామన్మథుఁడై ప్రసిద్ధిఁగను కాళిదాసు సిల్లాలు నా
నాలావణ్య విలాసముల్ కమలవి న్యాణంబు సూచించుచో
శీలం బార్యులు మెచ్చగా విజయలక్ష్మీ దేవినావర్థిలెన్
బాలారత్నము సత్యదాన నియమ వ్యాహార శీలంబులన్. ౪౭
సీ. అప్పుల పాలౌచు నతిభంగముల నొందు పుట్టింటఁ బుట్టిన యట్టికొఱత
నిలుచుచోఁ దిరముగాని లువకచాంచల్య వృత్తిమైయింటింట వెలయుకొదువ
గతిమాలి కడునాకు లతలఁ జెందిన గుంపులోఁ డబుట్టువులుగా దొడరుకడమ
పతిపేరు టురమెక్కి యతని పేరడగించి కలుములనుబ్బు లెక్కసపు వెలితి
గీ. నిట్టిగుణములు వెదకిన నెందు లేమి సిరిజయించిన దీయింతి గరిమననుచు
సార్థకాభిఖ్యఁ దాల్చెనా జగతిఁ గీర్తి వెలసె భామా శిరోమణి విజయలక్ష్మి. ౪౮
సీ. కాంతు నిష్టోపభోగములఁ దేల్చుట యొకా దన్న సత్రములలో నటుల నేర్చుఁ
బ్రియవల్లభుని మనః ప్రీతి మాత్రమె కాదు స్థిరధర్మ నిరతినార్జింప నేర్చుఁ
బ్రాణనాథుని భక్తి పరిచర్యకృతులె కాదతిథిపూజలయందు నట్లనెఱపు

నాత్మేశ్వరుని చిత్త మనుసరించుటకాదు పరమార్థవృత్తుల పట్లనట్ల

గీ. నాడుపుట్టువులందు నెందైన నిట్టి యింతి గాంతుమె గాంభీర్య మెంత ధైర్య
మెంత చాతుర్యమెంతయీ వెంకసిరుల వేడుకలతల్లితల్లి యీవిజయలక్ష్మి ౫౯

శా. శ్రీలక్ష్మి ప్రతిబింబమా విజయలక్ష్మీదేవి క్షేత్రోదయకిన్
వేలు న్నూరులు లెక్కలయ్యెను తగన్ లెక్కింప రాదయ్యెవి
ప్రాసీపూజలఁ గాళిదాసుచనవే యాలాటిదో యామె కెం
గేలుం దామరలచ్చియిల్లగుట కో ర్యేల్ సుస్థితిం జెందెనో. ౬౦

ఉ. నోచనినోము లేదు తను నోచిన నోముల విప్రసత్రముల్
వాచవిఁదీరఁగా నిడని వైసము లేదు వరాల్ సరాల్ గురాల్
దాచుచుసీమిలేను కల దాయిటువంటి నెలంత భూస్థలిన్
లాచినయక్షికిన్ విజయ లక్ష్మికటాక్షమె కొంగుబంగరౌ. ౬౧

గీ. విజయలక్ష్మికి హస్తముల్ వేనవేలు కలవటంచంగనిమ్ము ని క్కంబుగనఁగ
నర్థులకువచ్చుచోఁ బొంగుహస్త జలధి కబ్జజాండంబు సరిపోవదనగవచ్చు. ౬౨

చ. కుశలవరామమంత్రి నయ కోవిదుఁ డాయన తమ్ముఁడై సుహృ
ద్వశమయి నెమ్మనమ్ము రస వార్ధి తరంగలఁదోఁగ విద్విష
త్ప్రశమన కేళి మంత్రి బల దర్ప ధురంధరుఁడౌచుఁగాంచె హా
రశరశర త్సుధాకర ద రప్రతిమాన యశఃప్రకాశతన్. ౬౩

సీ. కలశపాథోరాశి కంపమొందఁగ జేసి శరకదంబాబుల శిరయఁజేసి
కలిమిమ్రాకుల మహా బలమున బిగియించి కామధేనువుఁ బూరిఁ గర్వఁజేసి
చంద్రకాంతంబుల జలజలలాడించి బలు రిక్కగమిఁ బైటఁబాఱఁజల్లి
భుజగాధినాథుని బొరియల దూరించి తెలిదమ్ములను నీటఁగలపివైచి

గీ. శైలరాజన్యశాసన స్తంభమెత్తి యెల్లదిగ్దంతికుంభంబు లెక్కతిరుఁగు
కుశలవిస్ఫూర్తిత్రిభువనీ కోశవర్తి రమ్యతరమూర్తి కుశలవ రామకీర్తి. ౬౪

చ. తెలియనివిద్య లేదు విను తించిన సిగ్గరి యీవి మేరలే
దలయఁడు రాజకార్యముల నాంతర మాత్మనివే కధుర్యము
జ్జ్వలమతి యంతకంతకు న శంకితవృత్తి యయారె? మంత్రిమం
డలమణి యానియోగిఁ బొగడం గవికోటికి మేరయున్నదే. ౬౫

క. కుశలవరామామాత్యుని విశదవచఃకౌశలంబు వెలసెన్నరసా
లశతంబుమెచ్చసిరులన్ వశమొందఁగఁజేయు నీతి వాగ్ధన్యంబై. ౬౬

క. అక్కుశలవరామయ్యకుఁ జక్కని పూఁబోఁడి సరస సజ్జనసేవన్
మక్కువ లక్ష్మీదేవమ యక్కమలదళాక్షి నెన్న నబ్బురముకదా! ౯౭
సీ. పతిహితం బేవేళఁ బఠికించు సౌభాగ్య లక్షణంబులకు ను ల్లాసపదము
వ్రతనియమాదిక ప్రారంభగుణపేటి యతిథిపూజానిష్ఠ కాటపట్టు
భాగ్యసంపదలకుఁ బ్రభవసంస్థానంబు పరహితోత్సాహంపు బట్టుగొమ్మ
పరమార్థవిజ్ఞాన భావంబులకు దాపు సఫలక్రియాక్రమ సంవిధాన
గీ. మట్టిగుణవతి భువనంబు లందునందు నెందుగనుగొంద మన్ననుగంగు మొక్కొ
సమరసాలాపనికురుంబ సన్నితంబ లలితబింబాధర విడంబ లక్ష్మమాంబ.
ఉ. అమ్మదనైకసుందరున కర్మిలి రెండవపత్నియైనసా
పమ్మ వయోవిలాస విభవాతిశయమ్ములు సెప్ప వింతగా
రమ్మయనందగుం బతిహితార్థపరోపకృతివ్రతాదులం
దిమ్మహిఁ బిన్నప్రాయమున నే ఘనకీర్తిగణించె మించఁగన్. ౯౯
క. వారలకుందమ్ముఁడుదగఁ జేరల కెక్కువగుకనుల చేఁ గీర్తులచేఁ
దారల నిరసించుచు సిరు లూరఁగ నప్పయ్య యన న యోన్నతి మిగులన్.
ఉ. తియ్యనివింటిదంటకును దిద్దుగడల్సవరించు సీటులోఁ
దియ్యనిమానసంబు వెను దీయసి మేటి జవాబునందుఁ భో
నియ్యని ప్రౌఢచంద మస దియ్యని దిట్టతనంపుఁ బెంపు న
ప్పయ్యను జెప్పఁచో నితరులాసరి యాతని కాతఁడే తగున్. ౧౦౧
సీ. రాకేందుబింబమౌరా వీనినెమ్మోము కలువపూఁజేకులే కన్నుదోయి
నిలువుటద్దంబులె న్నిక కెక్కు చెక్కిళ్లు బిరుదా కవాటమ్ము పేరురమ్ము
కండెముల్దిరిగి కీల్కొండలాగదభుజాల్ పొడవుకంఠంపున బ్బురముదిరము
గజతుండములఁబోలు గదయూరుకాండముల్ నిలుపు చొక్కంబుమ స్నీల
సొగయలు
గీ. నితనిసోయగమలనాటి యించువిల్తు సోయగంబీయుగం బెకా డేయుగంబు
నిట్టిమొలపజిగలదిగా దెంచిచూడ ననుచు నప్పయ్య నెంతుకీయవని జనులు.
శా. ఆయప్పయ్యకు రాజమాంబయన నిల్లాలయ్యె గాంభీర్య ధై
ర్యాయత్తంబగు చిత్తము న్పతిమత వ్యాపార పారీణతా
స్థేయత్వంబును గల్గి భాగ్యమున లక్ష్మీరూపమోనాగ దీ
ర్ఘాయుర్భోగధురంధరత్వముల దివ్యశ్రీవిడంబించుచున్. ౧౦౩

క. అయ్యన్నదమ్ములిలలో నెయ్యము దియ్యమ్ము లెసఁగ నెగడుచుసుతులన్
వెయ్యారులందు సరివే రయ్యా యనఁగనిరిఘనుల నరిదవఘనులన్. ౧౦౪
శా. శ్రీలక్ష్మీలలనా సరస్వతులచేఁ జెన్నొందుటం బూర్వపుం
గాళిదాసు జయించి మించి విలసత్కల్యాణ చారిత్రుఁడై
కాళీదాసునకున్ రమాసదృశరం గన్మూర్తిమైయొప్పు స
చ్ఛీలప్రస్ఫుటవృత్తియా విజయలక్ష్మీదేవికిం బుత్రుఁడై
హేలన్వార్థి లె వెంకటప్పసచివుం డీశానసద్భక్తుఁడై. ౧౦౫
సీ. మందారబిసబృంద కుందారవిందాబ్జ చంద్రమోఁచచ్ఛాయ సడలఁజేసి
శర్వపర్వతబలా ఖర్వసుపర్వార్వ గీర్వాధూరుచుల శంకింపఁజేసి
హీరవారపటీర చారుతారానీక తారహారస్ఫూర్తిదప్పఁబట్టి
శారద వారిద నారద పారద శారసత్కాంతులఁ బాఱఁదోలి
గీ. భువనములునిండ నెవ్వ నిధవళకీర్తి యతఁడుపొత్తూరివంశాబ్ధిసితకరుఁడు
వెంకటప్పాఖ్యసచివుండు విశ్రుతుండు ప్రబలెఁబ్రబలుచునున్నాఁడుప్రబలగ
లఁడు. ౧౦౬
చ. అలయకపొత్తురిన్వయసుధాంబుధి చంద్రుఁడు వెంకటప్ప యీ
యిలఁగల యాచకప్రతతి కిచ్చుటఁ గన్గొని కల్పభూజ మా
కులపడి పండ్లిగిల్చె శశికందును గుందును జెందె నెందుగ
ర్జులుకసురున్వహించెఁ బెలుచన్జలదంబు సహింపఁజాలమిన్. ౧౦౭
క. తగు వెంకటప్పసచివు నిమిగులంగలకీర్తి వెలసె మృగభృన్నగభృ
న్మృగమృగభృన్నగనగభృన్మృగభృన్నగభృత్సుతల్పమితొంబబగుచున్. ౧౦౮
శా. శరదభ్రాభ్రధు నీమరుత్తరువనీ శర్వాబ్జభూభామినీ
శరనీహారకరాబ్జినీ విచికిల స్వర్ధేను సద్ధాదినీ
శరధీశాన సమానకీర్తిలహరీ సంపూర్ణలోకాళియై
పరగెం దాఁ బెదవెంకటప్పజలధి ప్రఖ్యాత గంభీరతన్. ౧౦౯
గీ. అట్టి పెదవెంకటప్పకు నగ్రమహిషి యేకవంశాబ్ధి చంద్రుఁడై యెసఁగు నట్టి
పుండరీకాక్షు సత్పుత్రి పుణ్యగాత్రి ప్రకటదుర్గాప్రసాదాంబ భవ్యశీల. ౧౧౦
సీ. పంకజాత నివాస పారుష్య సహితయౌశ్రీకాంత సాటిగాఁ జెప్పనెట్లు
సతతంబు వేధతో సాంగత్య మొనరించుభారతి సమముగాఁబలుకు టెట్లు
చండికాభిఖ్యయై శైల సంజాతయౌపార్వతిసరిగ నేర్పఱచు టెట్లు
పాంసులత్వనిరూఢి బహువర్ణకలితయౌభూదేవి పోలికఁబొల్చుటెట్లు

గీ. సునతదుర్గాప్రసాదాంబ ననుపమాన పుణ్యనిరుపద్రవాగణ్య భూరిసత్వ
నిర్మలాకారయుతఁగని నిఖిలజగము పొగడుచుండును దద్గుణస్ఫూర్తిఁదలఁచి ౧౧౧
సీ. ఘనసర్వమంగళా కలితసత్పద్మయై ఘనసర్వమంగళా కలనఁబూనె
సత్యభామా సమా సక్తిచే వివరించి సత్యభామా సమా సక్తియయ్యె
కమలాంచితేక్షణా కలితయై చెన్నొంది కమలాంచితేక్షణా కలితయయ్యె
వరపద్మరాగ సుందర రదనాఢ్యయై వరపద్మరాగ సుందరతఁదాల్చె
గీ. నమితగుణచర్య వేంకటప్పాఖ్యసచివ వర్యు రెండవభార్య వివర్ధితార్య
సుమహితౌదార్యసంతత సుగుణకార్య చిన్నదుర్గాప్రసాదాంబ చెప్పఁదరమె.
గీ. తనర కుశలవరామయ్య తనదు పెద్దభార్య పెదలక్ష్మీదేవ్యాఖ్య భవ్యశీల
యట్టిసతియందు సుతుఁగాంచె ననఘకీర్తిఘనుని నానందరాయ సజ్జనవిధేయు
క. ఆనంగజలధిచంద్రుం డానందమనంగ నందమందెను వినయ
శ్రీనందుఁడు భక్త్యర్చితశ్రీనాథుఁడు భరితబాంధు బృందుండగుచున్. ౧౧౪
మ. హరినారీమణి సత్యభామ వచనం బాలించి మున్నామరు
త్తరువుం ధాత్రికిఁ దెచ్చినాఁడనుచుఁ బెద్దల్సెప్పఁగా విందుమా
తరురాజంబగు పారిజాతము సుమీ ధర్మాత్ముఁడానందరా
వరయం జాటుచు నున్న దీవియడ నీయర్థంబు తథ్యంబగున్. ౧౧౫
క. ఇల బ్రహ్మానందాదుల ఫలమేమో భాగ్యమేమో పరికింపవలెన్
గలుముల బలుముల నొసఁగెడు సలయక పొత్తూరివంశ్యుఁ డానందము దాన్
సీ. చెఱకుసింగిణి నెందుఁ జేపూనాఁడో కాని యననిఁజరించు పుష్పాస్త్రుఁడితఁడు
ఉరముపైఁ గందెందు నునిచినాఁడో కాని యిలఁజరించెను నోవ ధీశుఁడితఁడు
పరతాపకరత నేపట్టున నిలిపెనో వసుధ వర్తిలెకుపావకుఁడితండు
తనయాకులత నెందు దాఁచెనో ధామణితల నర్తిమైన సంతానమితఁడ
గీ. టుము సౌందర్యకీర్తిప్రాక్రమాతి వితరణమ్ముల నెల్లరు వినుతిసేతు
రట్టిపొత్తూరి కులకలశాంబురాశి చంద్రు నానన్దరాయ మంత్రీంద్రు సభల.
ఉ. ఎందుఁబరోపకార గుణమేతన సేమము గాఁగ నెంచి యా
నందముతోఁ బరోపకర ణమ్మొనరింపుచు నాసికెక్క నా
నందము జిత్తవృత్తి యను నందనపాదరవిందసేవ నా
స్పదతనివ్వటిల్లఁగుల పావను డైపితృభక్తి పెల్లుగన్. ౧౧౬
క. ఆనందరాయసచివున కానందద యగుచు వెలయు నగ్రమహిషి సీ
తానందనామవతికిని సానందుఁడు వెంకటప్పజనసంబయ్యెన్. ౧౧౭

సీ. తన దానధారామృ తాసారవృష్టికిఁగవిజనమ్ములుచాతకములుగాఁగఁ
దన యశః కర్పూరమునకుబ్జజాతాండభాండంబు గ్రొమ్మించు భరిణగాఁగఁ
దనప్రతాపాదిత్యధామవిస్ఫురణకుఁజటులారినృపులు చీఁకటులుగాఁగఁ
దనదయారససుధా వనధికి సద్గుణ గణహితబ్రాహ్మణుల్మణులుగాఁగఁ

గీ. బ్రబలెమంత్రియతండు దుర్మంత్రినికర గర్వదుర్వారతిమిరసం ఘాతహరణ
తరణికిరణుండు సంతత దానశౌరి మహిత చినవేంకటప్పాఖ్య మంత్రిమౌళి.

గీ. ఆగుణాంబుధికి హనుమాయమ్మయనఁగఁ దనరుఁ బద్మాక్షి భార్యయైధర్మ
నియతి ననుసరింపుచు వర్తింప నఖిలధర్మ కార్యములఁజేసి సత్కీర్తిఁ గాంచి
మించె. ౧౨౦

గీ. రమ్యతరకీర్తియానంద రాయ ద్వితీయ భార్యసీతమ్మనామ్నిపరా పణతియందు
గాంచెఁ బుత్త్రిని మూఁడవకాళిదాసువాగ్రహౌదార్య శౌర్యసంపత్సమగ్రు.

క. ఆనందరాపు మూఁడవ మాసినియగుసర్వలక్ష్మి మధుభిత్తరుణీ
సూనాయుధ హరరమణీ మానిత వనజజసతీ సమానతలంపక. ౧౨౩

క. అయ్యానందము ననుజుం డయ్యారే సిరికి ననుజుఁ డుందమునననక ౧౨౪
నెయ్యములమూటయై నీరయ్యాయనందనరు నిజకులాభరణంబై

ఉ. అప్పయమంత్రి యాత్మసతియైవిలసిల్లిన రాజ్యలక్ష్మియం
దొప్పఁగరామచంద్రుఁడన నొప్పెడి పుత్త్రునిఁగాంచె నాతఁడే
తప్పకవార్ని ధానములఁ దద్దయునించెను దానధారలం
జొప్పడరన్ యశస్స్మితిని సోముని బూర్ణునిఁజేసె నెప్పుడున్. ౧౨౫

క. ఏవంవిధసరసగుణ శ్రీవారాన్నిధులు చతుర శృంగారకళా
ప్రావీణ్యంబులమెఱయఁగ భానమురంజిల్ల ధరణి పాలకులెల్లన్. ౧౨౬

ఉ. ఎవ్వనిరాజకార్యముల కీతఁడుదక్షుఁడుకాఁగలండొ నాఁ
డివ్వసుధాతలంబు సక లేప్సితదాయకమౌనటంచు లో
నువ్విళులూరుచుందురుస ముజ్జ్వలతేజుఁడు కాళిదాసుమే
ల్మివ్వముఁగాంచి యట్టినృప మాన్యతనొంది చెలంగెధారుణిన్. ౧౨౭
౧౨౮

వ. అట్టిసమయంబునందు.

సీ. శ్రీలువర్ధిల వాసి రెడ్డివంశాబ్ధికిఁ జంద్రుఁడై విక్రమోపేంద్రుఁడగుచుఁ
బరమపావనమూర్తి భవ్యతేజోమయ ప్రబలకాంతిచ్ఛటా భాస్కరుండు
స్తంభశైలారి భాస్వద్దుర్గదశక ప్రపాలనాధాకిత ప్రాభవుండు
శారదాభ్రతుషార చంద్రచందనచారు కీర్తికర్పూర పంకిల దిశుండు

గీ. కవిత్వదారిద్ర్య దీర్ఘాంధ కారలీలలాలితానేక విబుధ రించోళి వెంక
టాద్రి భూపాలమౌళి కృపానుభూతి కాళిదాసుని రావించిఘనతమించి. ౧౨౯

ఉ. మాకుఁ బ్రధానివై సకల మంత్రిగణంబునఁ బెద్దవై మద
స్తోక మహీతలంబునకుఁ దోడుత దక్షతనూని డెందమ
వ్యాకులతన్ భూసంగఁ బరిపాలన సేయఁగఁగోరి నార మి
చ్ఛాకలిత ప్రవర్తనుఁడవై భరియింపుము రాజ్యభారమున్. ౧౩౦

శా. ఏనేనీవయి యేలుకొమ్మనుచు భూమీశుండు వల్కంగ న
మ్మానిగ్రామణి వీటినందుకొని త న్మంత్రిత్వముంబూని య
మ్లానప్రౌఢిమ నంగసప్తకము శుంభల్లీలఁ బాలించె సం
స్థానంబింద్రనివాస భోగముల మెచ్చె హెచ్చ నుచ్చైర్గతిన్. ౧౩౧

* లయగ్రాహి. *

ఈసు మదినెఱుఁగఁ డొక వీసమును నేమఱడు
రాసులుగఁ గూర్చెసిరి యాసపడ డెందున్
గాసిఁ గనుపడనీడు మోసపఱచం డొరుల
దాసులై జనులు తను వేసరకగొలువన్
గ్రాసములొసంగి ద్విజ వాసములు నిలిపి పెఱ
దోసములడంచి మృదు హాసుఁడగుకాళీ
దాస పరిపాలనపు వాసి వినరింపఁ దర
మే సురలకైనఁ దివిఁ జేసెఁగద పుడమిన్. ౧౩౨

క. చోళద్రావిళ కురుబం గాళ కరూశాంగ వంగ కాశ్మీర కనే
పాళ క్రథకైశికములఁ గాళీదాసప్రధానిఘనయశమెసఁగెన్. ౧౩౩

చ. నల నహుషాది భూపతుల నాఁటి యశఃప్రసరంబు ధర్మవృ
త్తులు నురుభూసురార్చనలు దుర్జనసంహృతి యాదిగా నిరా
కులమతి వెంకటాద్రినృప కుంజరుఁ డాసచివైకతానుఁడై
సలిపె ననేక శిష్టహిత సత్క్రియలక్రమతన్ ఫలింపగన్. ౧౩౪

వ. అమ్మంత్రి పుంగవుం డొక్కనాఁడు ప్రసంగవశంబున మమ్ముం బిలువం బంచి మాకుం బ్రకటయశస్సంపత్ప్రదాయకుండైన శ్రీవాసిరెడ్డి వెంకటాద్రిమహీవల్లభుని వంశావతారం బభివర్ణింపుఁడని సత్కరించిన మే మభివర్ణించితిమి. అట్టిక్రమం బెట్టిదనిన. ౧౩౫

సీ. అంచ తేజీనెక్కి యాడు మేటి వజీరుఁ డఖిల దేవస్త్రీల్యఁ బ్రైన వేల్పు
పెంపు- పుర్వాణాంకి, ప్రాణేశ్వరుఁడు నను జ్జనభాగ ధేయంబు, నరజీతి
నిండోలగంబునకు, గండర గండనీను బోలిపెంపు లకుఁ బుట్టుఁ నెళవు జగము
గన బంగరుబొజ్జ, కలుముల్య ల్లిఁది కలిమి వేయులు నాల్గియు,గణకవర్య
గీ. పట్టి కళ్యాణపు టోగిరం, బాసనేయు బాసనాల్ ద్వార కమపార బట్టిగాఁగ
గన, నలుమోములయ్య మొక్కులచెంఖల కారణంబయ్యెనలువనా,గానతంతు.
క. ఆదేశని కదకనులను గిద్దా కన్ముదన మొల్ల.గమ్మన గ్రన్నైర్
బెన్నయు నకెద్దుబు గన సద్దయు గిలుమున్న కులము, సాభవమయ్యెన్.౧౩౮
ఉ. కమ్మని విటితొను బం, గిమ్మలన్ గలసొనుగమ్మ పొం
కమ్మ లశైర్య మాదర న, గమ్మలనన్ సురరాజ తుల్య భో
గమ్ముల నిమ్మలం దగిరి గమ్మన కీర్తనన్ జగమ్ములన్
గమ్మ కులాగ్మవారి సరి గా మతిగానను సద్గుణాబులన్. ౧౩౯
సీ. తెల్లి తల్పల లీను వల్లిదానుర పుప్పు కలికి కొమ్మగరాల గట్టెగాఁగ
వేల్పుటేరున పాల వెల్లి యుల్లాసపు టాలుయాను నోలగ్గి ములుగాఁగ
వలిమల్లుపి గట్టు నలుకుబ్బలి మొదల్ గలములల్ కేళిశైలములు గాఁగ
పలుకు పువ్వుబోణి చెలిమి గోరుచుబొగ్గు జరపు నాగరికంపుసకియగాఁగ
గీ. గమ్మనారాల విబుధాళి గన్నపుస్య ఘన యశోలక్ష్మి శ్రీ భువనా క్రమణశక్తి
నెనపు తారాపి తచ్ఛుభి మెత్తెకొలు ప్రదీర్ఘ జగజ్జేక మోహనోద్దీప్తి మెఱయ.
ఉ. కొమ్మని యగ్రహారములు, కుంఠిత దాన రమా సమానతల్
గ్రమ్మ గజేంద్రకోటి కిడ గా విడగా లిఖియించి దిక్కులన్
గమ్మలు బపి సన్మానము, గాంచిరి మించిరి నించి రర్థముల్
గమ్మ కులమ్ము వారలరి గర్వవిభేదన దీక్ష దక్షులై. ౧౪౦
క. ఈమగలలో మహిమాస్పద మై మహితులు మెచ్చ సద్గుణాదార గుణో
ద్దామమున్న కమ్మకులమున శ్రీమహితంబయ్యె వాసిరెడ్డి కులమ్మున్. ౧౪౧
గీ. అట్టి శ్రీవాసిరెడ్డి వంశాంబురాశి చంద్ర మందార దివిషద్గ, జేంద్ర సేముల
సహజలక్ష్మీయుతులఁగాంచిసర్వబుధులనమృతసత్రప్రదాయులైమెఱులరెదరణి.
గీ. అర్థికోరని దెద్ది యయ్యన్వయమున నడుగ నిక్వాని దెద్ది యయ్యభిజనమున
విభుధులకుఁ గొంగుబంగారు వేయు జేల వసుధ జేజేల గిడ్డి శ్రీవాసిరెడ్డి.౧౪౩

మ. అల వంశోత్తమ మందుఁ బాండుర సమాఖ్యన్ సాధు వృత్త ప్రచా
రులు సన్నాయక భావనారస సమా రూఢ ప్రకాశుల్ మహో
జ్వల కంఠస్తవనీయ కీర్తులగు రా జంద్రాజ రత్నంబుల
త్యలఘుల్ బుట్టిరి సద్గుణాదృతి ననర్ఘ శ్రీల రాణించు చున్. ౧౪౪

సీ. వారలో దుగ్ధాబ్ధి వారిలో శ్రీకాంతు పోడిమి వీరపనేడు మెఱసె
సములలో బలుమందసములలో బహులక్ష లార్జించి ధనమునిండారగూర్చి
హితులతో డగుపురో, హితులతో మనసార సమ కేంద్రి భోగంబులనుభవించి
వనము లాశ్రితుల జీ వనములవ్వారిగ సకలస్థలముల రాజ్యములు నిలిపి

గీ. పగరనణగించి మంస్తుభానగరుపొగరు మీరుమేటిజమీయతు మెఱయభువన
భవన లీలావిహార శుంభన్నిగుంభ కీర్తి లక్ష్మీ మనోహర స్ఫూర్తి యమ్యె.

ఉ. వీరపనేడు కత్తి ఝుళిపించి రణాగ్రమునందు దూకి ప
ల్మారు చకాపికీ నరకి మార్తుర వేలుపు ప్రోలి కంపి న
మ్మారుని పోరుటం దల సి మార్మొగమై జలదాంత రంబులన్
గారు మెఱుంగులం బిలుపు గాంచు చెలింతురు నేడు నచ్చరల్. ౧౪౬

సీ. ఘన భుజార్గళనిర ర్గళఖడ్గ ధారాళి ఖండి తారాతి రాణ్మండ లుండు
సర్వ సర్వం సహా చక్ర నిర్వక్ర సం రక్షణో పాయ దీ క్షాక్ష ముండు
నిఖిల ధర్మా ధర్మ నిశ్చయా నిశ్చయో ద్దీప్త విద్యా తత్వ దీర్ఘ వేది
సురదంతి దంత భాసుర వజ్రదీప్ర ప్రభా విభాసిత యశః ప్రసరసరసు

గీ. డహ మహమికాహవాభి క్రమాను మోద మేదురమనో వినోద గంభీరవిక్ర
మైక దుర్వహ సాహసుం డవనిననుచు నియతిగాంచెను వీరపనేడు నాడు.

ఉ. వీరపఁ నేడరాతి పృథి వీపతి రాజ్యము లందు సంపదల్
జేరప నీడు చెల్వుఁపు బ్రసిద్ధి జయంత వసంత కంతులన్
దారపనీ డశేష జనతా ఘనతా పరిపాటి మేటులం
గూరప నీడనాఁగ సరి గోరుట దూరుట మేర గాదొకో. ౧౪౮

శా. చట్టాలెల్లరు మెచ్చ భూసుర వరుల్ చుట్టుం దనుం గొల్వఁగా
గట్టాపుల్ జిన్నరించు నోగిరము బంగారంపుడాల్ పప్పునన్
దట్టా ర్బూఁచుచు నెయ్యి దోడ్పడిన స త్రంబుల్ ధరం నిల్పుచున్
గట్టా వారికి నల్లుఁడై యతఁడు విఖ్యాతిం గనెన్ భూస్థలిన్. ౧౪౯

ను. నరలోకేశ్వర యుద్ధశక్తి మతిస న్నాహ స్థిరుండైన య
న్నర లోకేశ్వరు రాణి సత్య వచనా నందాబ యందంబుగాఁ
బరి పూర్ణోజ్వల భాగ్య సంపదల మెప్పై వీరలక్ష్మీ మనో
హర నామాక్షర భాజ నంబగుచు నుద్య చ్ఛోభ రాణిం చెనున్. ౧౫౦

సీ. రాజ యోగ్యత లేదురమఃశి వాసము నందు దనమందిరము రాజదర్శనీయ
ము మపుట్టినింట గం డోద్భృత్తి కెడలేదు తనపుట్టి నింట భద్రములుదరుచు
రతికాంత కును సాంగ పతిభక్తి చాలదు తనదు పాతివ్రత్య మనుప మాన
మవిరత క్రూరాత్మ భవలీల ధరఁజెందు దనమనం బుపకార తత్పరంబు

గీ. ననుచు లక్ష్మీశ్వరీ వాగ్ధ రాంగనను మించి నిజనాథు కూర్మిగణించి శిరుల
నలరి పతికినిలోగి యయ్యతివ దనరె వీర లక్ష్మమ్మ జగదేక వినుతి గ్రిమ్మ.

ఉ. ముద్దులగుమ్మ కొమ్మనర మోహనశక్తి యనంగ నన్నిటన్
దిద్దుగడల్ గడల్ కొనఁ బతిం రతిసంపద నోల లార్చుచుం
గద్దరి సింహడింభముల గట్టడి రట్టడి సేయు పుత్రులం
బుద్దుల ప్రోక లంగ నియె బోడిమి వాడిమి మీర మువ్వురన్. ౧౫౨

గీ. ఆదిశక్తి మహేశ్వరు నంశ మునను గారణత్రయి గన్నట్లు కనియె రామ
భూతలాధీశు రాఘవ భూమినాథుఁ జంద్రమౌళి క్షమాపాల చంద్రునామె.

ఉ. ఆవసుధా ధరత్రితయ మందు గనందగు నందపుం సిరిన్
భావభవుం జయించి సుల భమ్ముగ నిష్టవిభూతు లొంది స
ద్భావిత సర్వమంగళ త భాసిలి రామనృపాలుఁడెల్ల ధా
త్రీ వలయంబు నేలుచు బ్రతిష్ఠుతుఁ డయ్యె బుధాళి మెచ్చఁగన్. ౧౫౪

క. తమ్ములు సుగుణమ్ముల మొ త్తమ్ములు విక్రమ కథావ ధారిత హరిపా
తమ్ములు దనుగొలువగ సత తమ్ములు తనసిరులుగాఁగ ధారుణినేలెన్. ౧౫౫

చ. హలినిహసించి కౌముది యొ యార మడంచి కపాలిఁగాంచి చు
క్కల మగనిందలంచి మిహి కా తతినొంచి సురదుని నెంచి య
వ్వలి మలసేవగించి సుర వల్లభ హేతి నధఃకరించి య
య్యలఘు నికీర్తి వర్ధిలెది గంతర దంతురి తాట్టహాసియై. ౧౫౬

మ. మలరాజేరులగడ్డ వత్సలయియ మ్మర్లీనికల్ దిండిజా
పలమానుర్వ...

సీ. కట్టించినాఁడు పో, గట్టువిల్తునిగుళ్లు, ఘట్టించినాఁడు శా, త్రవులవేళ్లు
పాలించినాఁడు వి, ద్వత్కవివ్రాతంబు, లాలించినాఁడు లీ, లావతులను
సాగించినాఁడు ర, స్సత్రవతంబులు, భోగించినాఁ డింద్ర, భోగపదవి
రంజించినాఁడు స, ద్రసతాపరణాళి, భంజించినాఁడు ప, ద్వర్గకుమతు
గీ. రాజమాత్రుఁ డెచోడరీ, రామనృపతి, తనయు లెవ్వరు జగదేక, ధర్మవిజయ
శౌర్యగాంభీర్యసరసతఁ, దర్యజాలు, లతికృపాళులు చెలువొందు, రవనిలోన.
చ. చతురుఁడు నీతివిద్యలను, జాణపు టింగిత భావ బోధలన్
రతుఁడు పరోప కారములఁ, బ్రౌఢుఁడు రాజ్యరమాను భూతులన్
హితుఁడటె బీదసాధుజనాల, నేర్పరి యర్థము నాస్పదించు సన్
బ్రతత యశుండు వీరనర, పాలుఁడు భాసిలె వారిలోపలన్. ౧౬౬
శా. పాంచాలాదిక భృత్యజన భావిధుమసీ, పాంచాలి కాపంచనా
చంచల్పాండు విభావి భాసురయశ, స్సారుండు సీమంతినీ
పాంచాలుండగు వీరభద్రవసుధా, పాలుండు వాలించెనో
రంచద్విక్రమకేళులన్ రిపులమా, యంజేసి భూమండలిన్. ౧౬౭
సీ. అంగ వంగకళింగ, బంగాళ నేపాళ, పాంచాల నృపసభా, భవనములను
సౌవీర సౌరాష్ట్ర, శక శూక లాశ్మంత, మరహాట నృపసభా, మందిరముల
గ్రథకైశికవిదర్భ, కాంభోజ ఘోట్టాణ, కరహాట నృపసభా, గారములను
చోళ కేరళగౌళ, మాళవ మద్రకాం, కణసింధు నృపసభాం, గణములందు
గీ. వీరభూపాలు గుణగుచ్ఛ, విసరణములు, మధుపకీమళసప్తలా, మంజుమధుర
మధుర సాస్వాద నోన్మాద, మదములీను, కవుల కానస్థకోరకాం, కములు
దనరు. ౧౬౮
ఉ. కొంగు పసింఁడియై కవుల, కుందమణీ భూషణ పట్టుచేల మా
తంగతురంగ కాంచనవి, తానము లప్పన సేయువేళలన్
బంగరుకొండ గవ్వపడి, పాటిగ దా నిరతార్థి సత్కృపా
పాంగతరంగి వీరనర, పాలుని చేతికి నిచ్చువేళలన్. ౧౬౯
సీ. అర్థిసార్థమున, కత్యర్థ మర్థములిచ్చు, తఱిసహస్ర కరుండు, తానయునఁగ
నృపసభావ్యాహార, రింఛోళిదుమికించు, తఱిసహస్రముఖుండు, దానయునఁగ.

సత్రశాలావిమ, ర్యత్రప్రచార మొనర్చు, శతసహస్ర పదుండు, దాన యనఁగ
ఘనధనైె ధనసుసా, ధనపరీక్ష లొనర్చు, శతసహస్రాత్ముండు, దాతయనఁగఁ
గీ. బహువిధాభూభరణశక్తి, పాలనాతి, భోగములనల్లయగుచు, సం,పూర్ణకామి
చెలఁగె శ్రీవీరభూపాల,సింహమునని,ఁజనులసాధ్య స్వాహారము,లస్వాజములుగ.
చ. నలువసురద్రుమ పంచకము, సక్రగమపద్ధతి వేఱువేఱ శా
ఖలనయిదింటిఁ జేకొనిజ, గమ్మనగమ్మనవార్త సజ్జనో
జ్జ్వలతకు వీరభూపకర, సర్గముఁజేసి ని సర్గపాణిమం
జులతర పంచశాఖ పద, సూనృత మూనె నటంచు రీవులక్. ౧౭౧
మ. కరుణాసాగరుఁ డాన్నవాలుఁడు జగ, త్కల్యాణి పూబోణిబం
భరవేణిం గలకంఠవాణి జలరు, ట్పాణిన్ బుధశ్రేణి మె
చ్చురహిన్ రాణిగఁ జేకొనెన్ విజయల, క్ష్మన్నన్ స్వదివ్యోపభో
గర సోల్లాసము లెచ్చఁ గాంచి సిరులన్, గందోయి కందమ్మగన్. ౧౭౨
సీ. ఏయింతి పూబంతి, సేవగించునుమేనఁ, గుచసౌరైనవాసనా, ఘుమ్ము ఘుమలను
ఏబోటి జంబోటి, నెగ్గించు నిజకళా, సరససారంపరీ, చకచకలను
ఏకొమ్మ రాబొమ్మ, నీసడించెడినవ్య, పుకుపావ లోకన, స్ఫూర్తులందు
ఏకల్కి మరుముల్కి, యేకాంతమునఁ బ్రాణ, నాథునిగరగించు, నడవడులను
గీ. దేవులందును బట్టపుఁదేవులందు, దరముగలదంచు వచియింపఁ, దరముగాదు
నాయికారత్న మగుచునె, న్నంగఁ దగిమె, విజయ లక్ష్మ్మిన మాఖ్యనా, వి
క్రమ మొప్పి. ౧౭౩
క. అద్దం పతులకు నిద్దపు, ముద్దుకు పూరుంపు గలిగె, మోహన రేఖన్
గద్దించి మరునిమైిబిరి, దిద్దించగలట్టిదివ్య, దీధితి గులుగన్. ౧౭౪
శా. రారయ్యా కవులార! తావకవచః, ప్రారంభ సూరంభసం
భారగ్రంథ కవిత్వ తత్వకలనా, ప్రౌఢప్ర సంగావళీ
ధారన్నవ్యసుధా ధరీకరణబో, ధగ్గోల్పె సర్వార్థముల్
చూరల్గాఁ గొనుఁడి, చ్చెదంచనుటచే, సూరయ్య నాఁ దగ్గిరన్. ౧౭౫
సీ. మందారవితరణా, నందుఁడం మరుజనుల్ ,శనిభూసుతులుదాస, చతురమతులె
హారికుమారమనోహ,రాంగుఁడందురు పేంద్ర,శిఖివాహనుల కేమిచెలువుగలను

రాజహంసయశోభు, రంభరుండయిండు, నింద్రసూర్యులయశం, బెద్దికనంగ
కమల భూశేముషీ, కతనులింతురు వ్యాస, తాన్నెలంబు లబుద్ధి, గరిమగలదె
గీ. యనుచునస్థాంతరోక్తిని, హ్వానమునన్, జగతినాయుస్సు తాపస, శక్తిభోగ
భాసుచిత్వపమాన్యద్ధిపటుతసామ్య, సూక్తిసూరయ్య కెంతయు,సూజనులు.
క. తారలు వారుదవాగ్మల, ధారాధర పటలిపగిది, దప్పించినరి
తాన్నెరమణుల పొదయూప్పుచు, సూరయ్య పరాక్రమమునుపూరె మ్యోగిదా.
చ. ధరంబరి తాపమూని కర, ధారల జీవనముల్ హరించున
త్తరణికి వేయుచేతులిపు, ధాతకు తట్టనికి దప్పెభో వసుం
ధరపరి తాపమూర, గిర, ధారల జీవన ముల్ ఘటించుభూ
వరమణిమైన సూరసర, వల్లభు నిర్మితి సేయుటకా బళా. ౧౭౮
ఉ. పండితపోషిసూర సర, పాలు కృపారచితంబులై జగ
న్మండలిరంజిలెక వితరణంబులు సత్కవి కంఠభూషలై
పండిత కర్ణభూషలయి ప్రస్తుతి పాత్రితంగాంచె స్వర్ద్రుమా
ఖండలనై చికీగుణచ కచ్చకమచ్చిక పిచ్చలింపంగక. ౧౭౯
చ. బలరిపు భూజరాజి వన, వాసమునక, బలియూరసాతల
స్థల వలనుబునక, జలద సంఘము కూటగతావనాప్తినా
కులతలం జెంది, హ్రాస్వగతి, గుంది, జడాత్మతనొంది, ప్రొండుట
య్యాలఘుండు సూరభూమివిభు, నబ్బంపుకీవికి నోడియేకదా. ౧౮౦
శా. మట్టిక నైరినృపాలజాల మకుటీ, మాణిక్య రింఛోళికల్
కట్టించత్తదనంత రాజ్యములంజ, క్కాందోరణంబుల్ ధరం
బెట్టిక భూసురపాళికి సముచితా, భీష్టాన్నముల్, మెచ్చిచే
పట్టిక గోరిక నచ్చమాంబ యునున, ద్వ్యాఖ్యాపూర్ణ రాణిగక. ౧౮౧
క. ఆకడలింగలుషుల నవ లాకరణిని సమ్మతకర కలా దరవర ర
త్నాకల్పాన్విత పుత్రుం, బాక కులాంభోధియచ్చ, మాంబతినర్చెక. ౧౮౨
క. పులిజున్ను పుట్టతేనెయు, గంపుట్టిల్లయ్యు నవనెం గాంతుని బికిలెం
బుల నునుయని పుట్టెలున, తిలుకిరింగనియచ్చమాంబ, దీప్తింబర గిక. ౧౮౩

ఉ. సమ్మతి బంధురాబలజ, గమ్ములనిమ్ములఁగాంచ మొక్కయ
కొమ్మల ధర్మవర్తనల, గూడిక వాడిక కెక్కె సంపదన్
గమ్మనివిల్తు తల్లి సరి,గా విరళించి సమస్త భోగముల్
కొమ్మని విప్రకోటికిని, కోరికలొందిన యచ్చమాంబయే. ౧౮౪

సీ. ధరణీసురులలోన, దా చుటింతియకాని, ధనముపెట్టియలలో, దా చనేర
దతిథిసంఘములని, ప్రాప్తిఁ బెంచుటగాని, ప్రియభక్తులనుకొడల్, బెంచు
నెఱుఁగ
దిరుపేదలకునుగ్రాస, మిడిపూర్పుటయకాని, కొల్చుకొట్టులలోన, గూర్పు
నెఱుఁగ
వెల్లబాధువులకుఁ గొల్లఁబుచ్చుటకాని, రాజభోగములయా, రాటమెనయ

గీ. దెట్లుసేర్చెనో కృతకృత్య, వృత్తిహత్తి, మత్తిలు నరాతులకునెత్తి, మిత్రమైన
యట్టిసూర నృపాలుకాం, తావతంస మచ్చమాంబికఁ గొని యాడ, నా
నెజగతి. ౧౮౫

క. మన్నిలమిన్నయ్యనుమా, రన్నకునచ్చమ్మయందు, నాత్మజులు గుణా
భ్యున్నతులు దయించిరినర, సన్నయు రామన్నయనఁగ, సరసాగ్రణులై. ౧౮౬

క. అన్నృపులిరువురుఁ జననర, సన్నయుఁజనరామలింగ, శౌరియునవిధా
త్రిన్నెగడి రాజకులముల, మిన్నలుమన్నింపఁగీర్తి, మెరసిరి సిరులన్. ౧౮౭

సీ. డిండీర డింభోళి, చెక్కునెక్కులుపుచ్చి, ఘనహిమానీద్యుతుల్, కసరివైచి
శరదభ్ర రేఖకా, సంభ్రాంతిపూయించి, శారదారుచిపాళి, జక్కఁబెట్టి,
కౌముదీ విలసనా, కర్షణంబొనరించి, కలశ పాథోరాశి, కలతపెట్టి,
విబుధ సింధురకుంభ, విహరణశ్రీఁజెంది, సింహడింభములపైఁ, జిందుద్రొక్కి

గీ. సురతరులనెంచి జిగిమించు, సొంపుఁగాంచి, చిలువ రేనిమేటి గడిదేరి, చెలువ
మూరి
రాజనందన రేనిపై, రాజమాన, రాజనందన యశోముదా, రతఁజెలంగె.

క. ఆరాజ కుమారులలో, ధారావర వితరణైక, ధారాపటిమన్
ధారాధర జయలక్ష్మి, పారముగని రామలింగ, పార్థివుఁ డలరెన్. ౧౮౮

సీ. తనమమ ద్విత్రతనుపతి, ధ్యానతనుచరణైక, వృత్తి చేసార్థకీ, కృతివహింపఁ
దనచుతుష్వేము రాఘు, దర్శనశోభిచే, సహజార్థ సంపత్తి, సరసి: జూపఁ

దమ విపక్ష తబంధు, తాదూర సుచారిత, భావమ్ము ననిసర్గ, పదవి నెఱపఁ
దమదస్యు శబ్దార్థ, తత్పరత్వమునిశా, విహరణమ్మునసార, విహృతిఁ గఱప
గీ. నవనిఁ జినరామలింగ, ధరాధినాథు, వైరులతిభీతి మలలలో, పలవసించి
రచ్చలకుఁ బాసి పోషిత, భ్రమణ మెనసి, చౌర్యమున జీవనము సల్పు,సాగిర
పుసు. ౯౦

క. అర్థులకుం దార్కొనుబ్రబ, త్యర్థులకుఁ స్వస్థనృత్తి, హత్తించిసిరుల్
వర్ధిలఁగ రామభూవిభు, డర్థింబురు పార్థసమితి, నార్జించెనిలన్. ౯౧

సీ. జయముచేఁబరలోక, భయముచే ధర్మని, ర్ణయముచేసరపాల, నయముచేత
ధనముచే విబుధన, ర్తనముచేఁ బుణ్యాసా, ధనముచేఁ దత్త్వ మం, డనముచేత,
జలముచేసునభుజా, బలముచేఁ బటుతప, ఫలముచే జగమెచ్చు, కులముచేత
శమముచే బంధుసం, గమముచే విభవసం, క్రమముచే విషయసం, యమము
చేత,

గీ. ననుపమాన ప్రభావభా, వానమంగ, సంగతి చిరంత నాశేళ, సమితి మీఱి
వెలసెఁ జినరామ లింగభూ, విభుఁడుస్వాంత, రంగబపేంరంగ శోధనా,భ్యర్హ
గతుల. ౯౨

సీ. ఏర్లగడ్డకులాబ్ధి, హిమకరా కారుఁడౌ, కోదండ రామరా, ట్కులమణికిని,
నందనిగ్రైబుధా, నందకోరకపుంజ, మార్జమైన భావమావతంస
మలివేణిసంగమ్మ, యనువ భూమణితన, పట్టంపు రాణిగాఁ, బ్రబలి సుకల
నరులఁ దన్పుచుశక్తి, నరుల దున్ముచునత్రు, తీవ్రప్రతాపసం, దీపుఁడగుచు

గీ. తామ్రతలాగత కల్పవృ, క్షంబ నంగ, హితుల నతులాను భావసం, జితుల సుకవి
తతులనక్షయభోగసం, గతులఁజేసి, యలరె శ్రీరామలింగగో,త్రాధినేత. ౯౨

క. ఆరామ లింగనృపతిమ, హారామ తటాక వారివా, రాలయ ముఖశో
భారమ్య సప్తసంతతి, నారూఢిఁ బ్రతిష్ఠఁజేసి, యలరె ముదితుఁడై. ౯3

మ. క్షితి సంతానము రామలింగవసుధా, సీమంతి సీవల్లభుం
డతులైశ్వర్యధు రీణుఁడై యినాపరా, యత్తు క్రియాకౌశలిన్
సతతోత్సాహమె లర్పఁగాను భయసం భావైక మూలంబుసం
తతిలేమిన్ చుచుఁగుండి కోవిదులతో, ధర్మైక గోష్ఠిరతిన్. ౯౪

క. సరస మనోహర మతిబం, ధురగంభీరార్థ భరణ, ధూర్వహమభితః
పరమార్థ సాధకముశుభ, భరితంబగుసూక్తినిట్లు, పలికెఁ సభలోన్. ౧౯౫
ఉ. నాటిరికీర్తి సస్యముల, నారతమున్ జగదంత రంబులన్
మీటిరి శత్రుకోటులన, మేయభుజాబల వైభవంబునన్
దాటిరి దుర్భవాంబుధులు, చారతరవ్రత చర్యలన్ నిరా
ఘాటత మత్పురాతనుల, ఖండర మూరమణీయభోగులై. ౧౯౬
క. అమ్మహనీయు లరుణతతి, జిమ్మమ దార్జితములైన, స్థిరరాజ్యశ్రీ
లిమ్ముగఁ బాలింపనిదా, నమ్మగు సంతానమెట్లు, నాకయ్యెడునో. ౧౯౭
గీ. అనివచించు మహారాజు, నాదరించి, విబుధ వర్యులు వలికిరు, క్ష్మీశచంద్ర!
నీదుధర్మైకతానతా, నియతికాత్మ, నలరితిమి చింత యింకేటి, కవధరింపు.
క. సమవాప్త సర్వకాముఁడ, వమలినసర సాంతరంగి, వవనీశ్వర! నీ
సుమనస్కతఁ గంటిమిమి, టిమివాంఛిత మద్భుతఁపుఁ గడింబగఁ దోఁచెన్.
చ. ఇహపర సాధకంబగుమ, నీపజనించి నచించు నీవచో
మహిమము మెచ్చవచ్చె బుధ, మాన్యతఁ గంటివి భూమినాథ య
న్వహముఁ బరోపకార పరి, ణాహివి యన్నట మేలు భావనా
విహితముగాఁగ దత్తవిధి, వేఁడ్కనొ నర్పుము నేర్పుచేర్పునన్. ౨౦౦
క. ఔరససిద్ధి బొసంగమి, చోరస మతంబుదత్త, సూనుగ్రహణం
బోరాజల లామమ! ది, వ్యారూఢిన్ జ్ఞాతిసుతుని, నందికఁగొనుమీ. ౨౦౧
క. ఇదివేద పురాణాగమ, విదితంబని నిశ్చయించి, విబుధులు వల్కన్
ముదమంది రాజపుంగవుఁ, డుదితోత్సాహుండు దెచ్చె, నొక రాత్త సయున్.
ఉ. ప్రపితామహుండయిన, పార్థివనందనుఁ డద్వితీయుఁడై
యప్రతిమాన తేజుఁడగు, నట్టిధరాధిపు రాఘవేశ్వరున్,
దీప్రపితౄణవార్ధిఁ గడ, తేర్చినయా పెద పద్మనాభధా
త్రీప్రభు గర్భరత్నము, తేజరిలెన్ నృప లోకరత్నమై. ౨౦౩
క. ఆరాజ కుమారుఁడు రే, ఖారాజక మూరుఁడగుచు, ఘనరాజ్యశ్రీ
లాహూషత నార్జించియు, దాంత నాగన్న గారనాఁ జెలువొందెన్. ౨౦౪
ఉ. ఆనసుధా సుధాంశునకు, నంగన మైతగు పార్వ తమ్మపుం
భావత నాత్రిశక్తులిలపై జనియించి రసంగ నొప్పగో

ప్రావరులఁ గుణోత్తరుల, రామధరావిభు, జగ్గభూపతిన్,
బావను వేంకటాద్రియను, పార్థివుఁ గాంచెను మువ్వురన్ వెసన్. ౧౦౪
క. ఆరాజ త్రితయములో, జారుతరో త్సాహిజగ్గ, జనపతి ననసీ
శౌరిచినరామలింగమ, హీరమణుఁడు పెంచుకొనియె, నెల్లరుమెచ్చన్. ౧౦౫
శా. రంగాం బాచిన రామలింగ మహిరా, డ్రత్నంబు లార్యాశివుల్
గంగానందను చేముదంబలరు రే, ఖన్ జగ్గ ధాత్రీవిభున్
శృంగారప్రథ మావతారుసుతుఁగాఁ, జేకొంచు నుప్పొంగియు
త్తుంగ శ్రీలలితాష్టభూతి విభవో, ద్వ్యక్తిన్ విజృంభింపఁగన్. ౧౦౬
గీ. అలజగన్నాథ నృపతిభు, జాగ్ర జాగ్ర, దుగ్రకరవాల ధారావి, యోజి తారి
మండలేశ పరంపరా, మకుటరత్న, నిచితథాత్రీత లుండౌచు, నేలనేలె.
సీ. కదసి పంజులనుల, గ్గలకెగ్గఁబురికొల్పి, కోయంచురాదీసెఁ, గొండవీడు,
వెనుక కాలిడకచి, వ్వనఁజువ్వగుంపుల, వెట్టఁజూపిగణించె, విన్నకొండ,
కలియు గార్జునుఁడంచు, గలఁగినైరులువార, బెదరించిచేపట్టె, బిలముకొండ.
గండర గండఁడై, కదిసి మీసముదువ్వి, కొంగుముల్లెగఁ దెచ్చెఁ, గొండపల్లి
గీ. మఱియుమేదరసాలము,మ్మరమురాయ, దుర్గఁపుగడిందిచిహ్నము,ల్దూలపుచ్చి
కొనియె దుర్గాధిపత్యంబు, కుతలపతులు, మెచ్చ జగ్గక్షితీశుఁడ, మేయశక్తి.
గీ. కమ్మవిలుకానిరాణిచ, క్కందనమ్ము,గమ్మపడసేయునందమ్ము, గమ్మరనఁగఁ
గొమ్మలకు నెమ్మనైయె యిటు, గ్రమ్మరిలఁగ, నమ్మహీజాని జాయయ, చ్చ
మ్మతనరె. ౧౧౧
ఉ. బాలర సాలసంతతిని, భాసిలఁ గాఁగల కంఠకాకలీ
లీలలెసంగ గాసుమశి, లీముఖ మాధవ యుక్తి మించఁగా
భూలల నాల లామమగు, పుణ్య సతీమణి యచ్చ మాంబ శో
భాలలితాగ మోపవని నాఫల దాయిని యయ్యె నెల్లెడన్. ౧౧౨
శా. ఆరాజన్యున గృహపతం సముచిత, వ్యాహార నిత్యామృతా
హారస్వైర విహార భీతిపరిహా, రాపార ముక్తామణీ
హారప్రాగ్రహ రాగ్రహారమణిభూ, షాదిన్ నిజాఘాఘసం
హారిం భూష్పఁగ నాథుతోఁ గలిసిని, ప్రాలిన్ భజించున్ గడున్. ౧౧౩

సీ. రాజ్య వైభవమున్న, రాజ్యాధిపుఁడన్న, నేకాంత పత్నియై, యేలిదేలి
భాస మానము హొందని, భాస మాన ప్రౌఢి, దెస లసత్కీర్తి సా, ధించి మించి
భోగ భాజనకళా, భోగభాజనముగా, ప్రాభవ మఖిల మెల్ల, జఱపి నెఱపి
నిత్యశృంగారతి, నీతి భంజనశక్తి, జనము లాలించిమే, ల్వలిపి సిలిపి
గీ. ధర్మపత్నీస మేతస, త్కార్యమర్మ, కర్మశుండయి ధరవైచి, కమ్మ్యదసను
సౌమ్యు గావిూద నాముష్మి, కమ్ముఁగూర్చు, తరుల గొప్ప రుండు లేని, చి,,తల
మానిని. ౨౧౮
చ. హాహార సేవనానిరతి, సంతనిరంతర భక్తి వాసనా
కరములు పుత్త్రికామలతికా, పరిపోషణ సుప్రవర్తక్రియా
కరములు నిష్ఠమై బుధస, తాతతకర్మము లాచరించుచుం
దరుణియు దానధర్మగుణ, తత్పరతం దపియించు చున్నెడన్. ౨౧౯
శా. ప్రాణాపాన సమీకృతి స్ఫుటితకం, ఠాంభోజ మాధ్వీసుధా
పానోన్మాద మెలర్చి మేనుసొగ, యుం,పంబోరుక్కు నాల్గోన ప్ర
హ్లానంద ద్రుమ కోరకంబుమనతే, జోంకూర మాత్మాంగనా
ధీనంబై జఠరంబు సొచ్చినటులం, దీపింప తేఁడమ్యోషన్. ౨౨౦
గీ. తనమనో రథసిద్ధిసూ, చనమభీష్ట, దేవతాకర్తృకంబని, తెలిసి విబుధ
సంవి ధానంబు గానాత్మ, సతికిఁ జెప్పి, నిరతి శయ మోది యగుచుండ, నిశ్చ
యమున. ౨౨౧
సీ. రేణుకా గర్భమ్ము, రాణింప నుదయించి, జమ దగ్ని నలరించు, జక్రధరుఁడు
కోసల కన్యకా, కుక్షి వెల్వడివచ్చి, దశరథేశునిఁదేర్చు, ధరధరుండు
దేవకీ జఠరసం, దీప్తుఁడై ప్రభవించి, వసుదేవు నెనగించు, వార్ధి శాయి
జలజాక్షి యచ్చమ్మ, జఠరమ్మునజనించి, జగ్గభూపతి సుత, సమునఁదార్ప
గీ. వెలసె నోయన, జెలువొందె, విభవవితర, ణప్రభావ ప్రభుత్వదీ, ప్రప్రతాప
ధీర తాముఖ సద్గుణో, ద్దీప్తమూర్తి, వేంకటాద్రి మహాన్నత్య, వేంకటాద్రి.
గీ. కృతయుగాదియుగత్రయా, కృతనిజావ తారములమూటవఙ్ణత్రి, తయముఁదేర్చి
నాల్గవ యుగంబు వెలయించు, నాగ శౌరి శూద్ర కులమున దా వేంక, టాద్రి
యనఁగ. ౨౨౨

ఉ. నిరతిశయ ప్రభావ మహా, నియత ధర్మ గుణాను వర్తినై
ధర వెలయించి తండ్రినిజ, దైవతశమ్ముడు సార్థ్వలోకరా
జ్యరమకు వల్లభుండగుడు, నంతసపత్ని జయాభిలాషచే
నరిగెన నాగఁడల్లియన, లార్చుల గ్రుగ్గగ సర్వకున్వోసర. ౧౨౦

సీ. దాన దీక్షాసంవి, ధానాధు నాతన, మాంధాత యనవొప్పు, మహిత రుండు
త్రిభువన నీవిదితకీ, ర్తి ప్రతాపద్వయీ, పుష్పవద్వితత్వాను, భూష్యభువని
జనరంజ న ప్రభా, చాళుక్య రఘు రామ, పరిపాల నోన్నిద్ర, భద్ర మూర్తి
శమద మానుష్ఠాన, సామరస్య క్రియా, జనక ధర్మోత్సాహ, జనక విభుఁడు

గీ. నగుపితృవ్యుఁడు రామగో, త్రాధినేత, లాలన మొనర్చి ప్రోవఁద, ప్రమణియైన
జానకీదేవియట్లపో. షణమొనర్ప, నక్క మారుండు వర్థిల్లె, నంతనంత. ౧౨౧

మ. జనక జ్యేష్ఠ కనిష్ఠులైన నృపతి, స్వారాజు లారామనా
మన రాఘనుఁడు వేంకటాద్రి విభుఁడు, న్మన్నింపఁ దమ్మానులో
య్యాన నాగన్నయుఁ జంద్రమౌళియును దోషైయాఁడు చోఁ భాడుచో
జనవృష్ణాపఁగ వేంకటాద్రి కొమరుం, జాదంబుఁ జూపెన్వోసర. ౧౨౨

గీ. ఈశ్వరోల్లాసమటులుండ, నెమ్మి థాను, నీశ్వరత్వంపుఁ బేర్మిన, నృపసుతుండు
నాఁడు నాఁటికిశైశవక్రీడలందె, యద్భుతారంభశక్తిప్రభా, వ్యతఁదనర్చె. ౧౨౩

సీ. చతురాననుఁడువచ, స్సామరస్యములందు, సర్వజ్ఞుఁడార్యాదు, మంగములను
బురుషోత్తముఁడుధరా, భరణ ధూర్వాహమున, జిష్ణుండు విబుధన, ధిష్ణు కళల
గాస్యాతుఁడుసహస్ర, పత్రార్జనములచేఁ జైవాతృకుఁడుదమః, శుణనములను
శుచిసర్వ ధారాజ్య, సుఖద భోగములచే, రాజరాజిష్టార్థ, రంజనముల

గీ. రహివనంతప దాధికా, రమ్మునలుగ, దివ్య తేజస్స ముల్లాస, ద్యుకళయరుదె
యునఁగనగరాజ ధైర్యసా, హసవిలాసి, వెలసెభూదేవభాగ్యమై, వేంకటాద్రి.

సీ. ధర్మకాండాభ్యాస, తత్పరత్వముకాదు, ధర్మకాండాభ్యాస, దక్షుఁడయ్యె
మంత్రాంగ కలనాని, మర్మనం బేకాదు, మంత్రాంగ కలనాభి, మానియయ్యె
రాజశేఖరభావ, రక్తిఁగొల్పుటెకాదు, రాజశేఖరభావ, రసికుఁడయ్యె
పరమార్థ సంగ్రహ, ప్రౌఢిఁగాంచుటెకాదు, పరమార్థ సంగ్రహ, ప్రబలుఁడయ్యె

గీ. శైశవమునాఁటఁ గోలెరా, జన్యతనయుఁడైహికాముత్రికక్రియా, భ్యాసాధుల
బుధుల ఘనములఁ గరగించు, పాలుపుఁ జెలుపు, నని తర్పతి మానసానను
న్నసను. ౧౨౪

క. ఆవేంకటాద్రి నృపతిధ, రావలయం బేలె వైరి, రాజన్యమనో
భావలతా భావలతా, కేవల తాధుర్య కార్య, కృతచర్యాఢ్యై. ౧౨౯
సీ. మెచ్చు లిచ్చుటె కాదు, మేటి శ్రీ మాతుల, కప్పులిచ్చిరి నిచ్చ, లర్థి జనులు
పాఱిపోవుటె కాదు, పటువింధ్య గుహలలో, దూకిడాగిరి సర్వ, దుష్ట రిపులు
కలిమి మించుటె కాదు, కడిదిరా గరుపంపు, బలిమిమించిరియెల్ల, పరిజనములు
రాగమందుటె కాదు, రమణుల తో నిద్ర, భోగంబు లందిరి, భూమి ప్రజలు
గీ. రాజ రాజాధి రాజవీ, రప్రతాప, రాజ మార్తాండ బిరుదాభి, రాముఁ డైన
వేంకటాద్రీంద్రుఁడిలనిరా,టంకవిజయ, సాహసాంకత నేలునా, సమయములను.
సీ. అష్టదుర్గానటీ, హంవీరరతి రాజు, సాళీతిగజఘటా, చక్రవర్తి
రాజాధి రాజవీ, రప్రతాప ఘనుండు, గడిదుర్గ గండర, గండ బిరుదు
రమ్య చాళుక్యనా, రాయణ రాణ్మౌళి, క్రౌంచ పట్టణపుర, గ్గాంధకర్త
జన్నికట్టడిగుత్త జట్టిమల్లుండు రెడ్డి, కర్నాట నృపరమా, కాముకుండు
గీ. వాసిరెడ్డి కులాబ్ధిజై, వాత్రుకుండు, వేంకటాద్రీంద్రుఁ డతికృపా, వృష్టి మలుప
సిరుల నలరారి బ్రాహ్మణ, శ్రేష్ఠులెల్ల, తన్మతలము యూపనిరవ, శేషము
సీసమాలిక.
గంగానిరి. ౧౩౦
దశపురీనిర్మాణ, ధౌరంధ రీశాలి, శతముఖి పుణ్యసా, తద్గురిపుండు,
ప్రాజ్ఞసాత్కృతశత, గ్రామాగ్ర హారుండు, శతసువర్ణస్తంభ, శాసనుండు
చాముండికామరే శ్వరహర్మ్యగోపుర, ప్రాకారకల్పనా, ప్రథమకర్త
గోదానచాళుక్య, గుణఘూర్ణి తయయాత్రి, బహుసప్త సంతాన,పారగుండు
అవిముక్త సేతుయా, త్రానందసుఖభోక్త, భగవతీపూజనా, భరితయశుఁడు
సంగీతసాహిత్య, సరసవిద్యాభోజుఁ, డద్వైత భావనా, భవ్యహ శాంతి
లలిత సాలగ్రామ, లక్షదానవిధాని, కోట్యన్నదాతృతా, కుశలఘనుఁడు
హేమాద్రి దానైక, హేలావిలోలుండు, సిద్ధంపంచాక్షరీ, సిద్ధధనుఁడు
సాంగ హిరణ్యగ, ర్భాశ్వగ ప్రవణుండు, ద్విజభుక్త శేషభు, క్తివ్ర తుండు
గీ. వీరశంకర బసవహం, వీరమన్నె, రాయసుల్తాను బిరుదవి, రాజమానుఁ
డగుచు శ్రీవేంకటాద్రి ధరాధినేత, కవిమరవగావసుగు, ణాభి గణ్యుఁడయ్యె.
క. అన్వాసు భాసర మణికిఁ, జన్వాని వెత్రమ్మదాస, సమయములందుఁ
గన్వాగబా బంగరుమల, యన్వాని తామణిని నెన్న, నగుమగు వలెఁ. ౧౩౧

సీ. విభునికౌఁగిళ్లలో, నేల్పుటెత్తెడిమిన్న, తటినర్థ తతి కెల్లఁ దల్లితల్లి
సరస వాగ్రచనందు, చ్చనలాఁడ నుడిలేమ, స్వైర వర్తనలన, చ్చనుగ …
యిష్టాన్న మిడఁగవి, శ్వేశ్వవు నిల్లాలు, రమణసద్భక్తి శ్రీ, రామరామ
ధర్మనిష్ఠాయూఢి, దశరథేశ్వరురాణి, శత్రుసాదనశక్తి, సత్యభామ
గీ. యనుచునునిచినగౌరవ, వ్యాప్తినాప్తి, సుజనులభినుతిసల్పమె, చ్చులఁదన…
చేవకులమలయాద్రికి, శ్రీరమయంబొ,యనెడి పాపయ్య పట్టిపె, త్రమ్మ…
సీ. ఏకదేహానోన్యన్య, హితవర్తనంబున, శాంకరీ శంకర, చ్ఛాయనలరి
రమ్యసౌహార్దవి, భ్రమవిలాసవ్యాప్తి, శ్రీశ్రీయః పతులమ్మ, చ్చికలఁ దేరి
పలుకులో నిండుపుఁ దప్పంగ నీమి భారతి, భారతీశ్వరులమ, వ్వమునఁ దెలఁగి
అమర భోగోల్లాస, మతిశయింబిశచీశ, చీశసర్వార్థము, హిమ్మతిఁగని
గీ. ప్రబలె విబుధాభి వంద్యమై, బహుసహస్ర, దంపతీపూజనాయత్త,ధ…
మగుచునద్దంపతీరత్న, మనసియందు, నెలమి నెత్రమ్మ వెంకటా, ద్రీదమ్…
క. ఉత్తమ సిరితో హరివలె, చిత్తగి నెజ్జమ్మకొండఁ, బృధివిప తిలకా
జౌత్తిలియుఁ చిత్ర్యాజాంబుధి నెత్తిగల బక కయునికి, కోర్చునసంతతా…
చ. ఎలమి పయోన్నతాదుల సమీహిత వర్తన నాత్మ వాప్తికై
సలిపియు సిప్పితంబుఁ గనఁ జాలమి మత్తచకోరనేత్రసే
చ్చెలిఁదమి నీరుకొండ నరసింహ ధరావరు పుత్రిపావ్వలి
జలజగళేక వివాహముయి సల్పెను దంచిత కంతు సంపదల్.
సీ. తనపుట్టి నిలుచిరు, తనమని యన్నరు కొండ క్రొత్తగనిరు, కొండగాం…
దొలుగవానరసింహ,పూర్వపుండఁటిం త్రిగీ,నరసింహామూర్తియైనలు…
సర్వాంగసౌందర్య, సరసతిమునులేమి సహజ పూర్ణాంగాభి, మంగ…
దనచండికాన్నలిఁ, దాఁచి సర్వజనాను, రాగంబు మదిలోన, రహిం…
గీ. ధరణితలమున నపరాన,తారమొయిను పార్వతీదేవి నా బుధ, ప్రతలి…
బరమ పావని యైనయు, ప్పార్వతమ్మ రాజశేఖర కాంతయై, రక్తిఁ…
క. అప్పార్వతమ్మ, శ్రీసతి యప్పాలలోఁబు, ట్టిపెరిఁగె నంచనగౌన
ల్లస్వాను ద్విజ పుంగవులకు నప్పులు దీర్చునటులర్థ, మర్పించఁగ…
మ. ధన ధాన్యంబుల సర్వ సంపదలపాం, తత్యాంబ ఖాంతుంబనా
కనియుం జాలక కామధేనువు దివ్య, … నామాంబ తే

వసుధింతర్ల బెడఁబాపి భూమికినుహా, ధర్మాత్మ్యస్సైపార్వత
మ్మన వోల్లాసముతో బుధావళికి ని, మ్మానసంప ద్దార్చుచున్. ౧౩౮

శా. నేర్చున్ వల్లభు చిత్తవృత్తి తనపై, నిండారఁ గానిల్పఁగాఁ
గూర్చున్ సద్వ్రత నిష్ఠలన్ సుకృతముల్, గుప్పల్వడం జత్తముల్
గార్చున్ బ్రాహ్మణ కోటులన్ మనములో, ధర్మైకనిష్ఠారతిన్
జేర్చుం బావని పార్వతమ్మ గుణముల్, స్త్రీమాత్ర సాధ్యంబులే. ౧౩౯

సీ. ఆరఁగాగినపట్టు, టావుల దుగ్ధముల్, తన్వదీరఁగ నెందుఁ, ద్రావలేదె
వ్రీలఁ బాడిన చింత, చింత మామిడి పండ్లు, నోరూరఁ గామెక్క, వారు లేరె
తెల్లజేనియపాల, తిమ్మనంబులు గ్రోలి, తెజూపిరించుక లేక, త్రేవ్ర్పలేదె
మాగడల్చుక్కెరల్, మెదపి సందీకుండ, భుజయించి విపస్సైౖ, పొరల లేదె

గీ. యన్ని యటులుండ నిమ్మ మాఁ, కెన్నఁ దరమె, భాగ్య వతిస్సైన యట్టియ, సాపార్వతమ్మ
యన్న సత్రంపు దరానంద, మనవిసిరుల, కమ్మృత సేవనమయ్యెనే, మానఁగఁగలఁడు.

గీ. సాప్త పూరుష మైనిడఁ జాలకున్న, యర్థి దారిద్ర్య, మఱి పఱిలయ్యె ననఁగఁ
బార్వతమ్మసునీతపః ఫలముగాదె, దానలక్ష్మికినపరావ, తారపూర. ౧౪౧

మ. తరుణీరత్నము పార్వతమ్మ పతిచి, త్తంబాత్మ విత్తంబుగా
నిరతంబాత్తసు భోపభోగముల ని, క్షిద్రస్థిరింగాంచి సా
దరవృత్తిన్ ద్విజదేవ తార్చనలని, త్యప్రీతి రాజించుచున్
ధరనాత్మేశ్వరు నిండ్రుతీయ పురుషా, ర్థశ్రీరహిం దేల్పఁగన్. ౧౪౨

చ. అధిగత సర్వకాముఁడగు, సజ్జన పాలల లామ మన్వధూ
నిధువన భోగసంపదభి, నిస్తుల రాగరసాబ్ధి నీదియున్
పృథునిర పత్యతాంబునిధి, నీదగ లేమిఁదలంచి ప్రాజ్ఞలి
న్విగము వచించి రంచితన. వీనవిధిగ్రహన ణంబుగా రహిన్. ౧౪౩

క. మానుడి మానసి కవ్యథ, మానుఁడి వినుఁ డౌరసాను, మానమ్మనస
న్మానమ్మున డత్రిమసం, ధానమ్ము యను ధార్థవిధివి, ధాన మ్మనియున్. ౧౪౪

మ. విబుధోత్కీర్తిత వాక్సుధాంబుధి మహా, వీచీవ గాహంబునన్
సొంబగై హాయిఁ జెలంగు మానసమునన్, సొంపుల్ దువాళింప న
వ్విబుధా ధీశ్వర వైభవుండుననఘ, ద్విజాని వల్కెన్ నుడిన్
నిర్ణిదార్థంబుగఁ బంకిత వ్రజములో, నిష్ఠాగరీయస్థ్యంబుగన్. ౧౪౫

శా. పుత్రస్వీకర ణార్థబోధనలసు, పూర్ణంబుగా శాస్త్రముల్
శ్రోత్రార్థంబుగ నానతీవలయునం, చుర్విన్నవించంగ స
ద్గోత్రాధీశుని తో బుధోత్తములసం, కోచస్థితిం బల్కిరా
ముత్రార్థావహ దత్తసంగ్రహణసం, బోధంబు నావాక్యముల్. ౧౮౬
శా. విజ్ఞానేశ్వర కాలమాధవముఖా, విఖ్యాత ధర్మానవి
విజ్ఞేయార్థము లేర్పరించి విబుధుల్, వేర్వేఱ భాషింప ధ
ర్మజ్ఞానాహమతప్ర భేదములను, ర్మంబెల్ల శోధించిత
త్వజ్ఞానా నుభవంబుఁ జెందిపతి దత్తస్వీకృతిన్ లోలుఁడై. ౧౮౭
క. ఆయుర్భాగ్యములునిజో, పాయంబుల జీవకోటి, పాల్పడునెయదృ
ష్టాయత్తంబులు దెలి యఁగ, నేఁటునువునఁ గామితెల్ల, నిదియన యుంగళా.
క. పేష్టవ్యా బహావోయని, శిష్టోక్తుల జనకవాంఛ, జెప్పెనిది మహాో
త్కృష్టగతియాారసార్థము, స్పష్టముగాదయ్యెదత్త, సంగ్రహణములన్. ౧౮౮
క. భారత భాగవతాధిక, పౌరాణిక గాథలనుడ, పస్వీకు లేంద్రుల్
కూరిమి బహుదత్తస్వీ, కారముగా వించునట్లు, గావిందుమునీ. ౧౮౯
క. అనియాలోచించి మహా, వినయోజ్జృంభిత వచఃప్ర, వేశంబులన
మ్మనుజప తిసుధాంబుధిను, జ్ఞనమునబలెబుధులదేర్చి, జనితోత్సవుడై. ౧౯౦
మ. జనక జ్యేష్ఠక నిష్టులోయనఁగవి, జ్ఞానంబునన్ ధన్యులా
జనకజ్యేష్ఠ కనిష్ఠు లర్థిజనర, పౌదక్షిణుల్ రామనా
మనరాధీశుఁడు, వేంకటాద్రి యనునా, నూఘ్యుల్ తదీశద్వయిా
తనయోద్భూతుల రాకుమారులగొనెన్, దత్తాత్మజఖ్యాతులన్. ౧౯౧
క. అన్నంద నయుగళమునజ, గన్నాధ నృపాలుఁడగ్ర, గణ్యాంకైయా
పన్నుల పెన్నిధియైనగ, భిన్నభవిభవాసుభూతి, పృథుయశుఁడయ్యెన్. ౧౯౨
ఉ. రెండవ నందనుండు, శుభ రేఖజయుంతవ సంతకంతులీ
రెండవరూపు లూనిరొకొ, నేదార రాత్రిజరించు నొక్కనా
నిండుటొ యూరముల్ సహాయలు, నీటులు దేటలు, వారబొప్పెభూ
మండలి రామనాథనృప, మాన్య, జగన్నుత శక్తి కేవలై. ౧౯౩
సీ. సమర సాహసధనం జయుడింతి యేగాడు, చటులవిక్రమధనం, జయుడితండు
కరుణాసరిస్వామీ, కామినుంతిరామనాన్, ఘనకీసరస్వామీ, కానిమాడు

చాతురీవిబుధరం, జనుడింతియే కాదు, సద్భక్తి విబుధరం, జనుడితండు
ధర్మరక్షణకళా, ధాముడింతియె కాదు, దానధారాకళా, ధాముడితండు
గీ. రాజసూత్రుండె కీర్తిని, రాజతాప్త, దిగ్గమాపూర్ణ సామ్రాజ్య, దీప్తిశాలి
రామనాథావనీరాజు, రాజు రాజ, రాజధనవైభవోద్దాము, రమ్యకేళి. ౧౫౪
వ. అక్కుమారద్వయంబునందు. ౧౫౫
ఆ. అగ్రగణ్యుడైన, యుర్విజానాథుడు, అతులగుణకదంబ, సచ్చమాంబ
నర్థికామధేను, వగునంగమాంబయు, పరిణయంబునొందె, ప్రభుత మెఱయ.
క. శ్రీలలర రామనాథ నృ, పాలుడు శ్రీలలనమునుమను, పగిది వెనయుచున్
లాలించె వేంకమాంబిక, నాలలనం బాపమాంబ, నాపూర్వోక్తిన్. ౧౫౬
క. ఆరామనాథనృపతికి, ఘోరారి నికరప్రభేద, తుకలాక్సలికిన్
ధీరాత్మలు సుతులిద్దరు, నారక తద్వైభవంబు, వర్ణింతుం గరన్. ౧౫౭
సీ. పరరాజు బాహుసి, ధారాపాతంబు, పాతంబు సైరిరా, స్వర్గమునకు
సౌభాగ్య శుభకీర్తి, శోభావి హారంబు, హారంబు దిక్సతి, వారమునకు
సేనాథు ప్రస్థాన, సేనాసు శబ్దంబు, శబ్దంబు సత్పథ, సరణికెపుడు
సేవాహ్య సత్కృపా, భూమహిపానంబు, పానంబు బ్రాహ్మణ, సంఘమునకు
గీ. ననుచు గొనియాడు దురు మాళ, వాంగ వంగ, పాండ్య నేపాళ మగధభూ, పాలసభల
వాసిరెడ్డికులాంబుధి, వనజవైరి, దాశరథినాయనామను, ధీశవరుని. ౧౫౮
క. ఆశ్వ విభుని తమ్ముడు, చేతోజా తాంభక్తి, శీలుడు సుగుణా
వ్రాతాభినుతుండు వినుతిస, నాతనుడు శివ ప్రసాద, నాయకుదలంపన్.
క. కన్నుల విలుగల బలియుని, కన్నంగన్నాకు చెలువు, గన్న కొమరులన్
గన్నకుమారుల బలెఁదన, కన్నులగని తండ్రిమిగుల, కన్నంబొడనై. ౧౬౦
సీ. ప్రథితవిజ్ఞానాంబు, నిధులతో బుధులతో, గవిలోక రవులతో, గవులతోడ
బహుపరాక్రమమహా, నటులతో భటులతో, బహుళార్థబలముతో, జలముతోడ
ధర్మప్రధానసా, ధనముతో ధనముతో, శ్రితపురోహితులతో, హితులతోడ
భరితనీవృత్పరం, పరలతో దారలతో, మాత్రిప్రే మణులతో, మణులతోడ
గీ. నైహికాముష్మికోత్సవా, భ్యహ్యలైన, నందనులునిచ్చలభినవా, నందమొసగ
వేంకటాద్రి క్షితీశుని, శ్వేలపిభవ, మభినుతింపంగ నెసగె దుర్లభస మ్మతిన్

ఉ. అయ్యెడ వేంకటాద్రినను, ధాధిపుఁ డొప్పుట న్మధుసూదనాంశకా
దాయ్యనదేవ సృష్టతయు, నూఁదినిజప్రకృతిప్రథాపుల్కఁ
నెయ్యము దియ్యముం గొలిపి, నిర్మల నైజసితాతపత్రసా
హాయ్యముగాఁగ రాజ్యసుఖ, లాంగిము, గూర్చెను పుత్త్రసాత్కృతిన్. ౧౩౨
క. అంతజగన్నాథమహీ, కాంతుఁడు, సౌందర్యవిజిత, కంతుండగుచుఁ దా
సంతత సామ్రాజ్యధురా, క్రాంతవిభూతాదనర్చె, గరుణానిధియై. ౧౩౩
ఉ. బంధువులుం బ్రధానులును, బాడితమీఱఁ గవుంగఁ బురోహితుల్
బంధురసింధు రాశ్వరథ, పఙ్క్తులు బ్రాజ్యవసుంధ రీపతుల్
గంధిలవృత్తిఁ దన్నలమ, గాధరణిం గొని రామనాథరా
ట్సింధుర వైరియై మెలెనువి, శిష్టజనాళిక భీష్టవైఖరిన్. ౧౩౪
సీ. నలహరిశ్చంద్రాది, నయమప్రతిష్ఠించె, నిడిమొదలాకాలంబు, కృతయుగంబు
జనకరాఘవముఖా, చ్ఛర్యచర్యలనిమించె, త్రేతాయుగస్ఫూర్తి, దివిశకోకాఁ
భరతయుధిష్ఠిర, ప్రభృతి వృత్తము లెచ్చె, ద్వాపరం బభిభూతి, దనరెనొ
కొ
వరపరీక్షిన్ముఖ్య, వర్తనంబులు మీఱె, గలికాల వృత్త్యముల్, గట్టున జెనె
గీ. యనుచు సాదృశ్యమున బుధు, లట్లు యనఁగ, సత్య చిద్ధర్మ మహిమల, సా
టిజెప్ప
బూర్వరాజులె యనఁగన, పూర్వవిభవ, సాంద్రుఁడై యొప్పె వేంకటా, ద్రీ
ద్రి విభుఁడు. ౧౩౫
క. ఇత్తెఱంగున మత్కలితా, విత్తమున బహిష్కరించి, విభుచే మార్కం
డ్రోత్త లగు వృత్తు లొసఁగు మహాత్మరుఁ డక్కాల దాసు, సభి నుతి ధరమే.
వ. ఇత్తెఱంగున ననితరాధిక సంపద్య శోవిజయ విభవాభి వృద్ధులై, వంశం బభివ
ర్ణ్యాలై, ప్రవర్తిల్లుచున్నయది. ౧౩౬
సీ. వెండితో సురరాజు, తుండితో మగరాల బాడితో నెలరాల, పిండితోఁడ
భమ్ముతో సింహాసి, భమ్ముతో నమృతకుంభమ్ముతో రసవిజ్ఞ, భమ్ముతోఁడ
పాలతో నాఁశిము, తాల్యలతోఁ దెలికష్వ, రాలతో బొమ్మతే, జీలతోఁడ.

గీ. సాటిసత్కీర్తి సాధించె, నేటియితని, కోటిసరిగల శేమాత్రి, కోటిగోన
ననఁగ జెలువొంది ప్లొత్తూరి, యన్వయమున రాజనయతంత్రికుశలవ, రామ
మంత్రి. ౧౩౭

సీ. పలుకనేర్పరియుంచు, బలుకుటింతియెకాని, కలనైనసత్యంబు, బలుకనేరం
డొర్పనేర్పరియుంచు, సూహించుటేకాని, యొరులపేదరికంబు, లోర్వలేడు
యివ్వనేర్పరియుంచు, నెంచుటింతియెకాని, యెంతవారికినుసం, బివ్వలేడు
పెట్టనేర్పరియుంచు, పెద్దలంపురుగాని, ప్రియసూక్తిబెడచెవి,బెట్టలేదు
గీ. సత్యవితరణ గాంభీర్య, సరసతలకు, మేటులగువారి లోపల, మేలుబంతి
ఘనుండు పొత్తూరి వంశపావనుడ సుమ్మి, రాజనయతంత్రి కుశలవ, రామ
మంత్రి. ౧౧౯

సీ. ఆర్యానఘాగ చాతుర్య మెంతనిదెల్పి, దనరాజభూషణ, త్వంబెదెలుప
క్రతుభుగర్థ హిరణ్యా, కశిపువర్ధన వృత్తి, జననరసింహావ, ర్తనమెదెలుప
లక్ష్మీకరాంతర్వ్యా, లాసవిస్ఫూర్తులు, దనయసమాయుధ, త్వాబెదెలుప
పటుసుధర్మాసభా, పాలనాత్రిశయమ్ముదనవిబుధాధిప, త్వంబుదెలుప
గీ. శార్వగర్వా సనావతి, చతురవిక్ర మాతపాక్రాంత పరనుము, దాశిహేళి
గాక యొరుడౌనె యనమించె, నేకహేళి, రాజనయతంత్రి గుశలవ, రామ
మంత్రి. ౧౨౦

సీ. మలయధ్వజుండైన, మహిపతి యింటిలో, సుందరేశ్వర మూర్తి, సొంపెలర్ప
మీనాక్షితో నిల్పి, మెలంగు నట్లేకాకు, లాబ్ధిచంద్రుండైన, యట్టిఘనుడు
పుండరీకాక్షుండగా, పురుషుండు జామాత యిల్లాలితోంగూడి, యింటహితము
జక్కదీర్పం దాను, సముపాప్తకాముడై యుగ్రవైభముతో, నెనసియుపని.
గీ. మంత్రి మార్తాండుండై జగ న్మహితవృత్తి, సాటివారలు మెచ్చను, త్సాహ
మొందు
రాజనయతంత్రికుశలవ, రామమంత్రి, సన్నుతింపంగదరమెవా, జ్ఞానికైన.౧౨౧

సీ. అప్పండకీ కాతు డత్యాత సౌందర్య, లావణ్యసౌభాగ్య, లక్షణముల
నంబోధికన్యకా సంభావితాకార, యగుచు జెన్నొందుజి, న్నమ్మియందుం
బుత్రులగాంచెను, భూరిసత్కీర్తుల, సిద్ధురనందులో, బెద్దయైన
వేంకటనెర్రయ్య, విమలచారిత్రుండు, పాత్రుండు సౌభాగ్య, పదవికెపుడు
గీ. చిన్నికొమరుండు సంతత, శ్రీవిలాస, సుభగుండై యొప్పు వేంకట, సుబ్బమంత్రి
వివిధగుణ శాలిసత్కాంతి, విభవహేళి, వారికొని యోడ దరమెయె, వ్రాన
రికైన. ౧౨౨

చ. కుశలవ రామ మంత్రివరు, కోడిగ మేమన వచ్చెఁబండితుల్
దిశలను సంచరింతురసి, త్రిప్పటనొందఁ గనీక నందరన్
వశపడ సేయఁగోరి, గుణ, బద్ధులఁ జేసె గదా! బలారె! త
ద్వశులయి సంఖ్య గల్గియును, వత్తురు సంఖ్యకు మీరివారలున్. ౧౭౩

చ. ఘనఘన సారసంకుమద, గంధిల చందన గంధతైలమ
ర్దనముల లబ్ధవర్ణులయి, రంజిలుటన్ విబుధాళికిన్ సరే,
మునుపు కులాక్ష రస్తుతుల, మూటను రూఢిని యట్టుకొట్టయం
చనిచతు రోక్తి పొత్తుకిడు, లాఘ్యని సౌధములన్ జెలంగెడిన్. ౧౭౪

* షష్ఠ్యంతములు. *

క. ఏవం విధగుణ నిధికిన్, భావాంతర్బద్ధ ధర్మ, పథసేవధికిన్
భావిత శరధి శరధికిన్, గేవలపర మార్గ తత్త్వ, కృత నిర వధికిన్. ౧౭౫

క. శ్రీమందిర నేత్రునకున్, గోమల గాత్రునకు సరస, గుణపాత్రునకున్
సీమాతిగ మిత్రునకు, ద్దామభు జానిర్జితారి, తతి జైత్రునకున్. ౧౭౬

క. ధీరునకుం గవిజనతా, ధారునకున్ యాచకాళి, దైన్యోపహతమ,
స్ఫారునకుం జితచిత్తవి, హారునకున్ మదనసుంద, రాకారునకున్. ౧౭౭

క. గోగోభవ గంధర్వను, ణీగోప్రతి నాదనాత్రి, నిష్ఠాళునకున్,
గోగోవిధు శరవిధుశర, గోగోజయ జాతకీర్తి, గుణ జాలునకున్. ౧౭౮

క. చటుల పరాక్రమ కీలా, పటలప్లుష్టారి పసర, పటుగహ నునకున్
ఘటనా ఘటిన సమర్థో, త్కట మంత్రాంగ ప్రభావ, ధన వహనున కున్.

క. కుశల వచోగీష్పతికిన్, బ్రశమితరిపు తతికి,ధర్మ, పథ సంగతికిన్
శశిధర పూజారతికిన్, గుశలవ రామాఖ్యమంత్రి, కుల సుర పతికిన్. ౧౮౦

వ. అభ్యుదయ సముద యోదయాభి వృద్ధి యగు నట్టిల, నా యొనర్పం బూని
న, సరస హృదయానురంజ నంబను, మహాప్రబంధంబునకుం, గథా ప్రారం
భం బెవ్విధంబునన్ బ్రవర్తిల్లె నంటేని. ౧౮౧

* కథా ప్రారంభము. *

మ. మునులన్నైమిశ కాననంబునఁ జిదా, మోదాను సంధానసా
ధనవిజ్ఞాన సమేతు సూతుఁ గనిచే, తఃప్రీతి నిష్టార్థబో

ధన మాధుర్య కథాసుధల్గొనుచుఁద, త్వద్గోష్ఠులం గాలయా
పనము ల్సేయుచు నెన్నిటం దనివిదీ, ర్పం రామి సానందులై. ౧౮౨

చ. జలరుహ నేత్రనేత్ర యుగ, సంభవులం వరకన్యలం గుహుం
దెలమిఁ బరిగ్రహించుట, మ, హిష్ఠ జనమ్ములఁ గొంత వింటిమ
య్యలఘుఁడు వారిఁ జేకొనుట, యంతయు మాకిపుడాను పూర్విగాఁ
దెలుపుము నీకు సర్వమును, దెల్లము గాదె! జగత్త్రి యంబుచుం. ౧౮౩

వ. అని సాకాంక్షంబుగాఁ బారికాంక్షి జనంబులు తన్నుఁబరి వేష్టించి యడుగఁ
యు,బ్రహ్మం బద్వితీయం బనుటకు నిరవ కాశంబగు తేజో మూర్తియైన సు
బ్రహ్మణ్యేశు చరిత్రంబు ప్రకృత ప్రసంగ పాత్రంబగుటయుం బొంగి యవి
త జగదభ్ర వృత్తకథా జాతుండగు సూతుం డమ్మహా మునులకుం గుహు
డు లీలా భేదంబులఁ దద్విహారం బొనర్చుట సవి మర్శంబుగా విను పింపం
లంచి, యిట్లనియె. ౧౮౪

* శాంతి పురాభి వర్ణనము. *

సీ. శ్రీభారతీ సమా, శ్లేష దీక్షాసిద్ధి, కేపురంబు తిరంపుఁ, గాపురంబు
కమల సంభవమనః, కల్పనా శక్తికి, నేపురం బభిరామ, నూపురంబు
భువన సప్తద్వయా, ద్భుత మణి రాసుల, కేపురం బెడలేని, దాపురంబు
పురుషార్థ వితరణా, భోగయంత్రో ద్భూతి, కేపురం బన వద్య,భూపురంబు

గీ. రజితగిరిచెంత,వసుభూధ,రంబువొంత, మలఁచిరపరంజిచేఁగొంత,మణులఁగొం
ఆదిరసరాజ రాజ్యసిం, హాసనమ్ము, తనరు,నుత్తర దిశశాంతి యను పురంబు

గీ. ధరణిమూలాలవాలంబు,కరణిమెరయ,స్కందగిరి,దానినాళంపు, చందమొం
వేయిజేకుల తమ్మినా, వెలయునమృత, భోగసంధాయకంబైన, పుర వరంబు

క. అప్పురి కప్పుర పనఁటుల, గుప్పున నుప్పతిలువలపు, కుదిరి కలసుమీ!
యిప్పుడమిగ నవతియను, గొప్పగు నెలవయ్యెఁదక్క,గోష్ఠుల నెపుడుం. ౧౮౫

ఉ. ఆపురిసౌధ వీథికల, యందునయారె! యొయారపుం హొయల్
చూపుచు మందమందగతి, సొంపులు నింపుమి టారి కత్తెలం
గోపుర భామినుల్ నిలువఁ, గ్రొమ్మొయిఁగుం గుములంచు నెంచియా
పైపయిఁ దోఁచుట,భ్రమని, పల్కుదు రొక్కొక సారి ముగ్ధలం. ౧౮౬

సీ. భారతీ భార్గవీ, పౌలోమ లేవీటఁ, బేరురచ్చల కెక్కు పేరటాండ్రు
నిగమాగ మామ్నాయ, నిచయంబు లేవీట, నాటీరిన సభా, స్తారకోటి
భైరవా ఘోరాద్రి, పటుమంత్ర దేవత, లేవీటి కోటపై, కోపు రమఁలు

అరవింద సంభవుం, డహరహం బేవేట, నధ్యస్థుఁడయ్యెబ్రి, హ్మాసనమున
గీ. గరుఁడ గంధర్వ యక్షుర,క్షుస్సమూహ,మరవగావ్మాప్ర చండడో, ర్ధాదుదార
పార్షదపాలితంబౌచు, పరిఘపిల్లు, నట్టిశాంతి పురంబుని, త్యానుభూతి. ౧౮౯
శా. వీణావేణు మృదంగ వాదములుప్పు, ద్వ్యోమ మధ్యంబునన్
శ్రేణుల్ గట్టఁగ, దేవయోని గణముల్, జేజే సమర్పించుచున్
మాణిక్యా వరణాంత రాంతరముల్, మంజుక్ర మప్రౌఢిమన్
గాణిక్యమ్ము నటింపఁ జేతు రెపుడున్, స్కందాను కంపార్థులై. ౧౯౦
శా. బ్రహ్మాణ్యాబు చరాచరాత్మకముని, ర్వైరంబు నిర్వ్యాజమున్
బ్రహ్మాదిస్తవ నీయ దివ్య మహిమ, భ్రాజిష్ణు వౌనాదిమ
బ్రహ్మ బీశ్వరుఁ డంగనా తిలకము, బాగూడి యవ్వీటను
బ్రహ్మణ్యార్చితుఁ డైకృపావ శతగా, ర్హస్థ్యంబు రంజించెడిన్. ౧౯౧
క. అన్నగరీఘన ఖురళీ, సన్నుత విద్యాశ్ర మైక, సాహస గుణసం
పన్నగణ సుతులుజగములఁ, గ్రన్ననరక్షింపఁద్రుంపఁ,గలబలసహితుల్. ౧౯౨
సీ. బ్రహ్మాసు లకు నైనఁ, బాద చారమె కాని, వర వాహ నారోహ, గరిమలేదు
అనిలాదు లకునైన, నంతఃపురద్వార, సంచార మిసుమంత, సాగిరాదు
రాజయోగుల కైనఁ, దేజోవ లోకనా, దులఁదద్ర హస్యంబు దోఁచఁబడదు
సనకాదులకు నైన, సామర స్యానద్ద, సభలలో నిలువంగ, శక్తి లేదు
గీ. అచలశివశక్తి నిర్వికా, రానుషంగ, భోగ సామ్రాజ్య వైభవా, భోగపూర్ణ
నిరతిశయసంవిదు జ్జృంభ,నిష్ఠులైన,ప్రమథులకుమన్కి పొగడన, బ్రమ్మదాని.
చ. సరసులు సర్వతోముఖవి, శంకటదివ్యర సైకమాధురీ
భరితములై సదాళిఫల, భావ్యములై సుమనః పరంపరా
స్థిరవిల సత్ప్రభాకరవి, జృంభణ నిత్యవిలాస యోగ్యతన్
సరసులఁ బోలి,యప్పురిని, సంగుస రాజమ రాళలీలలన్. ౧౯౪
సీ. కల్పపాథోరాశి, గడలుగప్పిననాఁడు, కరటిపోఁ కెఱుఁగర, క్కటిక గ్రుహలు
నిత్యసృష్టివిధాన,నియతి ధాతాయథా,పూర్వమన్ శృతికథ,ల్పొసఁగవచట
నణిమాదిసంసిద్ధు, లాబాలవృద్ధంబు, పెరటిచెట్టులఁబోలి, పెరుగునచట
బ్రకృతిలో జగమెల్లఁ, బరిణమించినఁ బరం, ధామమై వెలయున, త్తావలంబు
గీ. హరుసశూలంబు, హరి చక్ర,మైనఁ గాని, మసలఁ గానిని జాజ్వల్య, మానశక్తి
ప్రహరణమ్మయిమెఱయున,ప్పట్టణమున,బురమచర్చిక పొగడంగఁ,దరమెదాని.

సీ. అప్రతీకంబులై, యఖిలదిగ్జయ మివ్వ, గలసుప్రతీకస, తృ్కలగజములు
హరితురంగ పదక్రి, మాస్వాతత్వమె కాక, ఘనకళ్లలతురం, గమ చయంబు
ఏకచక్రవిలాస, మెనయు నర్కశతాంగ, సరణిఁ గెల్చునసంత, చక్రరథము
లతిలోక విక్రమో, ష్యద్బాహువాదిద, ప్రశమితా శాతాప, పటులు భటులు
గీ. గలిగి యప్రాకృతప్రభా, కలితలలిత, నిత్యసౌభాగ్య నిరవద్య, నిర్ణిరోధ
నిరతలీలావిభూతిచే, నివ్వటిల్లు, నగరతల్లజ మలదానిఁ బొగడవశమె. ౯౫
క. వనములు శుకపిక గణజీ, వనములు సిద్ధాశ్రమస్థ, వాచంయమిపా
వనములు ప్రమదాకలితా, వనములు చెలువొందుఁబూప, పాన్తములందున్.

* నాయకాభి వర్ణనము. *

ఉ. అన్నగరీపు రాకృతత, పోతి శయ, ప్రతి పన్న భాగ్యభా
వోన్నతదివ్య మూర్తియయి, యొప్పె సుమాంబకః కోటి రూపసం
పన్నవ నీయ తేజమున, భక్త జనావన శాఖి సత్కృపా
పన్నశరణ్యుఁ డిష్టగణ, బంధుఁడు శక్తిధరుండు నేతయై. ౯౭
ఉ. అన్మహ నీయ మూర్తి కరు, ణామృత నిర్ఝర మాత్రి లోకమై
క్రమ్మి నిశాటఘాట భయ, కంపిత మూర్ఛిత చేత నావళిం
బమ్మెరఁ దీర్చిప్రోవ సుర, పాల ముఖస్తుతి పాత్రుఁ డైప్రమో
దమ్ముల కాలవాలమయి, ధైర్యధురంధరవృత్తిఁ జెల్వొగున్. ౯౮
సీ. ఏమహామహుఁడీశ్వ, రేశ్వరునాజ్ఞచే, బ్రహ్మాండ ములకెల్ల, భర్తయయ్యె
నేదివ్యమూర్తిప్రభ, హేమాదిరాపతులపైఁ, గొంచకయాజ్ఞఁజె, ల్లించుకొనియె
నేభవ్యుఁ డఖిలభ, క్తాభీష్టఫలములు, నించుచో వెనుజూఁడ, నేరఁడయ్యె
నేధీరు విక్రమం, బింద్రాదిక వ్యథా, ధ్వాంతంబునకు బాల, తపనుఁ డయ్యె
గీ. నట్టికల్యాణమూర్తిభ, క్తాంతరంగ, తామరసభృంగమైజగ, త్త్రియముఁబ్రోవ
సిరులనలరారి మెల్లరు, చెడనిపదవి, సిద్ధసంకల్పు లగుచుఁగాం, చిరిశుభంబు.
ఉ. కావర మూను దైత్యతతి, గర్వము డుల్చి మహేశు కోటిలో
నావరణాధి నాథుడయి, యంతటసర్వ పదాధి కారియై
స్థావర జంగ మాంతరభి, సర్పణమున్ మనుజార్థ దిన్యల
క్ష్మీవరదాన కౌశలముఁ, జేకొని యేలెను గాంర ణాల్రయిన్. ౧౦౦
సీ. భారతీముఖదేవ, భామినీకుచతటీ, పాటీరపంకాప్తిఁ, బాయదయ్యె
హారిదంగనామ, నోహర సభామధ్యంబు, లతిలోక సమ్మదో, న్నతి వహించె

భరిత భూసుర మహో, ధ్వర యూప భవ నంబు, లుదు హోమ ధూమంబు,
ధురములయ్యె
సర్వసర్వంసహా, సకలసజ్జనపాళి, యకుతోభయభ్రాంతి, మగుచు నలరె.
గీ. నిరతనిర్వక్ర విక్రమో, న్నిద్రభద్ర, మూర్తిశిఖివాహనునిదయా, స్ఫూర్తి నెల్ల
దితిసుతకృతాపద లడంగి, త్రిభువనంబు, సవాజ సౌఖ్యాను భూతిన,స్వ
హము గనుట. ౨౦౨
వ. మఱియు నమ్మయూర వాహనుండు నిరవధిక యశఃప్రసార మాలతీ కుసు
మ సౌరభ సుగంధి భువనత్రయీం హోమధ్యాన సముద్వేల్ల దనంత కల్యా
ణగుణ పరంపరా పీరున్ని కుంజ పుంజ ఛాయాసుఖిత దితిసుత కృత వ్యథా
గ్రీష్మోష్మ సంతాపిత నిఖిల జగజ్జన జేగీయ మానమహిత మహిమాను భా
వుండును, హృదయార వింద నిష్యందమాన మకరంద ధారాపరి వర్ధిత భ
క్తిరససేచన నీరంధ్రీకృత దేవదేవ దయాలతాని కురుంబ సంభావిత సద్భా
వుండును, అనవరత సిద్ధ విద్యాధర కన్యకాసము పగీయమాన నిజనామాం
కిత ప్రబంధగద్య పద్యావళీ నిరతిశయ మాధురీ సుధాస్వాదన సముల్లా స
సాగర సమవ గాహనప్రమోద మేదుర భక్తజన సమూహా చండ కోదండ
పాండితీ సముద్దండ భుజాబల నిర్వక్ర విక్రమా క్రాంత తారక ముఖ బలవ
దరాతి దురవగాహ వ్యూహుండును, నిసర్గ సర్గపాల వాత్యయ క్రియానిరత
భువనేశ్వర శిక్షాప్రవర్తన దక్షకటాక్ష వీక్షణుండును, నిరంతర నిరంతరాయ
మానతపస్స హన దుస్స హమహర్షి మనోరథ ప్రదాన సంధానిరర్గళ సావ
ధాన మహోల్లాస రక్షణుండును, దశది గంతరా ప్రతిహత గమన కౌతూ
హల నిరంకుశ బలోన్నిద్ర భద్రంకర మయూర వాహనాకుంఠ, సంచరణ
లీలాలోలుండును, సమనుస్యూత శివాద్వైత సంధానావధాన శీలుండును,
శతకోటి మదన సౌందర్య విభ్రాజిత శరీరుండును, దేవాసుర భయంకర కద
న దుర్నివారుండునై యొక్కనాఁ డమందానంద కందళిత హృదయార విం
దుండై యరవిందాస నప్రముఖ నిఖిల బ్రహ్మాండాధి నాథులు సభాకూటం
బులం బిక్కటిల్ల, ఝుణం ఝుణిత మంజీర రావంబులు, మృదంగ ధిమిధిమి
ధ్వానంబులును, కలక్వణిత కంకణా రావంబులు, బెనంగొన సభి కాహ్లాద
పాత్రంబులై యప్సరః పాత్రంబులు నటింప సిద్ధవిద్యా ధరచారణాదులు జ
యజయ శబ్దపూర్వకంబులైన స్తుతిపాఠంబు పఠియింప, సనక సనంద నాది

మునిపుంగవులు ననాది పురుష భావోప న్యాసంబు లొనర్పఁ దుంబురు ప్ర
ముఖగంధర్వవరులు విపంచీ ప్రపంచ చంచన్మధురగీత నాదంబులు సేయ,
నానావిధప్రణిశి ముఖాభి ముఖ సాపత్యమాన నిఖిల కమలజా డ నృత్తా,
లంబులు వీనులఁ జొనుపుచు, నభఁగురంతే జొదుర్ని రీక్ష్యాండము యసర్గాను
ణి గణఖచిత శాతకుంభ స్తంభ విజృంభణ ప్రభాధగద్ధగిత సభాభవనంబు
నందుఁ బేరోలగంబుండి. ౨౦౩

గీ. దేవకాంతా జనంబుదే, దీవ్యమాన, దివ్య మణిమయ దాతనా, ధీనములైన
చామ చామరములు వీవ, సరస, సరస సఖినరులతోఁడ సుభగోష్ఠి, జను
పు కొనుచు. ౨౦౪

సీ. కరుణా కటాక్ష వీక్షణ సుధావారాశి, యాత్మైక శరణుల, యందఁబోరల
జలుల నెన్నెలపాంపు.జినుకు లేనగవుతో, ముఖకాంతి నెలతెక్క, మొలక లెత్త
మురి పెంపు లేఁ బ్రాయమునమేని సునుఁదేట, నలరాజుగుంపును,నవ్వుబుఁజూప
నెమ్మొగిరతిసొంపు, బున్నొలిమ్మగుకల్మిఁ, గొండుకొక్క పురెటుఁ, గుల్కరింపఁ

గీ. గొపమునొంగఁపుఁ బయిసొంపు. గుంపు లీను, చిత్ర సింహాస నమునునా, సీసుత
గుడుఁ, గొలువుఁ దీరిచిక్కూర్చొని, కొమరుసామి, రాజ సముమూర్తిఁ గాను
చాయ, రహిదనహించె. ౨౦౫

గీ. రతసుశేస్తంభ రుచితతి, ధ్వగధగలను, ప్రసుటీకృతస్తుతిపాత గర్జితరవముల
మహిత సామ్రాణి ధూపధూ, మముల మొగుల, సభజగజ్జన నదమునాఁ బ్ర
భఁదలర్చె. ౨౦౬

క. అందు మణీ మయ హారంపుఁ, గందువ నాయకము వెలయు, కరణి సదస్యా
నందకరుఁడొచు మెఱసెన్ , స్కందుండ స్పందవిభవ, కందంబనఁగాన్. ౨౦౭

ఉ. ఆసమయంబు నందుఁ బ్రమ, థావళిచుట్టు జయధ్వ నిఁగ్రమో
ల్లాసముతోడఁ గొల్వఁ గములా హృద యేశ్వరుఁ డాప్త వృత్తిచే
నాసయిడన్డ గజ్జనని, యంబిక తోడఁగు మారవీక్షణో
ద్భాసమ నస్కఁగై శమన, భంజనుఁ డచ్చటికిఁ గృపామతిన్. ౨౦౮

సీ. బాసవాల్గొరలయ, బ్రఁపుఁబొగడ్తలనుకుల్,మన్ను మిన్నొరసి సం,బరములీనఁ
దెరగంటి తెజవలొ, ద్దికవీఁచువింజామ, రమ్ములతెమ్మెరల్, గ్రమ్మి కనఁగఁ
దొలుఁబల్కు గములుహా, పురుదాల్చిముతంత, స్వస్తి సేయుచుఁజయ, స్వ
నములిడఁగ

వీక్షణా మృత పూరము, త్వల్లి వర్య, కేలిచల్లారు మదికోర్కె, తట్టు దీఱు
ము, తమియంతంతకు నగ్గలంబయిన డెం, దుబెల్ల నూటా డెందా
లిమిదూలెక్ బలుకులు లాడనీకమే, లే; ప్రాణనాధుండునా
గమృతంబు ల్జిలికించి కౌఁగిలిడినె, య్యా బాష్ప ముద్దీకనా
మమతల్డీఱునె కోరునే హృదయము, స్సంజీవ నోల్లాసముల్. ౧౧౫
గీ. తెలియఁగలయంత వట్టునేఁదెలిసిమీకు, నెఱుఁగ దెల్పితిఁ బ్రాణేశు, నట్టులైనఁ
నూర్పఁగలరేని యొకకొంతఁనూర్పుదాన; గాడుప పలుకులఁ బనియేమి, సు
దతులార! ౧౧౬
చ. అనిపనిఁబూని, ప్రాణ విభు, నంటిన నంటు దలంపు ముచ్చట
ల్మనకొని బోటి కత్తియల, మఁదర దెన్నుటచేఁ బు నఃపున
ర్జనితమనోభ వానలపి, సాకిశిఖాంతతి భగ్గురన్నన
య్యనుపమ గాత్ర లేఁచి చెలి, యాల్వాను నంటుదు నాగినట్లుగన్. ౧౧౭
చ. నిలువక యేగి యొక్క నలి, నీనుము మంద మరందపూరము
ల్జలువలు జల్లు కప్పురము, సార రసాల దళీపుటమ్ములన్
గలిపిక రాగ్ర సీమనిశి, కందొవలప్ద శవిజ్మఖమ్ములన్
గలయగఁ జాదు నచ్చెలువఁ, గన్గొని బోటులు తాపతప్తలై. ౧౧౮
చ. అడుగడు గుంగడల్పక వ, యస్యలు వేచని కేలునట్టిపా
ఝడియకు తల్లి! సాహసము, సైపుము ౯ట్టని సేతలేటికి
యెడనెడ తీనికూర్మి మరు, లెత్తివిభుండెటులయ్యె నొక్కపో
నిడునె మరుంకు పుష్పశరవృష్టుల ముంచఁడె నిన్నుఁజూచుటన్. ౧౧౯
సీ. అపరంజిబొమ్మనీ, కటులేల సర్వజ్ఞుఁ, డఖిలలో కేశ్వరుం డచ్యుతుండు
నీకోర్కెఁగననోపు. నిజమింకఁ దలఁకకు, శశిశేఖ రాత్మజు, వసునిఁజేయు,
నలని కిల్లాలవై, యఖిలంబు నేలుదు, వదిగాక బర్హివా, హనుని యెడల
ననురాగ నుగ్గలంబగుసీశ్వరునకున, క్కామపుండు తమిఁగీలు,కొనుటదెలియు
గీ.హారహారలు వియ్యమందుదు,రబ్బురంపు వేఁడుకజగత్త్రియమ్మున, నెలయుగాన
వెఱువ నేఁటికిఁదల్లి!నీ,విభనమెల్ల; గన్నులారంగఁ జూడఁగాఁ గంటిమమ్మ.
క. బాలా! నీకేటికి నిటు; చాలం జాలింద పిపసము కూరె సుఖం
జేలాయలమట లెమ్మును, బాలాపము వీనులాను, మమ్మా! యనిరన్.
మ. అకటా!ఁదీరాఁ కొనువారికి రుచియు, తాన్నాది షాసంగన్మృతిన్
ప్రకటోత్సాహ ముతేసియట్లు ప్రియుఁడిఁ బల్కాడుఁ కేవెన్నెనన
య్యాకె బంకానన నగ్గనన్న దనఁ శ్రైఁరాంతి సద్గై కను

తుక కత్యంత మనోభవ వ్యథనము, దూబ్బతోన్నతిఁ గాంచిరన్ ౧౩౧
ఉ. కన్నుల నీరు కాల్వలయి, క్రమ్మఁగ నమ్మగ రానివారలీ
యన్నులు కన్నులాన వల, పారడిఁ బుచ్చితి నేమి సేతు? నే
నెన్నఁడుజూడఁ గందునొకొ, నింపుగఁ గాంతుని మోమువన్నియం
చన్నలి నాత్మి చాల వెత, కగ్గలమయ్యె విషాద వేదనన్ ౧౩౨
గీ. అంతఁదహాతహాతో బోటు, లలమికొనుచు, నూరడించుచుఁ గేల్దమ్మి, నూత నునిచి
సిద్ధపుం జెక్కుటద్దము, ల్నిమిరిచాల, బుజ్జగించియుఁ దమిమించి, పొరలిపార.
చ. తమతమ నేర్పు లేర్పఱచి, తామర రేకున రక్తిఁ గూర్చిఘుం
ఘుమఘుమవాసన, ల్గురియు గొజ్జగినీటఁ గురంగనాభిచొ
క్కముఘటియించి రంగులని, గారముతోఁ గొనఁ గోటఁ జెల్వవిం
దుమదముతోడ వ్రాసితగ, టుంబనిఁ గ్రొంజగినిల్పి రూర్పునన్. ౧౩౪
గీ. చిత్తరువు వింతఁజిగిఁ గొల్పి, చిత్తవృత్తి, వలఁపుఁ దమిఁగొన్న భావంబు, వల నుకొల్పి
నెమ్మనమ్ములఁ దద్భావ, ముమ్మలింప, భావశుద్ధి మొనర్చియ, ప్పటముఁ దెచ్చి.
చ. కిలకిలలాడుచున్ పడాయలు, గీల్కొనముందర నిల్పనంతలో
నులికిపడియుఁ గనుంగొనిప, యోజకరంబులఁ గంకణధ్వనుల్
కలితపదాంగద ధ్వనులు, ఘల్లున మ్రోయఁగ వేగ లేచియ
చ్చెలువలు మాటునన్నిలువఁ, జేడెలు గొల్లున నవ్వియంతటన్. ౧౩౫
గీ. ఇట్టిపసిగోలకీ వెఱ్ఱి, యెట్టులనుచు, నంబుజాక్షికి నెదురై ప, టమ్ముఁ జూపి
ప్రియుని యాకృతిగాని త, త్ప్రియుఁడుగాఁడు, నీకటాక్షాంచలం బిందు నెఱపు మమ్మ. ౧౩౬
చ. అనిమదినమ్మఁ బల్కసహృ, దంతరదంతుర మోహవల్లికా
వినమిత దృష్టి పల్లవములు, వెన్కకుఁ జేగుచు ముందుద్రొక్కుచున్
బెనఁగుచుఁ జుట్లు గొంచువల, పించుచుఁ గొంకుచుఁ గోరఁ జూచుచున్
గునియుచు గుంపులై యలమెఁ, గొక్కప్రియాకృతిపైఁ దటాలునన్. ౧౩౭
క. బోటికి మువ్వాఁటికి సల, నాఁటిప్రియాలోకనమ్ము, నాఁటిన తమిము
న్నీటిక్రియఁ బొరలసుమశర, కోటికి నగ్గమయి కూర్మి, కొనసాగంగన్. ౧౩౮
ఉ. చన్నుల నొత్తి యొత్తిమ, నసారఁగ మోమునఁ జేర్చి చేర్చి పే
గన్నుల సద్దిసద్దిమెదఁ, గ్రమ్మఁగఁ గౌఁగిట నుంచియుంచియా
యన్నులమిన్న పెన్నొసట, సంబుజగర్భుఁడు వ్రాసినవ్రాఁత బో

నన్నని మ్రొక్కి మ్రొక్కి కల, నావినివేశిత చిత్తవృత్తియై ౧౩౦
సీ. అందంపుజిగిఁ దేరు, వంగారుమందాసు నాననపద్మభలమే, లరసి యరసి
అరుణాబ్జములఁ గేరు, తరుణారుణచ్ఛాయఁ జరణాంబులనుదక్కి, జగిపిజరపి
తళుకుమించులఁ దళ, త్తళలీనునఖకాంతు కన్నుఁ సోఁగలవింతఁ గాంచికాంచి
పొంగారుబంగారు, రంగుశృంగారాంగు మేనిసిగ్గులుఁ జూచి, మెచ్చిమెచ్చి
గీ. అతివతత్సాంద్రభావిత, మైనయట్లు చెలువుప్రతికృతినక్కుపైఁ, జేర్చిచేర్చి
చిత్రలిఖితాకృతిఁ వహించి, చేష్టఁదక్కి యెటుకమఁటపులు లేసియు, భీష్ట మొందె.
క. కరములనప్పతి ప్రతికృతిఁ, గరమనురాగమొగినూనఁ, గలుఁగుట సతికిఁ
వరునికరగ్రహణముబలె, నిరతిశయానన్దసౌఖ్య, నీరధిఁ దేల్చెన్. ౧౩౨
చ. తొలఁగఁగఁ జూచుఁ సిగ్గుదమిఁ, దొట్రిలమై యరహించు సైపలే
కలయుచు నోరఁ జూచుఁ బలుకాఁడివిదేమి; పరాకటంచునో
త్తిలిపలికించ జూచుసుద,తీమణితథ్యము కాతలంచియ
చ్చెలువుని చిత్రరూపుఁ గని, చిత్తజవేదన కోపనైపకన్. ౧౩౩
మ. నిలువెల్లందనివోవఁ జూఁచిమిగుల, న్నెమ్మోము నమ్మోహనం
వలనోచూచ్చిన దృగంతసంతత సమూ, వల్గత్పరాయత్తతా
కులహృద్భావన సూచనప్రకటసం, కోచస్ఫురద్దైన్యమున్
లలనారత్నము నాత్మహేతుకముగా, లాలించి తానిట్లనున్. ౧౩౪
ఉ. ఎందుకు సందియంబు రమి, యింపుమనింపుము కూర్మినీకున
స్పందమనో రథంబనయు, పాల్పడితిన్దయ సేయరాదె? యీ
పొందపుఁ గొందలంబుఁ బ్రకటించుచునున్నది మోముదమ్మియే
మందదయాపయోధి! తగునా? వశవర్తిని యియ్యపేక్షకున్. ౧౩౫
క. ఇవ్విధమున నాజవ్వని, నవ్వముదపుకొత్తఁ జిత్త, మహితుహితునిపై
నెవ్వగల నొవ్వనవ్వల నవ్వలపుల నమృతవల్లి, యవ్వలిలోనన్. ౧౩౬

* అమృతవల్లీ విరహము. *

లయగ్రాహి. అమ్మహితునమ్మునెడ, ముమ్మరపు బమ్మెరలు
గ్రమ్మి చెలు వమ్మెదలి, యుమ్మలికమించన్
తమ్మివిరిగుమ్ములను, ఘుమ్మనును తెమ్మెరల
కమ్మద నముస్నెదలు, తుమ్మెదల యిమ్ములో
సొమ్మసిల గ్రమ్మఁగను, కమ్ములు పికమ్ములర
కమ్మలయు కస్మికల, డస్సి కన్నుల కోలన్

మ. తెలిదుఁ బ్రహ్మ లసకలార్థ వేత్తలని వే, దంబుల్వచించుంగదా?
తలపోయం దద్వగ ధీనసాధనను న, ర్థం బేల భావించరో?
తెలియం బోలునటైన వల్లభ! నినుం, దేరాదె? మజ్జీవనా
కులతద్దీరు పరాదె? యేలపలువా, క్కుల్, కర్మభోగ్యంబగుల్. ౮౪౫
క. నాసిజనకులు హరిహరు, లీనర్మిం గననివార, లేటికి నీకసం
ధానముఁ జేసి గుహాశయు మానిష్క శ మద్వితీయు, ననుసంధితుల్. ౮౪౬
చ. అనుదు ననంత భావనము, లాతలఁ బుల్దలపోసి యెవ్వియున్
మనమునఁ బెట్టకార్తి మెయి, మగ్నత బాహ్యము ఖేంద్రియస్పృహా
వినమిత వృత్తిసాంతరని, విష్టచిదాసన సంస్థఁజేసినా
ధునిఁ గవఁగూడి మేన్మఱచి, తో యరుహాసన పూర్ణభావమై. ౮౪౭
చ. అనుపమ మాత్మ వేద్యము సు, ఖానుభవ ప్రతిపన్న మన్యవే
దనరహితంబు నిశ్చలని, ధానవిధేయము నిత్యభోగ్యము
భ్యనుదిత భేదభావము గు, హాశ్రయమా ప్రమదమ్ము నొంది భో
ననపరి శుద్ధిఁజెంది యని, వారణ పారణ యాన యున్నెడన్. ౮౪౮
చ. పగచుచు బోటు లేమమృత, పల్లియొకా నుక సారిమై నమే
సొగయదు పల్కరింపదువి, నోదముఁ జూడదు ఛిల్కకైన మా
టఁగటపఁ బోదు పాటకును, డంబట చెట్టి ప్రచార మొకొ? వీం
తగమదిఁ దోఁచు చున్నయది, తథ్యము సత్వర మారయందగున్. ౮౪౯
శా. రారమ్మా చెలులార! చూడుఁడిదె నే, రం బేమియున్ లేదు దు
ర్వారక్రోధళ నంబు మోమునఁ బరీ, రంభించుట ట్రోఁచెనె
ల్లారుం గూడు దటంచుఁ జేరఁ జనుచున్, లావిరిచు చుస్దీనవా
ధారంభంబున వేడుచున్ మనసు మె, చ్చన్గీతి ముల్వాఁడుచున్. ౮౫౦
సీ. ఓసమ్మ నీమాఁట, కడుగు దాటక యహర్నిశము నీవారమై, సిలువ లేదె,
శిరసావహించినీ, చెప్పిన పనులలో విసుసక నిల్చి మెప్పించలేదె,
మంతనమ్ముల నీవో, కింతఁ దెల్పిన గుట్టు బయలుగా నీకడా, పంగలేదె,
ఆఁట పాటఁల జాల, ననుకూల వృత్తి చే జనవొంది కాలంబుఁ, జరుపలేదె
తే. గీ.. లేమ! మారెడనపరాధ, మేమి లేదునీదు చిత్తమ్ము నాస్వవశమ్ము, గాదు మాకు
మనవిపినుల నానిలో, క్షమతనూని తెంపుగడకొత్తి మమునాద, రింపవమ్మ.

శా. పంచప్రాణము లీనకాని యతిసం, భావించి వాక్కాయహృ
త్సంచారమ్ములు నీయధీనములుగా, సర్వాను షంగంబులం
గించిత్తుం దొలఁగింగఁ జాలకసదాం, గీకారభావంబురా
ణించం గోల్పిన మాయెడం జిగురుబోణీ! యీసు నీకేటికిన్. ౧౩

ఉ. ఎన్నఁడు నీదు నెమ్మొగము, హేతుగుణాయతి నొందదేమొకో?
కన్నడమైన నోపమిఁకఁ, గన్గొనలెత్తి కటాక్షవీక్షనా
భ్యున్నతిఁ జూపుమింతటన, పూర్వము దంబానఁ గూర్పఁ జూడుమా
చెన్ని విధంబులన్ జెలియ, లెల్లరు వేఁడిన నించుకేనియున్. ౧౪

క. కన్నెత్తి చూచి మోమునఁ జిన్ని నగవుదొలకఁ బలికె, నేమమరసితాఁ
గన్నులు చల్లఁగ నన్నుల మిన్న యొకింతైనఁ గనక, మిన్నకయున్నన్. ౧౫

చ. వెలవెలఁ బారుమోములను, వేమరు గన్నుల నీరుగాల్వలై
వెలువడ నల్దెసల్గనుచు, వేదురు వట్టిన భంగి నెచ్చెలుల్
తెలియక తత్తరించు చును, దీనతఁ జేతుల నంటు చున్భయా
కులమతి విహ్వలించుచును, గొందల మందుచు నున్నయంతలోన్. ౧౬

—* కలకంఠీ కలానైపుణ్యము. *—

చ. చతుర కళార హాస్యములఁ, జారువ చోరచ నాచమత్కృతిన్
సతతపరేంగి తజ్ఞతల, సారక విత్వర సానవద్య హృ
ద్యతల గుణక్రియాను కృత, దాత్యములన్ నడిసన్న బోటియొ
క్కతె కలకంఠినా చెలులఁ, గాంచి కరాంగుళి సన్నఁ గొల్పుచున్. ౧౭

చ. బెదరకుఁ డింతులార! పల, వింతురె యింతటిలోన మీదటి
త్తెద గణియింపలేరు మన, కేటి యువజ్ఞలు ప్రాణమానముల్
సుదతివె కాచరింతు మిటు, జూఁడుఁడు బోటితలంపు వేఱునా
మది వివరించి యంటె నను, మానము లేదువినుండు తెల్పెదన్. ౧౮

మ. అలరాజు న్నలరాజునిర్వురును జో, డైయీడుగా రాని ని
స్తుల సౌన్దర్య ధురంధరుండు గుహుఁడ, స్తోకప్రభాశాలి యు
జ్జల జాతాక్షుని చెంతనొక్కెడ సభా, స్థానంబు నందుండ నీ
. . . . . బోణి గనుంగొనన్ హృదయ బద్ధంబైన వాల్జూపునన్. ౧౯

తే. గీ. చూచి నప్పుడె మది . . . . సుదతి . . . .

కఱఁగె నెఱ పొంత వెన్నగాఁ, గఱుఁగ కేల
యుండు నమ్మూర్తిఁ గనునట్టి, యువతులకును
తత్క్షణంబున సాత్త్వికో దయముగాదె? ౧౫౯

చ. అదిమొదలీ వెలంది హృద, యంబుర యంబున కాలవాలమై
యొదవిన మన్మథానలపు టోజగణింపఁ దరంబె? యంతయై
యుదిమొదలంత కాంతయయి, యావల నావలఁ గొండ యంతయై
యొదిగె వశమ్ముగా దొరల, కేర్పడ నార్ప గుహుండు దక్కఁగన్.

తే. నాఁటి మరులద్రి మథనుపై, నాఁటియున్న
దేటి మాఁటలు తమకంపుఁ, జెలివికిలిని
యగ్గలంబైన తమిఁ బొక్కె, యాత్మనాథు
పైని గీల్కొల్పి నవనవా, వస్థనొందె. ౧౬౦

చ. చలువలు జల్లు జాఁడివిడి, శయ్యపయిం బవళించి కన్నులన్
జలజల రాలుసిరు జల, జాతజలమ్ముల పేరమార్పుచున్
జెలువుని హావభావగుణ, చేష్టలపై మరులొంది యెద్దియున్
దెలియక బారవశ్యమునఁ, దీక్ష్ణమై చెలియున్న యంతటన్. ౧౬౧

క. మనసీని వేళయని నీమనసునఁ దలపోసి చెంత, మార్మసలుచు నె
య్యాన నీవల నావల గాఁజనుచుం వచ్చునను దిరుగు, సమయము నందున్.

తే. కొంతసే పొచ్చినను జూచి, కొమ్మనమ్మ
నమ్ముదిటఁగొల్పి కనుసన్న, నన్నుఁ బిల్చి
నాడు చనుమిట్ట లూఁతఁగాఁ, గ్రోడికొనుచు
మేనుఁ జేఁచి తెమ్మికొక్కి, లోన నణఁచి. ౧౬౨

మ. కలకంఠీ! కనుగొంటె? మాలతి యుపష్మ వ్యాప్తికిం జెంగరం
జిలు నుద్యత్సహకారవేల్లనము వాంఛింపఁగఁ బోలట్లు సం
చలదామంద మరుత్కిశోరకలనన్, జవ్వాడుచున్ మాటికిన్
బొలయం జేరువఁ దూఁగుచున్న యది యొ, క్కో వింత గన్గొంటివే. ౧౬౩

మ. అనుచుం బల్కినఁ బ్రస్తుతోక్తి మదిలో, సప్రస్తుతవ్యాజనో
పనతమ్మై శశిశేఖరాత్మజునిపై, భావంబు నాటించదే
యనవాల్ నన్మాన వాంఛ ముట్లు ఫలితం, బౌనంచుఁ బాఁగోరెఁగా

యని వాక్యార్థము నిర్ణయించెనట న్యాయ్యం బగ్గలం బౌటచేఁ. ౧౩

తే. గీ. చేడెఁ గౌఁగిలించి, చెక్కిలి ముద్దాడి భావశుద్ధిఁ గనుము, పన్యసించి
యింగితంబుఁ దెలియు, నిచ్చఁ గొల్పి యొకింత ముచ్చటింప నాదు, మోము
జూచి. ౧౪

చ. మదవతిరో! రసాలఫల, మాధురి వాచవిఁ గొంచు నింతికిం
పొదవఁగ సంది యిచ్చుచుఁ బ్రమోద ఝషల్ ముకుబంటి గాగమైఁ
బొదలుచు మోము మోములమి, పుక్కిటఁ జక్కెర మెక్కఁ జేయుచున్
వదలని కూరు ముల్నెలపు, వైఖరిఁ గీరము నందుఁ గంటివే?. ౧౫

ఉ. నావిని యుల్ల సన్మిలలనా! భవదీయ వచోవిలాస సం
భావన మావహించెనిదె, వల్లభుతోఁ గవఁ గూడి పూర్ణ పుం
భావవిహారము ల్సలుపు, భాగ్యముఁ జేకొనఁ గోరుసర్థమా
గావనజాక్షి! యెవ్వనికిఁ, గల్గునొ తావకదృక్సు మార్చనల్. ౧౬

క. మన్ననకుఁ బ్రథమ పాత్రము గన్నను మన్నింతుఁ గాన, గడఁద్రోయక నీ
కన్నుల యాన భవద్దయ కున్నెలవయి మనము, గల్తుఁగొను ఘనుఁడెవఁడో

కో. కామిని యమృత ధారా సారము వీనులకుఁ దొరఁగ, చానరో! కరుణా
పూరితమనమునఁ దెలుపం గారాదేనేఁటి చెలిమి, కత్తైన యనన్. ౧౭

చ. కలిమిమ యూరముల్ల యదె? కంటివె? చిత్రచి రత్నరత్నసం
కలితఖలీన పల్యయన, ఘట్టిత మానొక కత్తులాని సాం
పొలయుచు నున్నదీ చెలువ, మూహమొనర్పు మదీయ జగత్త్రయా
లలితుఁడు నాయకాగ్రణికి, లాలన కుందగు నాతఁడెవ్వఁడో. ౧౮

చ. అనుమధు రాధరాధరసు, ధానుకథంబగు పల్కు చెక్కనల్
దొనకిన నామదిం దోలుతఁ, దోఁచినయట్ల వచించెఁగాన ని
వ్వనిత మనంబులోఁ గొనిన, వాఁడగు నిక్కము బహ్వాధోరణుం
డని మది నిశ్చయించి విన, యమ్మున నిట్లను విన్నవించితిన్. ౧౯

ఉ. చిత్తరి నీతలంపు దగుఁ, జెంపొనరించు నతండు నీకుమే
నత్తకుమారుఁడీ ఘటన, మూర్యులు మెత్తురు మట్టువారిఁనీ
చిత్తము జాలికిన్ నశమ్ము, సేయుకు నీతలిదండ్రులుం ద్వదా
యత్తులటంచు మర్దించిల, న్నాప్రియోక్తుల భాగ్యవృద్ధినిన్. ౨౦

క. అదిగావున నిమ్మదవతి, మదినొడఁ దనగుణముని మీఁదిఁ, మోహపత్రాదిదోషా
స్పదమై యనుశయ భరమెదఁ గదురుట ఋమ్మరపు మోహ, కలనంబనినన్.
మ. నపలాలా జనరాలి మాలిమిదురం, తానంత చింతాభరం
బవరోధింపఁగఁ దత్తరింపుచుఁ గటా! అయ్యయ్యో? యింతేల? న
మ్మ! విచారమ్ము దిటమ్ము సేయుమదిఁబ, ల్మాటల్లు నీజాలిచే
బవలున్ రేలుఁ గృశించకమ్మ! యనుచుం, బైపైఁ గుముల్గూడుచున్. ౧౭౩

—* చెలికత్తె లమృతవల్లికి శైత్యోపచారములు సేయుట. *—

సీ. గొజ్జంగి మంచుతోఁ, గూర్చిన కలశంబు నెమ్మేననలఁదెఁ గస్నియ యొకర్తు,
కపురంపు ధూళిఁ జొక్కముగ ఘుమ్మని వాసనలుఁ గమ్మ, జల్లె నాతియొకర్తు
పటివేళ్ల సురటి మవ్వముగఁ గెల్లవనూని కొసరి చల్లగ నంట, విసరెనొకర్తు,
తమ్మికాడలు మేన, దళముగాఁ గొమ్మావి చివురులతోఁ గూర్చి, జెటివెయొకర్తు
తే. గీ. చలువ జాజులు పటువు బిల్లలుగు దిర్చి
యడుగు దమ్ముల నద్దెన, య్యొడ నొకర్తు,
విరహ సంతాప భరమున, వేగునమృత
వల్లి వెతఁ దీర్పఁ బూబోఁడు, లెల్లఁ గగిసి. ౧౭౪
ఉ. ఎవ్వరితోఁడఁ దెల్పుదమిఁ, కెవ్వరి తోడుణ మందలింత మిం
దెవ్వరు మందె ఋగుదురొ? యెవ్వరి వేఁడుద మేమిసేతుమో?
జవ్వనులార! యెంతకని, సైపుద మేగతి నెందు జొత్తమో?
యెవ్విధిఁ గల్గునేమనఁగ, నెద్ది యుపాయము తేర్పనెట్లొకో? ౧౭౫
క. మనకిత్తఱిదగు చైదము, లను వెతఁ గ్రి మెఱుఁగ సేయు, నట్టివయస్యల్
గననాదురె కన్నులు దెప్పని గోలకు నింతయెడను, ప్రాపించుటయే. ౧౭౬
సీ. వీణఁ బాటకు మేళ, వింతమే మదిరక్తిఁ, దొలఁగి చల్లగ శ్రుతుల్ గలుపునేమొ
సరసమోహన శాస్త్ర, సరణిఁ జప్పితమే సిద్ధాంతమే మైనఁ, జేయునేమొ
చతుర సాహిత్య ప్రసంగములే సేతమే వ్యాంజనాదుల రూఢిఁ, పఱచునేమొ
చెలఁగి బొమ్మలపెండ్లి, సేయనూహింతమే తీర్పఁ బెద్దఱికమ్ముఁ, దెల్పునేమొ
తే. గీ. విరులు గోయంగఁ జనుదుమే, వేగముందు
నీరములు దూరితాఁ గోయు, నేగునేమొ
అక్కటు నభ్యాళి వశమున, నైనసువతిఁ

దేర్పితొల్లిటి పనులెల్లఁ, దెలిపి చెలులు. ౧౬౭

క. కన్నులు దోవలం గ్రమ్మఁగఁ, జన్నులఁ బూఁగుత్తులలమి, చల్లని కపురం
బన్నవలా చెక్కులనిడి కన్నెలు సంబంధి సఖ్య, గరిమము జూపన్. ౧౬౮

క. విడరాని చుట్టముల గని, యెడతీవని పారవశ్య, మెనసిన గతియా
పడఁతుకలిసి నుపచారము, లుడుగనిమది మమతఁ బెనిచె, నువిదకుమిగులన్.

చ. సతులుపచార ముల్మిగుల, సల్పియు నించుక యేనిబోటికిన్
వెతననఁగించి తెప్పరిల్లి, వేఁగురుమానఁగఁ జేయలేమినా
తతహృదయవ్య, థంగలఁగి తుందరఁ జిందరఁ వందరాచునే
గతిఁగన రామినెమ్మదిని, గాఢవిచారము నొందుచుండఁగన్. ౧౬౯

చ. కలఁగకుఁడింతులార! యొక, కార్యముఁ జెల్పెదఁ బ్రాణనాథుపై
వలపున బాహ్యమున్మఱచి, వర్తిలుఁగావ మయూర ధోరణిం
దలఁచిత దీయ సత్కథలు, దారత సన్నిధి నుగ్గడించినన్
గలదొక వింత చూడుఁడిదె, కందెరచున్ మనలన్ గనుం గొనన్. ౧౭౦

తే. గీ. ఇదియె కార్యంబుగాని యిం, కేదిలేదు విప్రలంభంబునొందునీ, వెలదుకలకు
గుహుసవృత్తమ్ముమనమువా, క్రువ్వవలయుఁగార్యమీడేరుననికల, కంఠివలుక,

సీ. వనితయొక్కతె బర్హి, వాహనుసౌన్దర్యమభినుతించె జగత్త్ర, యాప్మతముగ
మగువ యొక్కతె సర్వ, మంగళానందను శౌర్యంబు జగదేక, ధుర్యమనియె
కొమ్మయొర్తుహిరణ్య, కుండలుచాతుర్యమతిచతురాననం, బనుచుఁబొగడె
పల్లవాధరి యొర్తు, బర్హిగర్భుని భుజా బలము లోకావన, ప్రకటమనియె

తే. గీ. చానయొక్కతె గుహునిరైమె, శ్వర్యధుర్య
వినయ గాంభీర్యములు విశ్వ, విదితములుగ
సన్నుతించెను విజయధ్వ, జంబనంగ
నంతఁగల కంతి యును నిట్లు, లనియె నపుడు.

సీ. వలిఘుల కట్టి చౌవంచ మొగ్గముల వేల్పు నానతి యిచ్చోటి, కరుగుదెంచి
కలిమిపుత్రుఁబోఁడితో, వలమురి ధాల్పుతో ముచ్చటిఁపుత్తలంపు, ముదివవృ
జనపుత్తో సమ్మృత వల్లిని దేవపల్లినిఁ గోడుండ్రఁగాఁ గోరి, కొనునటంచు
వింటిమి కోర్కెఁ జే, కొంటిమి తొలిమేలు గంటిమి యువ్వాలు, గంటి మొ

తే. గీ. వచ్చునట రాయబారంబు, వచ్చునంత

శౌరి కూఁతుం డ్రనిచ్చుని, స్సంశయమ్ము
వలపు ఫలియించె దైవంబు, తలఁపు మించె
నింత భాగ్యంబు వలదె యిల్లెందుఁ గలదె ౧౮౩
ఉ. ముద్దియలార! సర్వజన, మోహనుఁడైన శిఖధ్వజుండు వీ
రిద్దఱఁ జూచి చాలమఱు, లెత్తి భరంపడి నాఁడటంచు ను
ద్యద్దయులై శివాశివుల, సారముదంబునఁ బెండ్లి సేతురీ
యొద్దిక పూర్వసంచిత ఫ, లోదయ మాపద చెప్పనేటికిన్. ౧౮౪
తే. గీ: అన్నిప్రసంగ వశంబున, వాళులెల్ల, బర్హివాహను వృత్తము, ల్బలుకువేళ
నంతిపురమున శ్రీ శ్రీవ, రాంతికమున జరుగువృత్తమ్ము గలకంఠి, జరుపుకతన.
ఉ. వీనులఁ బ్రాణనల్లభుని, వృత్తము సోఁకిన మాత్రఁ బ్రాణముల్
లేనిమొడల్సు ధారసవి, లేపమునన్ జలియించి నట్లు నె
మ్మేను గదల్చుచున్ మఱియు, మిక్కిలి యైన వెతన్ దలంపులో
నూనుచుఁ గన్ను లెత్తి సను, యోచిత మాతమి నోరఁజూచుచున్. ౧౮౫
ఉ. సద్దుర లేఁచినట్లు మది, నిండిన మోహభరమ్ము వెల్లునన్
బెద్దయుఁ బ్రొద్దు దల్పమునఁ, బిట్టుగఁ బొర్లుచు నావులించుచున్
గద్దరి పోఁడిగావున ర, కమ్మగు నవ్వలవంత గుట్టు మే
నొద్దికఁ గప్పుచున్ జెలుల, నూడిఁగఁ బున్నమ గత్తరించుచున్. ౧౮౬
చ. మసలుట గాంచి బాలతన, మన్ననఁ గన్నది గానఁ జెంతకున్
వెసఁగల కంతిఁ జేరినను, వింతగఁ జూచెద వేమనందు నీ
రసమున నేను బాత్రమనె, రక్తికి గాకటంచు మించిబ
ల్పసదుల కింపసిట్లనుచు, బల్కె మనోజ్ఞ కథా చమత్కృతిన్. ౧౮౭
చ. మదిమరు లేనుగంటి నిఁక, మాఁటలతోఁ బనియేమి? యన్నియుం
బదిల పఱుం దిటంబుగొని, భావము పల్లటిలంగ నీకునో
మృదవతి! తాల్మిఁదూలిన శ్ర, మంబగుగాని మఱేమి లేదు మే
లొదవెడు నెల్లి తేపటమ, దూర్జితమానుడి పిన్నపీనుల్లన్. ౧౮౮
మ. జగముల్మెచ్చ మహా మహుల్హారిహరు, ల్సంబంధులై వియ్యమం
దఁగనూహించిరి గాన నిట్టి పనికిన్, దన్వంగి! చింతిల్ల నే
మగుఁ? సోఁ కోర్చుమునీతలంపిదియనీ, కైప్రాణ నాథుండు దా

వి: క్షైన్యత నెంతగున్? స్సెన? తడా, వేశంబు జితింపుమీ. ౧౯౦
క. మన్నించి భావమొకపరి కన్నియ! తెలిపితివిఁ గానఁ గడుఁ బెగడకనే
నన్నియు నెఱిఁగించితి నాకన్నను హితపరులు లేరు కన్నా! యనినన్. ౧౯౧
చ. తెలతెల వోవు మోముపయిఁ, దెల్వి ఘటించిల తొంగి పల్కెనో
నెలతుక! నీవు పల్కినుడి, నిక్కువమైనను కాంతసత్కృతుల్
జ్వలితద వంబులట్ల మది, సర్వము నీరొనరించె నేక్రియం
దలఁచక యుందు నెట్లు తల్లిదండ్రుల చిత్తములు న్గరంగెడిన్. ౧౯౨
క. కలికీ! నామది లోపలి వలవంత యటుండనిమ్ము, వల్లభుఁడొంతే
నలమటఁ బడినను నీనుడి ములికిగ నుల్లమున వెతల మునుగం జేసెన్. ౧౯౩
చ. నెలతరో! నీకుసాటి యగు, నెచ్చెలు లెవ్వరు లేరు నామదిం
గలయది దెల్ప కుందునది, గల్గదు గావున బోధఁగొల్పితిన్
దలఁపు ఘటించు కార్యగతిఁ, దత్పరవృత్తిఁ ద్వదీయ భావసం
కలనములోని దంచు నిఁక, గట్టిగఁ బట్టెద వేయు నేటికిన్. ౧౯౪
ఉ. నావిని సంతసించి లల, నా! వినుమొక్కఁడు దెల్పుదాననీ
భావము వోలెఁ గేకిహయు, బాయక చిత్తము దేవవల్లికిన్
గేవల కంతు వేదనలఁ, గీల్కొని కోల్కొనఁ జాలదింతకున్
భావిఫలంబు నిక్కముప, పన్నతఁ గాంచెడు మీకు నావుడున్. ౧౯౫
తే. గీ. ఉల్లములు కంగ లేఁచి తా, నొయ్య నొయ్య
నమృతవల్లి వధూటితో, ననియె బోటి
మెల్లిదంబయ్యె సౌందర్య, వల్లి కేమి?
వలఁపుఁ దమిమెంత చోద్యమీ, పలుకు వినఁగ. ౧౯౬
క. పసిబాల యిట్టి జోలిన్ మసలుట వింతయ్యె నట్టి, మతకము గనఁగా
నసమాన నాయకుఁడు గుహురసిక తఁదా నెల్లెటింగె, నవ్వాలిఁ కేలా? ౧౯౭
ఉ. ఇట్టి నెపమ్మునన్ మనము, నేచువి యోగభరమ్ము మజ్వాగఁ
గట్టడి పల్కు వల్కెదను, కంపమొకించుక లేదె నాతలం
బుట్టెను విప్రలంభ కథ, బూమెలు వన్నెదు చాలుజాలునీ
బెట్టిదమౌచుఁ బల్కెఁ జెలి ప్రేముడి మానిని గానఁ డాయుడున్. ౧౯౮

ఉ. ఎఱిఁగి యెఱింగి యిట్లు తగ, వేదననుంగడు ఆవ్వసేతురే
గుఱుతొక టుంగనుంగొనఁగఁ, గూడదె ప్రేలఁగఁ జేసెదింతలో
మఱితురె నాగునమ్మిక సు, మాళపు మాఁటల దీఱదక్కటా?
చెఱకున దీప్తి క్రొత్తయొకొ? చెల్లెలి ముగ్ధత విన్మ చెప్పెదన్. ౧౯౯

సీ. కొనఁగోట మీఁటిన, కనువీటి చెఱకుల సెగలదవ్వుల దూకు, చిగురుఁబోఁడ్ల
వెడ వెడ నిట్టూర్పు, వేడికోరువ లేక చెంగిలూ గాములా, చిల్కగముల
నెమ్మని తొంపంపు,టున్మీలింపుల గ్రుగ్గు పరువంపు టిగురుత, ల్పముల విరుల
చలువలై యొడలెల్లఁ, జల్లుగొజ్జగిమంచు పొంగుసోఁకులదూటి, పోవు తేంట్ల

గీ. తేటతెల్లమ్ము గాఁగవ, ఘూటిలోన, బాటిలువియోగ సంతాప, భరముకరము
తెలియనగుచున్నదింతేల తెలవ! నీదుబూటకముచాలు చెలిఁజూడఁ, బోదమమ్మ.

క. గాయక మెఱుగమి మరు విరిసాయకముల నొచ్చిమరులు, సందడిఁ బడియ
న్నాయక రత్నముపైఁ దమిఁ బాయకపటు విప్రలంభ, భరమున నొగిలెన్.

మ. చెలులా జూడమ పాటసై సనుకటా! చిన్నారి పొన్నారి యా
టలపై నాస యొకింత లేదు నిదో, టన్నిల్వఁగాఁ జూడదీ
వలపంతంతకుఁ బెచ్చుపేగఁ గసహింగ, పంజాలకీ బాలయు
య్యాలవో లెన్మదిఁ దూలియాఁడఁ జెలులెం, తేనాగి నందాళకన్. ౨౦౨

తే. గీ. వేగుచున్నది చెలిమనః, మేగికలిసిపొలసియున్నను గొంతన, క్లిలిసహించు
ననుచు నేర్పున నూరార్చి, కొనుచు నమృత వల్లి కల్లన వలపుమ, త్తిల్లఁజేసి

శా. శైవండా గొనియల్ల నల్లనవిరుల్, గాటంబుగా రాలున
పూవ్ఁదోటన్నడి చల్వగొజ్జగులగుం, పుల్ పేప రంబైనయ
క్కేదారంబుల గొందిత్రోవ నడుచ, క్కింగప్పు రాల్గప్పుచున్
ద్రోదుల్గట్టగ నాదనుంగులిపుచున్ బూబోణి మెల్మెల్లనన్. ౨౦౪

క. చల్లనిమాఁటల మదిరం, జిల్లం జేయంగ పొలపు, జెణుకులడెందం
బల్లలనాడఁగఁ దడఁబడు, పల్లవపాణిం బిగింగఁ, గట్టు మనంతన్. ౨౦౫

ఉ. వేసలియాడి పెన్నెరులు, వీఁలిపిటుంమనఁ దొట్రిలాగ లేఁ
గొనసియాడ నూరుపుల, గంపము తీగెల నూఁగఁ జేయునె
మ్మోసిసెకన్ సుడింబడుచుమే, న్మొయిఁదూలునఁ దేంట్లువారణ
మ్మానిని మానసబ్జలస, మానసమానసుభాషి మానసన్నై. ౨౦౬

క. తీవియ బెనఁగొను క్రొవ్విరి తీవియబలె నలపుసాలఁపు, దిశురుటఁ జెలిపై
జేవెనుచు కొనుచుజల్లని, త్రోవఁ సైదోడుగనఁగఁ, దొడరెడు తమితోఁ.

మ. చనిగొజ్జంగుల మంచుజింద నిరసె, జ్జదమ్మిలే తూడులో
య్యనబోటుల్మయినొత్తనొత్తి, గిలిచి, త్రాంతస్థుఁ బ్రాణేసుపై
ననిమేషస్థితిఁ జూపునాఁటిమరుస, య్యాటంబులం జొక్కున
వ్వనితారత్నము దేవవల్లి గనియెఁ, వాలారు క్రొంజూపులఁ. ౨౦౭

మ. కనిభావంబాకి యింతకందుననిచ, క్కన్నిక్కి పూబోంట్లసం
దుననందండిల కించఁజిత్ర పటమెం, తోమోహ పున్మమ్మరం
బున నెమ్మోముననఁ జేర్చుఁగాఁగిటనిడు, న్మద్దాకులేఁ జెక్కులఁ
దనివోనొత్తి కనుంగొనుంబులకితో, దాత్తాను షంగంబునఁ. ౨౦౮

సీ. ప్రాణవల్లభ! నీకు, బటువుబిల్లలటంచుఁ, బాలిండ్లపై నొత్తి, పట్టఁజూచు
నంతలోఁ బరితాప, మాకునోయుని లేచి జిలుగుపయ్యెదఁ గేలఁ, జేర్చివిసరు
గాలిసోఁకులనడ, గ్గిమ్మునోయనిమోవి, పానకమ్మిడిముద్దు, లానుతమిని
వైకొమి కినుకగా, భావించి యెదఁ జేర్చి యింపులూరంగఁ బ్రా ర్థింపఁజూచు

తే.గీ. వలపుతమి రేచిపటముపై, వరునిజూచి, నిశ్చయభ్రాంతిమునులొంది, నెనరుజెంది
తెలివిఁగనలేమిఁజుతిల్లి, దేవవల్లి వెతఁగలంగుటఁ దెలసియ, వ్వేలఁదిగలసి.

తే. గీ. కొంతయూరార్చి దనటంచుఁ గొమ్మనెమ్మనంబుమురటెల్ల నొంటిశీర్షంబు బాటి
మోహవాగాశిలోముగ్గ, ముగుదయెడకు సన్నఁజనిచిత్రపటము కేల్, జ్జాచిపట్టె

సీ. పొరలిపొరెడుమోవి, పూరంబులోజిక్కి, వెడలఁజాలనిమేని, బడలికలకు
జలువలీనెకుకమ్మ, జిలుగు తెమ్మెరదిమ్మ, లతుంచుకొనుమోవి, సాలవడికి
మచ్చరించుచువచ్చి, నెచ్చెలుల్దమలోన గుజగుజల్సేయున, గ్గజిబిజులకు
నెడరేసి వలపుటా, త్తతముతోఁ జెడరుడెం డములోని భావంపుఁ, దహాతహలకు

తే. గీ. లేమియుసుమంత సైరింప, లేక మెదుగు తలిరుఘువీలునఁ దనుజూచు, తమిని సమ్మోహ
వల్లిగసు బెంచుటయుఁ దన, యుల్లమూఱ, కెతుక పవుటలయు సిగ్గువె, గ్గలిమిఁ దొలగ
వెఁలితెరిపెఁ జేరి

క. బాలాపసిపాపవు నీకీలాటి తలంపుబాడము, టేలా? మదిని
జాలికిఁ దల్లడమందితిఁ జాలుంజాలు న్విరాళి, సైరింపుమిఁకన్. ౨౧౩

తే.గీ. అనుచుఁ జెలియలిత్రోసించు, కంతతెలివి గోలుపు జిలిబిలిపలుకు మక్కు-
                                                            వలుగులుక
బలుకు నుడిలోనఁ గేల్దమ్మి, తళుకులీను ప్రాణవల్లభు ప్రతికృతి, పటము
                                                            గాంచి. ౨౧౪

సీ. తరుణార్క బింబసుం, దరచకచ్చకలీను నెమ్మోమనిమ్మైన, నిగ్గువాని
జిగిదువెన్నెలహాయల్, జిలుకుశేరానీటు, చిరునవ్వు నెమ్మోము, చెలువు
                                                            వాని
దగటుబంగరు తల్పు, తళుకుదేఱువెడంద యురముపై రతనంపు, సరులవాని
సొగసన్నులసొంపు, జాగిమీనులరత్న కుండలప్రభలులో, గొనెడివాని
తే. గీ. నిడుదకేల్దోయి వానిబై, న్నెరులసాటి తేఁటిగమి దూటు వానిన, త్తైలవ
                                                            తనదు
కూర్మిధనమెల్లఁజూరఁగా, గొన్నవాని గనియెఁ మనసార గిరిశ, నందనునిఘనుని.

చ. కనుగొన హావభావగుణ, కల్పనలందన మానసంబునన్
పెనగెడు తత్ప్రకాశమయ, పేశలరూపమె కానలో వెలిం
దనివిసనంగఁ బ్రాణవిభుఁ దత్పరతన్ గనిశుద్ధ సాత్త్వికో
పనతమనస్క మైయమృత, వల్లిమృదూక్తుఃదేవవల్లితోన్. ౨౧౬

ఉ. తరుణిరో! నామనోధనము, దక్కఁగొనన్నశి శేఖరాత్మజుం
డరయనటంచు నుంటినక, టా! పసిపాపవు నిర్విమోగజ
జ్వరపరితాప వేదనల, పాలొనరించెని కేమిసేతునె
త్తైఱఁగును జెందువారమొ, కే! జగదేకధనుష్క కౌఁగిటన్. ౨౧౭

ఉ. వావిని కన్నులెత్తిలల, నామణియగ్రజఁ గాంచిపల్కెనో
దేవి! భవత్కృపాకలిత, దివ్యకటాక్ష నిరీక్షణైకసం
భావితుఁడౌట, నిబ్భువన, మండలి నభ్రసుమంబటందుమెం
దావసుధార భాత్మజుమ, హామహిమంబు ధృతిఁగలంచెనే. ౨౧౮

శా. ఏమమ్మా! భువనత్రయమ్ములనలెం, డీలోక మాలోకమం
చీమాటల్పని యేమిసర్వ వనితా, భీష్మంబు త్వద్రూపమే.

భామారత్నములైన జూపులమిరే, పర్ణ జెందమ ముల్లాటిసర్
సేవింపక సెకపోంత వెన్నెలవలన్, నిచ్చల్గరంగేరుగా. ౧౧౯

క. దేవీ! నీవేమదిసం, భావించితి వనిననలని, పటురూపవరో
లావణ్యము లేమనరస సేవధిబోటులకు నలని. సేవనమెకటా. ౧౨౦

వ. అనియిబ్బంగిం బ్రసంగ వశంబున నిందుధర నందను నంగసం బభిన యిచ్చట నిందువదనల కానందం బతిశయిల్లంటా జేసి పరస్పరోత్తేజకంబయిన విప్రలాభంబు వేలాసముల్లంఘనజంఘాలంబగు నంబుధి వడువున నుప్పొంగు నెల్లి నుల్లంఘింప నలవిగాక తల్లడపడి యుల్లంబులు మల్లడిగొన నొల్లంబోవు చుండదవసరంబున నపాస్తరుచి రాలంకారంబును ననిర్దిష్ట పదబంధ మధురంబును సుఖాకర శయ్యా విరహితంబును ననుదాత్త గుణాబంధురంబునన సారవృత్తి సంశోధితంబును నపరిస్ఫుట వ్యంజనాలోకంబును నసుటపలన గుకవికవితా వితానాను మితంబయ్యును ననర్గళరస ధారాసార ప్రత్యేక వర్తనంబును చెరంతన రాజశేఖరోమ్యాఖ్యాత కథా విధానంబును ననుచ్చరిత దోషాకర ప్రసంగంబును వయస్యాను రంజిత శీతలపదార్థ పరిష్కృతంబును నతిశయిత లబ్ధవర్ణాంతర మోహానంబును సముచితైకరీతికంబును గావున విద్వదాకల్పకల్ప నానల్పంబగు మహాప్రబంధంబురుం బోలి యయ్యంగనాలలామల యుద్ధాను విప్రలంభంబు నిస్సీమంబై ప్రవర్తిల్లె నప్పుడు. ౧౨౧

మ. సకులంతంతటం గ్రమ్మి సొమ్మసిలునా, చంద్రాస్యలం గౌగిలిం
చికటా! మీకిది న్యాయమా? తలంపుసం,సిద్ధించు నింతేల తా
వకసంకల్పమనల్ప సిద్ధఫలసం, భారంబు భారంబుగా
దకలం కాత్మత నొందరమ్మ! తగరమ్మా! యింత చింతాప్తికిన్. ౧౨౨

చ. విరహాభరమ్ము లోనణంచి, వేసరుటొ, సరి కార్య యోజనా
దరణము బూని పూనికను, దాత్తఫలక్రమ సిద్ధిగాంచుస
త్తైలుం గెలుగంగరాదె జగ, తీరథ నందనుడింకం గొంగుబరా.
గరువలె మీయ ధీనుడగు, గావున నేటికి నొంపు చింతనల్. ౧౨౩

సీ. పలుకుల చక్కెరలక్కై, పంతగించి పెనంగు నధరబింబా స్వాద, మందంగోరు
పాచ మున్ద్రంతి కీర్ష్య, పట్టమారంకమా స్తనకంజ కుట్మలో, ద్ధతికి చులుకు
ఎకటిన కడిమిమీ, నడకనై, పకకోరు దంత కుందములతో, దారసించు

కచఘనా ఘనముపైఁ, గాళ్కొంచుగర్జించుమేనివాసనలకై, మిగులఁగసరు

తే. గీ. శారికాకీరకలకంఠ, చక్రవాకహంసభృంగమయూరగం, ధానిలములు
కంటగించవెమీరొంటి, నుంటదగదుచాలు,నుపవసించుయంగ, నేలమనము.

చ. మనములఁ జింతమాను డిక, మానినులార! యటంచు బోటులొ
య్యనఁ దననూరడించు తఱి, నక్కల కంతి సభీవతం సమ
వ్వని తలఁగాంచి యప్పురుష, వర్యుని సన్నిధికేను పోయి చ
య్యనఁ జనుదెంతుఁగా కమన, యర్థము సర్వము సంఘటించెదన్. ౧౨౫

ఉ. నాయక రత్న మాతనిమ, నంబున నేతదయోగ చింతయే
చాయ బెసంగునో తదను,సన్నిధి వారల గోష్ఠి యెట్టిదో
యీయఖిలమ్ము నారసిత్వ, దేకదృఢా శయలీ నెలంతలం
చాయన కాత్మ నెక్కొలిపి, యాదట మీకడ కేగుదెంచెదన్. ౧౨౬

ఆ. బోటులార!మీరు, పూవింటి దంటచేనిగుల నొప్పనీక, మించు బోండ్లఁ
జాలనమ్మృతి వల్లి, సౌందర్య వల్లులఁ బ్రాణపదములుగాన, బట్టుఁడనిన. ౧౨౭

ఉ. దిగ్గున లేచి పేరాకులను, దెల్విదిటంబుగ బోటిగాంచియో
భుగ్గుర టంచు మండు స్మర, భూజ్వర భూతక్షతాను తాపముల్
సిగ్గుచు గొంత కొంత కడఁ, జేరిచి పల్కిరి యిట్టి వేళనా
వెగ్గలపుంద యావనధి, వెల్లువ గట్టఁగ నాదరించితే. ౧౨౮

ఉ. కందులెప్రాణవల్లభుసి, గన్నులు చల్లఁగ మందలించుచున్
డెందము గందునే బలుక, డిందిమ గంటిమి దంటతాల్మియ
స్పందము గాన లోతరసి, యచ్చటి వారల మాతనంబులే
చందమొ?సీతపమ్ము షల,శాలిగదా పతిఁజూడఁ గగ్గెదన్. ౧౨౯

క. అన్నియుగనికొని ప్రాణము, లున్నంతనె వచ్చితీర్చు, ముమ్మలికష్ముల్
మన్ననఁ గొనుమని వెన్నుని,కన్నియలిప్పుడు లేచి, గౌరవకలనన్. ౧౩౦

ఉ. చెక్కుల దువ్వికౌఁగిళులఁ, జేరిచికోరిచి రత్నరత్నముల్
చెక్కిన మూక్తికావళులు, చేనిడి క్షాన్కలొసంగి చెల్వనిన్
మక్కువలూరఁ జేసియును, మాసముదీరిచి మమ్ము నాథుతో
నొక్కటిసేయు భారమున, కోచెలి! నీవనియుందు మంచనన్. ౧౩౧

క. తల్లీ! వెఱవకు యువతిమ తల్లీ! మోయమృత వల్లి! తడయను మదిలో
నుల్లసిలు దేవవల్లీ! తల్లడ పడ కేనువత్తుఁ, దప్పరమతినై. ౨౩౨

తే. గీ. అనుచు నసిచినజమిలోన, నవ్వధూటి యాశ్వరాత్మజు జూడంగ, నేగెననిన,
నవలివృత్తాంతమెట్టిదో, యానతిమ్మ, టంచు మునికోటిసూతుని, నడుగుటయును.

## — ఆశ్వాసాంత పద్యములు. —

మ. కమలా గర్భ విదర్భ రాజ్యరమణీ, గాథాను రాగక్రియా
ప్రమదారంభ విజృంభ జంభదమన, ప్రస్పర్థి సాభోగభో
గమహా మంత్రికులైక భూషవరరా, కాచంద్ర చంద్రప్రభా
భ్రమదప్రస్ఫుట కీర్తిసాధన సమ, గ్రారామ చంద్రాత్మజా. ౨౩౪

క. రంభో రూమదనజయా రంభావహ రాజనయవి, రాజిత వాణీ
పుంభావ కీర్తిగుంభిత కుంభీనస రాజధామ! కుశలవరామా! ౨౩౫

తరళ. నిజముషాగ్ర జాగ్రదుక్తి, నిశిత మండలాగ్రభా
వ్రజతలత్త శాంధవైరి, వారసమయ ధోరణీ
విజయ సాహ సాంకవీర, విక్రమార్కయ నలదృ
గ్భజన పరమనోరవింద, బుధు!సింధు సాగరా!. ౨౩౬

గద్య.

ఇది శ్రీసదు భయ భాషారసజ్ఞ రసజ్ఞాగ్ర నృత్యన్నాట కాలంకారగ్ర
న్థానగ్రప్రబన్ధ బన్ధుర కవితానిబన్ధన శ్రీమద్వేమ నారాధ్యవంశప
యః పారావార రాకా సుధాకర (ములుగు) శ్రీపాప
యారాధ్య విరచితంబగు సరసహృదయానురం
జనంబను మహా ప్రబన్ధంబు నందు
ద్వితీయాశ్వాసము.



శ్రీశివాయ గురవేనమః

# సరసహృదయానురంజనము.

## తృతీయాశ్వాసము.



మానిరహృదయ! కవి,
గ్రామణిసంకల్ప శిల్ప, కక్షితిరుహా! సం
గ్రామ ధనంజయ! గుణగణ,
కోమల దామాభిరామ! కుశలవ రామా! ౧

గీ. అవధరింపుము సూతుఁ, డిట్లనియెమునుల, కంతఁగలకంఠి క్రౌంచారి, యంతికమున
కరుగు నదియాది గాఁగమో, హంబురాశిఁ బొరల నడుచక్కఁ గన్నియ, ల్బాగులు నంత. ౨

—* సాయంసన్ధ్యాకాలాది వర్ణనము. *—

సీ. హరితురంగత్విణ్ణ, చరమ భూధరదరీ, గైరికక్షోదసం, క్రమణమనఁగఁ
జటుల సంధ్యానట, చ్చంద్రశేఖరజటా, పటలపరిభావనీ, ప్రసరమనఁగ
చైత్రయాత్రాసము, త్సాహసాహసకంతు, రక్తకంకటవిభా, రాగమనఁగ
వరుణశుద్ధాంతసం, వరణాగ్రకురువింద, బాధురారుణరుచి, ప్రచయమనఁగ
గీ. యామినీయామినీవరా, నల్పతల్ప కల్పితాగ్రవితానరాం, కవమనంగ
సాంధ్యరక్తిమ యంతంత, చదలఁ బొదలె ఘుసృణమసృణ ప్రవాహ మో, కో
యనంగ. ౩

మ. తమమిత్రుఁడు ద్రిలోకి బాంధవుఁడుప, ద్మాకాంత కాణాఁచియై
తమయింట న్నివసించు జీవనమనం, తం బంచు మత్తాళిసం
క్రమమొందందము దమ్ములంచుఁ గనదు, గ్రగ్రాంశుఁడౌ రాజువ
చ్చెచు ప్రాజ్జ్వల్యము లేదటన్నగతిరా, జీవాళి గ్రుంగెందమి౯. ౪

చ. ఉదయమునొంది సత్పథము, నూనికరగ్రహణాప్తిఁబద్మినీ
వదలక స్వేష్టకృత్యముల, పశ్యతిసద్విజ చక్రమేలుచున్
విదిత మహావనమ్ముఁగని, వేఁడుక నంస్మృతి శోభ కావియొ
ప్పిదముగఁ గప్పెనోయనఁగఁ, బేర్మి దగెన్ రవి రోహితచ్ఛవిన్. ౫

మ. హరిదానాటయునాత్మ పుత్త్రికలయో, గావస్థ లంజెంది దు
ర్భరచిత్తవ్యథలంగ లంగుటయుఁ ద, త్ప్రాణేశుఁ దోడెత్తునం
చరిగెం బోయన నర్కుఁడే గెనటులో, గాకంటె దాక్షాయణీ
పరమోత్సాహముతో గుహాద్భుత తప, స్స్వానంద ముప్పొంగెడిన్. ౬

మ. పరభూభృత్కటకంబులందన సఖుం, బాల్పెట్ట వీరారిపుం
జరశోల్లాసము లేర్చుచుండ సనలా, శాపాళులన్ శోణని
ర్ఝరిణీవారము కొల్లఁగాఁ బఱపి సాం, ద్రశ్రీ విరాళించి భా
స్కరుఁ డేగెన్ భువనాంతరంబునకు లో, కంబంధమై లోఁగఁగన్.

మ. సమయానేకపముంబరాటవి దురీత్యంబోఁచు గంధాఢ్యసం
భ్రమవృత్తిన్ దిననామశాఖిఁ బెకలిం, పన్ దిక్కులన్ వ్రాలు త
త్సుమముల్ దారలు తత్ఫలంబు రవినాఁ, దోఁచెడ దుర్వ్యజను
ర్భ్రమదిందిందిర బృందమోయనని రు, గ్రాపై కెన్న భోముడలిన్. ౮

క. ఇందీవర శాలలలో, నిందిరచూత్న ప్రవేశ, మొనయుటనో యిం
దిందిరర వపుణ్యాహఁపుఁ, గ్రందున నంతంత ద్విజుల, కలకల మొనసెన్. ౯

మ. శతపత్త్రిక సహాయతన్ మధుపముల్, ఝంకార వాచాటను
స్ఫూర్తిభర్ పాంథ సతీజనంబుఁ జెఱలం, బాల్పెట్టి సర్వంబును
ద్ధతి మీఱన్ సుమనో మరంద ధనమం, తంజూఱఁగాఁ గొన్నదు
ష్టతరుల్ బంది ఘటిల్లెనన్ గతిఁ బమో, జస్థాయులై వ్రాసెన్. ౧౦

క. హరిప దహాస్త్రయీతనుఁ, డరయఁగ వారుణికి మరఁగె, నర్కుఁడనుచున్
సరసులు కన్నులు మూసిన, కరణింగ మలయములు ముగిచెఁ, గాసారముల్.

—* చంద్రోదయాది వర్ణనము. *—

సీ. కలిమి పూబోఁడికి, గారాబుసై దోడు, కలలేని మూకశా, కటికిదిక్కు,
కడలికా ముష్మికం, బెడతీని పుణ్యంబు, సంతమ సాభజం, ఝామరుత్తు,

కలువల వికసిల్లఁ, గాఁడేయునెచ్చెలి, తమ్మిపూవుంబోండ్ల, తరువుఁ గాఁడు
తనివోని చలువమం, దసములవిడిమట్టు, గట్టుఁవిల్తుఁడుతీపు, నట్టిసొమ్ము
గీ. జక్కవలమేలిచెలికాని, సంగడీఁడు, చుక్కవాల్గంటులకుఁదమిఁ, జొక్కమం
దుపొడుపుగుబ్బలినడుచక్కి, పొలిచిసిక్కి. చంద్రుఁడరుదెంచె వెన్నెల,చదల
నించె. ౧౨

ఉ. ఉదయధరాధరోర్ధ్వతటి, నొయ్యనఁజంద్ర మృగేంద్ర మెక్కియు
భ్యుదిత మరీచికల్ సటల, రోజవిదిర్చి మెఱర్చునంతలో
నొదిగిగు హజ్జారం బళియె, నోయననయ్యెడ నయ్యెడర్దవో
మదకల ముల్లసంబడక, మాయఁగఁ బాయఁగఁ జొచ్చెనచ్చుగన్. ౧౩

శా. జీవంజీవ మిథస్స మాగమసమా, శ్లేషోత్థ ఘర్మాంబునే
త్రావిర్భూత ముదశ్రుధారలన,నీ, హారంబు తోరంబుసం
భావింపం దగిమోక దదుత్సవసుధా, భవ్యాన్న సత్రంబులో
నావన్నె ల్పచరించి వెన్నెలలుస, న్నాహించె విన్నాణమై. ౧౪

మ. శతపత్రారి శతాంగసంగత మహా, సత్వాశ్వ కోటీసము
త్థత దూరాంబర మార్గచంక్రమణదీ, ర్ఘాయాస వైధుర్యని
స్సృతలాలాన వఫేనఖండములనం, జెల్వొందె సాంద్రీభవ
త్తత చంద్రాతపముల్ చకోరపటలో, ద్యద్ఘస్మ సత్రంబులై. ౧౫

సీ. పటుకటీతటపటి, స్ఫుటదుకూలప్రభా చాకచక్యములతోఁ, సరిపెసంగి
స్ఫుటపయోధరతటీ, సుకుచి ముక్తాగుచ్ఛ గుచ్ఛార్థ తళతళ, ల్గూడి యాఁడి
కబరీపరీణద్ధ, గన్ధగన్ధిలమల్లి కాస్రక్పరంపర, ల్గలసిమెలసి
కర్పూరధూళికా, ఘటిత పాటీరాంక పంక,లేపములలోఁ, బరిణమించి
గీ. సంసరణభీత లగునభి, సారికలకు, స్వస్వరూపాను సంధాన, సామరస్య
నిశ్చయమ్ముఁ దెల్పితఱియించు, నేర్పుఁగొలిపి కౌముదిచెలంగె నద్వైత, కౌము
ది యన. ౧౬

సీ. గగనగంగాతరం, గమిథస్స ముద్ఘృష్ట, పరిపత త్ఫేనత్సమ్మశీ, కరములనఁగ
సాగరాంతర్నిమ, జ్జన్మృగ్గతాబ్జారి, రథవాజివాలవా, ల్జాలమనఁగ
యామినీచంద్రమః, కామోపభోగసం ఘట్టనోద్భూతశా,ంగ, ఘర్మమనఁగ
నభ్రాటనీప్రాంగ, ణాభ్రపద్ధుద్ధృష్ట సమయుసామజ మదా, సారమనఁగ

గీ. సాంబుజోత్పాత సూచనా, శ్లాతినృష్టి, మనుమకోసమెల్ల మెడలఁజె, సౖసవ విసరు
సౌలుపునీపింప శశి,కల్వ,పువ్వుఁబోణి మేనఁబన్నీరు నించెనా, నింౘెమంచు.

సీ. పాలవెల్లికిజిడ్డు,దేలకున్నను మంచు, గుబ్బలియిరులలో, గోఁకయున్నఁ
గౌలుఁగంటిమాన్యంకులఁ, దేట్లు మూగకయున్న, బాపతేతిలనల్వు, బ్రాకకున్నఁ
వెలిగరు మెలుమదం, బలవడకున్నమి, న్వాఁక్రపకుమ లోనఁ, బ్రా కకున్నఁ
జేజేలయాతోఁక, చిగురుమాయక యున్న, ముత్తియంబుల కొచు, మెఱయకున్న

గీ. జంద్రికకుసాటి పోలిక, జలతరంబు సమముఁజోడేపు నద్ద్రిమై యుమను నటుల
గామినవిమెల్లఁదక్కు, ల్గావెలుఁగ, శారదాశారదాభ్రస, చ్ఛస్రలసలరె.

క. నెలతాలనేలఁ గఱఁగిన, జలశాలఁగ నరదకడలి, సరగునఁ బొరలెఁ
వలరాలలితయు శంబున, నలరారె విరహిజనము, నూత్రాపటిమన్. ౯

సీ. శృంగారస-ధ్యశా,శ్మీరరేఖయమర్చి, నటులాంధకారంన, జలమున్దిద్ది
ప్రాగ్దిశాప్రథమప్ర, భాదుకూలముఁ గట్టి, నెలపుల్గుకల్కటం, బెలఁదొంచి
కువలయ మాలికో, త్సవతోరణముఁ గట్టి సరసహల్లకజ, స్తల్పము నిచి
తారాకదంబము, క్తావితానముఁ దెత్తి నీహారవారిప, న్నీరుజల్లి

గీ. సవ్యజైవాత్రు కౌశిక్యు, నాయకునకు, రాత్రివాసవసజ్జికా, రమణిపోలె
నిత్యపూర్ణాను భావంబు, నెగడఁజేసి, కలయికలఁజెందె మోహానో, త్కలిక గులుక. ౧౦

గీ. విరహిజనములు విదళింప, వెడలుమరుని వెల్లగొడుగనఁ దారకల్, వెల్లిపిరియ
వెలిగుడారంబు పగిదినై, వెన్నెలదనర్చె సందు నిండుఁ బసు కలశంబు, టాద మొదె. ౧౧

—* నాయికాద్వయము విరహావేదనం బొందుట. *—

ఉ. అయ్యెడనొయ్య నొయ్యజల, జాహితదీధితు లంతనంతసం
దియ్యక చుట్టుకొంచుజగ, మెల్లెడఁ గ్రమ్మఁగఁ గన్నుగాల్చిమేన్
వ్రయ్యలుసేయఁ దొయ్యలులు, వాడినతీవెలుపోలె సోలుచున్
నెయ్యపుఁ గత్తియల్గలుపు, సేరుపు లెవ్వియుఁ బట్టుగొల్పనిన్. ౧౨

ఉ. చిందరవందరై పఱచుఁ, జిత్తములన్నియు పోపలేమిన

య్యాదుముఖుల్ విరాళిసెవ, మెత్తి జగమ్ములు చంద్రచంద్రికా
మదడవార్చు లంగలచి, మ్రగ్గుచుకోయని లోఁదలంకుచుఁ
గుందుచు నించుకంతయునఁ, గోల్కొనసీ నివిషాద వేదనన్. ౨౩

ఉ. అగజరాజ గామినుల, నంగశరవ్యథి తాంతరంగలై
యేగతినాగ రానిమను, లెత్తి సఖుల్వ్రాల పిపఁదారునన్
రాగరసోత్త రంగముఖ, రంగకలధ్వనిఁ పూర్వరాగపు
న్నాగవరాళి కాలలిత, నాదసుధారస పూరమూరఁగన్. ౨౪

గీ. వలఁపుఁదలఁపులు వలనంత, గొలుపవిరుల తల్పములుదావ దహనైక, కల్ప
ములుగ
నిలువఁజాలక విలపించి, తలఁచితలఁచి, వెతఁగలంగిరి తరుగిరు, ల్వెచ్చనూర్చి.

ఉ. తత్తరమంది నెచ్చెలులు, దగ్గరఁ కౌఁగిలించెమల్చుచున్
బిత్తరులార! మీరిటుల, జేలతనంబులఁ దూలనేల? మీ
చిత్తములింక రంజిలున, శేషశుభంబులు గూడవచ్చుదే
హోత్తముఁడైన యగ్గుహుని, యొద్దికత్రోవత సంఘటిల్లెఁపున్. ౨౬

వ. అని. ౨౭

ఉ. ఊరశిలంగ నాఁడిపున, మూరకయున్నను మంటమీరియా
వారిజవైరి యిట్టిపసి బాలికలన్ బెగడొందఁ జేయుకీ
రారవకోకి లధ్వనుల, యూంకరునంకుల పాటుఁజెందుచోఁ
దోరఁపు వెన్నెలగ్గవసి, త్రోడమునాగడ మగ్గలుంగునే. ౨౮

చ. మలయసమీర మాంత్రికుఁడు, మత్తమధువ్రణ నాదమంత్రముల్
బలుకుచుఁ గల్పపుష్పాకుల, భస్మముఁజల్లుచు పిఁడెనచ్చెనో
జలరుహ నేత్రలార! పెను, సందడిఁ గొల్పుఁడు పూచిపట్టియీ
యలరుల కొనకైనఁజన, సాఁగద తెమ్మెఱ దూరదేమియున్. ౨౯

క. లలనలు మైమఱచినలలి గలదే? యెలనాగలార! కాదద, నాఁడా
కలకంఠియుఁ జనితడయుట నెలతల యలమటలు దెలియ, నేరమియయ్యెన్.

ఉ. పంతము లేల? మీఁదభగ, వంతుఁడు శ్రీహరి మేలుఁగూర్చునాఁ
డింతకు నింతులన్మిగుల, నేపఁగనేపఁగ నిందుఁడొందెనో
కంతుని శాతకుంతములఁ, కొవడిమోవడిఁ దూలవచ్చెని

శ్యాంతలు సొమ్మసిల్లిరిఁక, కందువమాటల నిందుసందమే. 3౨

గీ. అనుచుననుచుముదమ్మున, నన్నుమిన్న లెల్లమెడలనుదొవబోంట్ల, నల్లమలర
నస్యచంద్రాత పాచ్ఛాద, నములలోనె పెనఁగిగిలగింత లాడుఁగా, బిల్లినసిరి.

—* చంద్రి వందనము. *—

సీ. భువనజాలములెల్ల, బొజ్జలోఁగలమేఁటి శిరసావహించెనే, చిన్నినా డె
యిసుమంతకనుసన్న, విసరుచేఁగలుము లీనెడుబోటినితోఁబుట్టి, నెసరుగుల్కొ
జనభయంకరతమం, బునణంచి సర్వార్థ విజ్ఞానినైతివ, భేద్యగరిమ
నోషధీపరిపాల, నోన్నదికశక్తిచే నమృతప్రకాశివై, యలరితీవు

గీ. కళలకెల్లను నెలవుని, స్గసచంద్ర!యాసఁగొంటిమి గానన్నా, స్లోదమొసఁగి
చల్లఁజేయుము మాబోటు, లుల్లసిల్ల " నావమన్యత యోషిత్రో " యనుట
వినవె. 33

ఆ. బహుసహస్రపత్ర, భాసమానుండగు, తపనుగొండలంట, దరిమినట్టి
రాజవింతెకాదు, రాజశేఖరశిఖా మణివిరాజముఖుల, మనుపవయ్య. 3౪

ఉ. వేలుపుమూఁకలెల్లనిను, వేఁడిభుజింపక పొట్టనిండదిం
తేల?జగన్మయుండగుర, మేనకుం బరమాంత రంగివా
ఘాలవిలోచనుండు నిను, బాయకతాశిర సావహించెనే
శీలముశుద్ధ సత్వముపు, సిద్ధుఁడవన్నిట నేణలాంఛనా! 3౫

చ హరిణముగేలఁ బూనిధవ, ళాంగముదాల్చిక శాధసుఁడవై
భరితదిగంతు కత్వమున, భాసిలిదక్ష సుతామనోహర
స్ఫురణముబూని మామవలె, శోభిలినాఁడవు చందమామ! యా
తరుణుల నీదయామయుసు, ధారసధారఁ జూఁడఁగొల్పవే. 3౬

క. నినుజూఁచిన త్రాళ్లరఁగును నినుఁగన్నది కన్నుగాఁగ, నిఖలముబొగడుఁ
మనముననిమాత్ర భావం, బనినమ్మిన చెలులఁగరుణ, మన్నించుశశీ. 3౭

సీ. చంద్రికావిచరణోత్సాహంబునీయది కువలయానందంబు, కూర్మినెలవు
సద్యచంద్రాలోక సంబన్న, జగమెచ్చు లగుకళాపూర్ణోద, యంబుడంబు
పటురసోల్లాసంబు, భవదధీనంబుగా, సదసద్వివేకంబు, సహజగుణము
సుధసీకు నిండారు, సుమనోమనోరంజ, నంబునీహృదయాను రంజనంబు

గీ. కావ్యసర్వజ్ఞశేఖర, ఖ్యాతిఁ దనరి పూర్ణతేజంబుఁ గాంచుచు, త్పురుషవర్య!
మాచకోరాక్షులనుఁ గాచి, మనుపవయ్య చల్లని సుధారసంబుఁ జైఁ, జల్ల
వయ్య. ౩౮

క. అనియను కూలాలాపము, లను కేరా బొగడికొనుచు లాలించినభు
గ్గనియన లజ్వాలలలోఁ దనివోనే వోసినట్లు, తరుణులుగినుకన్. ౩౯

క. చుఱుకుంజూపులఁ జెలులన్, జుఱజుఱనైఁ జూడఁగినుక, సోముగ మెదలో
నెఱుకపడ బొంట్లుహా! నై, మఱదిలిమని యాదఁజంద, మామకునెమరై.

## —* చంద్ర నిందనము. *—

మ. నినునిందింపఁ బనేమి? పాలకడలిన్, నీసృష్టిఁ గావించుచో
ఘనభంగాకుల తృప్తిఁగూర్చె విధియా, గా" యంపు రస్కృత్యయా "
యనుశాస్త్రీయ విరోధమేల తెలియం, డన్యోన్ జగన్నింద్యమా
పనిసేయందల బోయుచోట నుచిత, వ్యాపార మెల్లాశశీ. ౪౧

సీ. శైశవంబునిన్ను, జదివించుచోఁజేయు దుడుకుతోఁడనెగురు, ద్రోహ మమరె
సముధికాభ్యుదయాన, సరసింధుభంగసం, ఘుతుణంబునఁ బిత్రు, ద్రోహమలరె
నెమరెఱుఁగకనీశ్వ, రేనుసాదలనీఁద, మాకుటదేవతా, ద్రోహమయ్యె
విరహిణీసంతాప కరకరోల్లసనాప్తి, దొంతరుటు స్త్రీవధ, ద్రోహమయ్యె
గీ. నొకటరెంటమూట, నొసరంగ నాల్గిట, ద్రోహివమచునలువ, సాహసించి
నడిమహాబిలమునఁ, బడఁద్రోసె నిటులయ్యె, మానరాదెనరభి మానచింతః

మ. సరసుల్సద్గురు కామినీకుచతటీ సంశ్లేషసంజాతను
స్తర పంకంబుర మంగళనందు రదియే, ధర్మంబొ? సర్వాంగసం
కరమూలాఘము గల్గిగోహిణి గడుం, గామించు చోనన్యస
త్సరసీజాక్షులు మెత్తినంగమలిమాం, సగ్రంధి యయ్యెంజుమీ. ౪౩

ఉ. కొండలనుండి వచ్చెదవు, కొండలఁజేరెవ వింతెకాదునీ
దండఁజకోర పుంబులుగు, తండములాడెను చెంచుబోయయ
ట్లుండెనుఁగానఁ బాంధమృగ, యూధము బెగ్గిలఁ జేయకుంమవే
మండెదు చంద్రికానలమ, మందగతిన్ దరికొల్పి సిట్పురా. ౪౪

గీ. సహజవైరంబు కృష్ణప, క్షమునసీకుఁ, గూడదామీఁదఁ గువలయా, పీడన్న త్తి
కృష్ణపక్షంబు కేశించి, కెడసెమనుపు గువలయాపీడ మెత్తఁగిమే, లొంను

ము చంద్రా. ౪౫

శా. సత్కోవ్యాప్తి తమోనిరాకరణస, త్సాంగత్య ముల్నీవున
న్సత్త్వంబల్ ద్విజరాజ నామములకుం, దద్ధర్మంబు లౌనారుణీ
స్పష్టంబు ల్వెలలోలు పత్వమునునై, జంబాట రాత్రించరే
శత్వంబొక్కఁడు దోచుచున్నయది, యుష్ణేతరేశ! నీ కెంతయున్. ౪౬

సీ. ఘనపరంపరలలోఁ, గనరాసినీకెట్లు ద్విజరాజనామంబు, తేజరిల్లె
దినదినక్షయముచే, డిగనశించెనునీకు, బైవాతృకత్వమే, దేవుఁడిచ్చె
తమ్ములమీఁదఁబా, దమ్ములెత్తెదునీకు, సత్పురుషత్వమే, చాయనలరె
దోషాకరిత్వంబు, దోఃగజాలనిసీకు విషపదావాప్తి, యెవ్విధిఘటించె
గీ. కరగతంబైన నీదుశం, బరవిలాస మదియొమారీచ నీచశ, ర్యాతిశయము
బొందియావిద్య, యొందభ్యసించినావొ, తేనెఁబూసిన కత్తివై, తవిమృగాంక

చ. హాటహారు లిద్దఱుఁగలసి, యబ్ధిమథించెడి వేళ వేఁడినన్
సరసిజగంధి భార్గవిని, స్వర్ణపటిన్ హరికిచ్చి నిన్నెగిన్
గరళము శ్రీశివార్పణము, గానొనరించినఁ బట్టిమిగుటన్
శిరమున నెక్కితీవుమెడఁ, జిక్కెవిషంబిఁకఁ జెప్పనేటికిన్. ౪౮

సీ. విశదప్రభాభాజ, విఖ్యాతిచేనిన్ను పాండురాజవటంచుఁ, బలుకరాదె
కడిమిమీరనసంత, గహనంబులోమృగో త్సాహివై పాహ్యాళి, జరుపలేదె
యాత్మజాభ్యుదయంబు, నందిసర్వాశాభితృప్తి గావసువృష్టిఁ, దేల్చలేదె
యాత్మకాంతానుగ్ర, హంబుఁదత్సారస్య ఘటనంబుచేమాకుఁ, గానవయ్యె
గీ. నీతలింతలు వ్రక్కలౌ, మ్యెదవుగాని, సుఖనివాసంబు లభియించు, చొప్పులేదు
మానిసీమాన మథనని, ర్మాణమునకు, నభినవబ్రహ్మవైతివో, యంబుజారి.
గీ. చక్రహృద్భేదనోద్భూత, చటులకిల్బి, షమ్మునినుబాడిగాఁజేసి, తొమ్మగండిఁ
జేసెనింతియెకానిపోఁ, జేయదయ్యె నంగనాద్రోహ మటువంటి, దనకుచంద్ర
క. అనిచాంద్రో పాలంభన, జనితోత్సాహమునఁబట్టు, సడలనితాపం
బునునలము దరికొలిపెను సనిలుకి క్రోరములననిరి, యారసికునుకన్. ౫౧

— * మలయానిల తిరస్కారము * —

క. మలయాచల నిలయానిల, తలయాపద లాఁగలంచఁ, దగవాఁగవా
జ్వాలదిసల జ్వాలలుపైఁ, జిలికెడ వీగుణముగనీకు, స్నేహాగతమో. ౫౨
క. అనలానిల షడములలో, ననిభేదమె

కపుఁగొనఁగఁ గొల్చునసలము గనరాకనె కాల్చువాఁడ, నగ్నిశిఖపవనా. ౫౩

చ. పుడమి వడంకఁ జేయు బలు, భూతము నీవు చతుర్దశస్థలిం జే
విడిబడి చంచలత్వమున, పిక్కటిల్లఁ గంటిరి గాసరాశి నే
యొడలికి నాసుగత్వమున, నోర్వఁగ రాని భరమ్ముఁ బూవుఁబో
నడపెదఁ జూచి మంద పవనా! తలవంతుసుగా మహాత్ములున్. ౫౪

క. నీరూపము వివరింపఁగ, నీరూపము భూతిబ్రాఁగ, స్వయమితకవ్మ
ప్రారంభుండవు కుటిలా, చారా! నీమాతరిశ్వ, సంజ్ఞమెటులనో. ౫౫

ఉ. వచ్చితి నీవటన్నఁ డల, వంపులు కొమ్మల కెల్లలోకమం
దెచ్చటనైనఁ బుష్పిణుల, నీడిచి పుష్పరసంబు డుల్పఁగా
నచ్చనె యీయ మానసముఁ, పర్తన లెల్లను జట్టపాలుగా
మచ్చిక లింకఁ జాలు పన, మాన! తొలఁగు కృతాంత మార్గముల్. ౫౬

ఉ. నీపొడఁగన్న భీతివడి, నిందుచు వాయువు వచ్చెనంచుఁ దామే
తీపలు మాటలెల్లపని, యేపెఁకఁ బట్టుఁగాని నిల్వ గా
దేపునకైన నీమెదుర, నిష్ఠమగు సుమనో వనాధిపే
మోహము నీమధు ప్రతిభ, కోర్చ మనంతుఁడు గల్గు మాకిఁకన్, ౫౭

చ. నడవడి లేమి నచ్చదుర, నన్ సమయా సమయంబు లెంచకే
ల్లెడలను సంచరింతువడి, యెట్టిని యాకుల పాటునాఁడెని
వెడలిన సౌమనస్యముర, పెంచుగదా? ఫలపాతనంబులే
కుడుగుఁ గదా? కుజాతినిల, యుండవు మంద సమీర! రాకిఁకన్. ౫౮

క. పాటీర గిరితటీవన, వాటీ పాటచ్చరుఁడవు, బాధింతుము ని
న్నాటీకిత మృగమదనం, ఘాటాంజన భస్త్రికలఁబ, భంజన! యెట్లో. ౫౯

చ. అని మలయాద్రి కంగరచ, రాసిలుఁ బాష్పమనోద వానలున్
గినిసి నిశాత పంచశర, కీలిశిఖాముఖ మల్బయింబయిం
బొనుపఁగ శంబరాసురుని, పూదనుఘాతకు నాగలేక నె
మ్మనముఁ దూలు బాలికలు, మచ్చిక నెచ్చెలు లాగి మాగుచున్. ౬౦

—* చంద్రోపాలంభము. *—

క. అళినీ ధీరచకోరాపళి, కో వెన్నెలలఁ బోగిలి, పసుతొ గలహాలా

హాళికో మదనానలకం దళికో, తలఁ కెదరుచెలులు, దరియుం కెట్లో. ౬౧

క. చిలుకలతోఁ జగడవలనె, నెలలనెలతో మిగులవలదు, నెఱచలిమిత్రో
నలికులముల గలిబిలితో, పలదిఁక మచ్చరముమునుకుఁ, వలరాజిచటన్. ౬౨

క. కందవు డొందములందరి, మిందుముఖు ల్మదనునిందు, నెగ్గించిననే
మందురో యందనుగందుహో, విందురో పొందికగననుచు, వెడవిల్తునితోఁ.

సీ. గంటఁగట్టినవింటి, కాఁడనంచనకుమీ, తుంటవింటికి నేమి, దొడ్డతనము
సహకార పటుసైన్య, సంచారిననకుమీ, రాలుగాయఁ పిట్ట, లేలపొగడ
సుమనోను గుణగుణ్యో, త్సుకుఁడ నంచనకుమీ, చండాలు రనునింత, చాటఁ దగదు
రాజశ్రీ యోద్ధన, ర్పమున మైమఱకుమీ, సత్కాంతి శూన్యుఁడా చక్రవైరి

గీ. బట్టిసాహాయ్యమునజయం, బెట్లుగలుఁగు, ధర్మబలగుణసత్సంగ, దార్ఢ్యమెద్ది?
కాననిఁకనైనఁ జెలులపైఁ, గనరుమాను మేలయబలలనొంచంగ, నిటులనంగ.

సీ. మధువిరోధమున నె, మ్మదినూ నెసీతండ్రి మధుసహాయమునసొం, పలరితీవు
పంచాయుధుఁడనంచుఁ, బలికెనీతండ్రి, నేపంచాయుధుఁడనంచుఁ, బలికితీవు
కమలాంబకుఁడనంచు, గర్వించునీతండ్రి, కమలాంబకుఁడనంచు, గనరితీవు
ఖగరాజవాహంబుఁ, గట్టించెనీతండ్రి, ఖగరాజవాహంబుఁ గట్టితీవు

గీ. తండ్రితోఁ బోర నాత్మజుఁ, డండ్రెవాని, నీదునుత్పత్తి మనములో, నిఖిలమెఱుఁగు
ప్రథమపూజ్యుండుధ్వజమెత్తఁ, బాడియగునె, జనకుతోఁబోను తగదోరి, శంబరారి. ౬౫

క. సుదతుల గదుముటచేగద, మదనా! నీసుమశరత్వ, మాస్యతకయహో
కరసెండు శబ్దపూర్వత, యొదవున్ యశ మపయశంబు, నుద్విగుణతతిన్. ౬౬

క. కన్నులుగల విల్లనియా, యన్నులవేచుటకునీకు, నదనామదనా!
వెన్నునకొక సరికన్నులు, కన్నులువిల్లడికి నేలఁ, గలవుంజుమ్మా. ౬౭

సీ. పాంథమర్దనవృత్తి, పరిణతంబాచునీ, విక్రమాక్రమణంబు, వినుతికెక్కె
రతిలోలుపతన హెచ్చా, రాత్రవర్తనలచే, మధురథరాచార, మహిమ నెగడె
కామినీ మానభం, గఁపుఁగాఁపు రమ్మచే సత్పూజ్య రాజ్యసం, శ్రయము మెఱసె

నిరహిణీగర్వాప, హరణకౌశలముచే, ససమబాణోల్లాస, మతిశయించె
గీ. త్రిజగదభినంద్యగుణసము, ద్రేకమెల్ల పదటిహ ళ్లేసియింతగాఁ, బ్రబలినాపు
మోక్షకామాఖభుక్తని, ర్ముక్తపత్రభాజనంబీమనంగనౌం, పకుమనంగ ౯౮
క. వలరాజనుటమఁ జేపల వలరాజవౌపడగఁడఁగ, వలెబేడసయా
వలరాజులు సవ్వఁగఁగే వలరాజసవృత్తి నెలుఁగ, వాభావభవా. ౯౯
మ. సహజామిత్రుఁడు చంద్రుఁడాచుజాము, ల్జాటంగముస్వాంమమీ
సహజామిత్రతకీ యెడఁగనుపడఁ, సత్సంప్రదాయాగతం
బహహా! నీకిది మేనమామగుణమా, గాలేదదేసత్పథ
స్పృహయా పీఠమునందుసల్లగొనగో, పీడంబుపల్గోలునే. ౨౦
శా. స్వామిద్రోహము సంభవించెఁగుసుమా, స్త్రా! నీకుఁగ్రొంచాయు
ద్దామప్రాభవుఁడింపుకంతకసరె, త్తంగొండలూటాప్చనీ
రామాగత్మములమ్ముహామహునకున్, బ్రాణమ్ములప్లాటచే
బూములుఁగల్పని గాల్చి తుంటవిలుతు, ష్పాల్డుల్చిఖండిచెడిన్. ౨౧
క. ఇత్తెఱఁగున మరునరులున, జొత్తిలుచిత్తములయాలప్మ, సాగయ్మవలరా
నొత్తిపలికి చెలికత్తియ, లత్తలిస దీవిపలపు, టలమటఁగనుచున్. ౨౨

—* వథూపరిచారికలు కలఁతనొందుట *—

కం. వలరాజుం జెడనాడితి, మలరాజు, జెఱవునుసుప్వు, టంపటినొర్చన్
దలఁచి కలంచితి మబ్బలల, వలపుందల కగ్గించి, వనటమ్మంచెన్. ౨౩
మ. కలకంఠీ కలకంఠపంచమనుహూ, కారంబు ఘోరంబుగా
గలదిం బిందిర సుందరీదటుఁగుష్టూ, కారంబు కారంబుగా
బలవింపన్నల విప్పుగాళ్ల నవలా, ల్వాధఃపరాభూతనూ
నలినీయుగ్మము బోలిసోలి పపిఱుం, చన్ సాగిరిం కెల్లాకో. ౨౪
సీ. తుహినదీధితియరుం, తుపకిరప్రపవారణ, ప్రహారణమ్ముల కెంత, బడలిరమ్మ
మలయభూధరదరీ, నిలయానిలానల, స్ఫుటతరార్చుల కెంత, పొగిలిరమ్మ
మకరందరసఝరీ, మహితోర్మికానదీ, ప్లేలనంబుల కెంత, విసివిరమ్మ
కుందబృందావనా, నందతుందిలభృంగ, సంగీతముల కెంత, జకిరమ్మ

గీ. వలచువలఁగింక వలరాజు, వాడకట్టు, గానియుపవని గాముచా, లగ్గలించు! అబలలను నిండుకౌఁగిళ్ల, నదిమిపట్టి, కదలనీయక పోవునౌ మనసు, సదనమునకు.

ఉ. బాడబమంటిల్లు పలుకుచుండు, హాటకోజ్జ్వలరత్నము, రీచిపీచికా మండల మండితాభ్రమణి, మండనమైన మణిగృహంబులో నండజ తూలికా కలిత, హంసమృదుతల్పముఁ గూర్చిబోటులం డొండ సఖీజనా సముల, నుంచిరి కౌఁగిళులందె మచ్చికన్. ౭౬

ఉ. కొండలనేలు గబ్బిచను, గుత్తపుగుబ్బల యబ్బరుస్థరా మండలమేలఁ జాలుగరి, మంబునఁ గొన్నకటీ తటంబులన్ నిండుదనాలు పీడకయ, నెయ్యపుఁ గత్తెలఁ బొందిదండలన్ బొడుఅబలోలె నుండిరతి, భీకరకాంతల కార్శ్యమేమనన్. ౭౭

చ. వరమణి మందిరాంతరధి, వాసిత కుడ్యతలాత్మబింబవి స్ఫురణ మనాంత మైకపుర, సూనవనం దరు జొంచఁ గోరు త త్తరుణులు పెక్కు జన్మములు దాల్చి తపించుర నంగ చమ్మర స్మరశర పంచక జ్వలన, మధ్యమునన్ బొరలంగ నాతలన్. ౭౮

చ. వలపు దలంపు లూరెంచె, వల్లభు నుల్లముఁ గంచు నాచునా సలఁగల కంతి యందఱఁగి, చాలగ మూదడ వయ్యె రాకయ వ్వల దొర బారిఁ గ్రోంచి మన, వంత యొకింత దలంప దిట్టిరే యుల జడిగెట్టు భోర్తు చుక, టా యకటా! వికటంబుఁ జెల్లునే? ౭౯

ఉ. నెచ్చెలి ప్రాణవల్లభుని, నింక ముదంబున గాంచి మచ్చికన్ ముచ్చట సల్పెనో మనము, మోహము గొల్పిక రుంగఁ జేసెనో మెచ్చియతాను గూర్మితమి, మేకొనె నోపున సీకపక్కనో హెచ్చెను మచ్చరంపు వెత, లెట్టుల మట్టుల నిల్పువారమో. ౮౦

చ. జగదభిరామ మూర్తియగు, చంద్రకళాధగ నందనున్ ధగ ద్ధగిత చిరత్న రత్నరుచి, ధారలు మీరలు మీర యక్ష పన్నగ సురసిద్ధ యోగానత మ, నత మతాంత నితాంత మోహమై జిగిదగు గాత్ర తచ్చరణ, సేవనుఁ బాత్రత గాంచి యుండఁగా. ౮౧

చ మనమున విస్మయంబు బహు, మానముతో నిడి వీనులొగ్గితా నిను గొనా ప్రాణవల్లభున, నేమని వేమన భాగ్యమై

మెఱయఁ దలంచునో తలఁచ, కేమను నోవిధినేఁతమెట్లొకో
మనసిజ వేదనాభరము, మానిత దాప్తికలుంగు టెట్లొకో. ౮౨

ఉ. ఇట్టివి యోగవారినిధి, నెల్ల తరింతుమొ యంచు గన్నెల
పుట్టున సంశయించుటను, భావ్యసుభోక్తి వచింప సాంగమై
దొట్టిన కూర్మినచ్చుమిను, తొయ్యలి నా గగనప్రచారియై
గట్టులలేని పట్టియతుఁ, గాంచఁగ నేగిన బోటివచ్చెనన్. ౮౩

—✻ కళావతి, నాయికలకు, నాయకుని, విప్రలంభమును విన్నవించుట ✻—

చ. చెలువుని దంటకేగియుబె, చేడియవచ్చె నటన్న నంతలో
నిలువున సాత్త్వికోదయము, నెక్కొనఁ జిత్తరుబొమ్మ యట్లయ
న్నెలతలు సమ్మదాంబునిధి, నివ్వెఱ నొంది యనన్య వేదనా
వలిత మానస్కలై ప్రియసవి, వర్ధిత సంస్మరణాను రక్తిచే. ౮౪

చ. మనసు ప్రియోప భోగ్యమయి, మై విరహజ్వర భోజ్యమానమై
పనపడి యుండుచో నమ్మృత, వల్లికి నట్లనె దేవవల్లికిన్
ధనము సమస్తముం బ్రియును, దంతము దెల్పఁగ బోటివచ్చెనం
చనుశుభవార్తఁ దెల్పునన, జాతులకీరిది గల్గదెద్దియున్. ౮౫

చ. పెనగొను నాదరమ్ము ధృతిఁ, పేరిమిఁ గూర్పఁగ నించు కేనియున్
దనియని మానసమ్ము ప్రను, దమ్మున మున్గఁగఁ దూలియాఁడు క్రొ
న్న నలనఁ దప్పముల్విడచి, నాటుతమిన్ జెలిఁగాంచు వేడుకన్
జనిరిరు చక్కలన్ మునఁగి, చానలు కేల్లవలూత లివ్వఁగన్. ౮౬

క. ఎమకుఁగ నరుదెంచిన యమ్ముదితల చరణాబ్జములకు, బ్రమొక్కిభరమ్మా
మదనుని ధాకల కానుల మొదవుట గానెంచి బోటి, యొయ్యన వారిన్.

ఉ. అమ్మెడఁ గౌఁగిలించి విన, యప్రియ వృత్తిని గార్య సిద్ధిమీ
కమ్మెఁ బదుండ టంచు భవ, నాంతర తల్పముఁ జేర్చి చయ్యనన్
దియ్యని మాటలన్ సొలపు, దీర్చుచు మోములు గాంచి నవ్వుచున్
దొయ్యలులార! మీవలపు, తోడఫలించె నటంచు నంతటన్. ౮౮

ఉ. అచ్చటి కెట్టు లేగితివి, యమ్మహనీయవిలాస మూర్తితో
ముచ్చట లెట్లు సల్పితివి, మోహము గల్గి వధూల లావనన్,

దిచ్చనెఱుంగఁ జేసెనో కో, యెల్ల విధంబెఱింగించు మంచుఁడం
గ్రచ్చుగ నెల్లవారముగఁ, గన్నుల నవ్వుచు బోటి యిట్లనున్. ౬౯
ఉ. ముద్దియలార! యబ్బనన, మోహను నల్ల మెఱింగి చల్లఁగా
నొద్దిక చేసి కన్నియల, యోజనెఱుంగఁగ దెల్పిపోటులన్
గద్దరి తుంట వింటివిరి, కిట్టియలం బెడ పెట్టుపోఁకనీ
కిద్దఱిఁగావు మంచు నను, నిందలు బాపఁగఁ బోయివచ్చితిన్. ౭౦
చ. తలపులు సంఘటిల్లెనిఁకఁ, దాల్చి గొనుండని క్రౌంచభేదితా
నలపు మెయింబ యింబొదిగి, నాడను కప్రపుటాటి మొస్వయా
కులనడి పొట్లమందు నిచి, కూర్చిన బంగరు తమ్మిదాడల
వ్రేలుముల కంది యిచ్చి స్మితి, పీచుల నందఱిఁ దేర్చెనిట్లనున్. ౭౧
చ. నెలతల మిన్నలార! మది, నిండిన మోదముతో వినుండు క్రొ
న్నెల తలదాల్పు వేల్పుసుతు, నింగను పండుగ సేయుకోర్కె, తే
నెలతల వోలె నల్లుకొన, నెయ్యపుఁ గర్జము దేర్పమేలు చి
న్నెలుతల మున్కతాముదము నిండఁగఁ బొంగుచు, నింగి చేరఁగున్. ౭౨
ఉ. పువ్వుల పాన్పుపోలె మదిఁ, బొంగిపటాపటుత్రి నెక్కి కవ్వపున్
మవ్వపుగొండ దాటివిడి, మట్టుతరించి విరించి కొల్వునన్
జవ్వనులార! యచ్చటన, సాఖ్యమణీభవనాంతరంబులన్
జివ్వల దిండిలోనగుచు, శేషమునీంద్రులఁ గంటినోయ్యరన్. ౭౩
కం. లోకాలోకన పటుసు, శ్లోకాద్భుత దృశ్యదివ్య, లోకములందపో
లోకమహా గ్లోకజన గ్లోక సువర్లోకములులవి, లోకించితిరా. ౭౪
శా. దేవర్షుల్ గ్రహ సంఘముల్ సుకృతసు, ధిక్షేమ తారల్ జగ
జ్జీవాలంబన తారకల్ సురతతుల్, సిద్ధర్షి రాజర్షులున్
భావోత్తేజన వతుబు కుములుబడి, క్పాలాంత భాసికముల్
దోవిల్లప్పుఁగ దివ్యదీధితిభువ, గ్లోకంబు గంటింబుమీ ౭౫
కం. మాంగరకనక మహీధర, సుందరమై మెఱసెనటవ, సుంధర సుగుణా
స్పందరమా కందసమా, నందరసోల్లాసమైక, నందరసూనే. ౭౬
చం. జలనిధి శైలకాననవి, శాలనదీనద దేశపట్ట
స్థలజల తీర్థదేవగృహ, సారసకోవర దీర్ఘికా సమ్ము

జ్వలమయి యెల్లభోగముల, సర్వజనంబుల నోగ్యభాగ్యత
పులఁదని వొంటఁజేయుభువిఁ, దొయ్యలులార! జగత్ప్రపూజ్యమై ౯౮

గీ. పాపవృగానింగి యెడగల్చి, పుడమియెల్లఁ గన్నులకుఁ బండువుగఁ జూచి, కడు
ము దమ్ము
గ్రమ్మకొన నబ్బురము నొంది, కదలనీని తమకమునఁ జూడఁ జూడ నంతటం
దనర్చె ౯౯

సీ. కల్యాణగుణమయ, కటకప్రభాభాసు, రాదిత్యకాంతాప్తి, యతిశయముగ
కనదనంతమణిప్ర, కాశకూటస్థలీ, సరసవిద్యాధరా, సంగములను
నమృతప్రదానదో, హలవృషాకపివా, సోల్లాస సుమనోభి, యోగములను
నవిరతాశ్యానంద, నానుకూలసభాస, దానాసవరసుధ, ర్మాభికలన

గీ. నమరగిరివోలె భవ్యశో, భానుషంగ, సంగతంబగు నాకమషాణ, తుంగశైల
పజ్జాండ కటాహప, ర్యంతగగన, కర్పరాస్కందనములచే, స్కందమనఁగ

ఆ. వె. అట్టిట్టు కొనలగట్టు, చట్టుపలంటఁ గొట్టుకిట్టనెలవు, పట్టుచెంపఁ,
గొట్టినూఁకుపట్టు, ముట్టెనోయనుట్టి, కట్టనంబుగింటి, పణతులార! ౧౦౦

కం. కనమేహార హారివనజా సనవాసవ సభలువాని, చందముగాదే
వనజాసను నాటిదౌకో మనమెఱుఁగము కార్యవేళ, మనమునవయ్యెన్.

మ. వరణాగ్రంబుల మ్రోయుతూర్యపటహ, ధ్వానంబు లన్నింగియా
వరణంబుల్జిలుగఁ గర్వరదృఢా, వస్థాన సంసిద్ధికిం
దిరహస్తంభము నిల్పిరోయన, సము, ద్దీప్యన్మణీ దండభా
సురకేకిధ్వజ రాజ మత్తులరుమె, చ్చుల్గొల్పె నబ్బంబునన్. ౧౦౨

ఆ. వె. దానఁజేసిపుష్ప, ధానుష్కశతకోటి, సుందరుండుధైర్య, మందరుండు
బాహులేయుఁడేలు, పట్టణంబిదియంచు, నమృతవ నధినోల, లాడఁగంటి.

మ. మగరాగోడలకెంపు జాజురుచినిం, పన్ బచ్చగానేలలిం
పగుపచ్చతోరంబుల క్రుంగ్గుజగ్గు మెఱుయుం, పన్ మేడ లందున్నిగ
న్నిగతామేలిమి యోడుబిల్లలలర, న్నిద్దంపు టద్దమ్ములన్
జగమెచ్చొప్పుది సోయగంబుఁ బికిం, చన్ లోక సామాన్యమే. ౧౦౪

సీ. ఒకచోటనప్సరః, ప్రకరధింధింధిమి ధ్వనితదు ర్దమితమ, ర్దళరనంబు
ఒకవీధిబ్రహ్మర్షి, నికరపాపశితన ర్వాశివాద్వయత్రయీ, వాదగరిమ

ఒక యూర శ్రేణులై, శుకపరిచియ్యమా, నస్వరగ్రంధగా, నప్రసక్తి
ఒకచె తనానాని, ధోహపద్యాంకన ప్రకటితార్యాత్మజ, ప్రకట మహిమ
గీ. ఒక్కమూల సమస్తవే, దోపనిషద మేయసిద్ధాంత సర్వైక్య, తాయ ధోక్తి
ఇట్టిగంభీరగుణశక్తి, కిట్టలంబు, రాజశేఖరసుతమహా, రాజధాని. ౧౦౫

ఉ. మించుల సంచునొంచుజిగి, మేడలగోడల రత్నదీధితుల్
మించఁగరోద సింగలియ, మొండయిరేబ వలన్న మాఁటనొ
క్కించుక గానసీకజగ, మెల్లరజోగుణ వృత్తిఁగూర్పఁగాఁ
గ్రాంచనగారి వీకుగుణ, కల్పనరొడవ సల్వనాఁదగెన్. ౧౦౬

చ. అతలములోను గాఁగలుగు, నట్టిధరాంతర లోకముల్సయిన్
ద్వ్యతలములోను గాఁగలుఁగు, నూర్ధ్వమహోన్నత లోకముల్ జగ
త్త్రితియ ధురీణుఁడైనజగ, తీరథనందను వీటభూమికా
వితతులుపోలె నొప్పఁటుర, విస్మృతిఁజెప్పఁ దరంబె యేరికిన్. ౧౦౭

చ. అతితిమి రావృతంబులుధ, రాధరలోకము లంచుమానిసం
తతమువలంబ నావిరహి, తంబులునూర్ధ్వము లంచుమానియు
ద్ధతినుభ మైకయోగ్యతకు, దావలమైనటు లుద్ధరించిరీ
యతులిత మాపురంబనఁగ, నర్హదభస్తవ నీయమైతగెన్. ౧౦౮

ఉ. రోహణశైల రాజమువు, రున్నిలయత్వముఁ గాంచి యాతజా
తాహితవృత్తి మేరువున, హాంకృతిమాన్పఁగఁ గోరిసంభృతో
త్సాహామునంబురాకృతిస, తమ్మగనూనెన నాఁగఁబొల్చుపా
గాహరి వాహనోచితివి, కాసమునన్ వెలయుంబు రంబిలన్. ౧౦౯

క. సేనాని దర్శనార్థము, సేనాని వహాములతోన, శేషహరిత్పా
లానీకము బహిరావర, ణానీకము లందునిలచి, యభినందించున్. ౧౧౦

క. కన్నుల కానందంబగు, నన్నగరము సోయగంబు, లరయుచు నొకచో
నున్నత సౌధాగ్రముపై, నున్నయెడం బౌరవరుల, నుత్కళికమెయిన్. ౧౧౧

చ. పురమునన్నిమానిహర, పుత్త్రుఁడుదన్నగ రోపకంఠబం
ధురసన వాటికావిహృతి, ధూర్వహుఁడై వసియించి నాఁడటం
చరసితి నంతనయ్యుపవ, నాంతరదంతురి తాంశుమత్సలా
వరణములోని బోదియల, వాలికజొంపము లోవసించుచున్. ౧౧౨

ఉ. వచ్చుచుఁ బోవుచున్న పుర, వాసులముచ్చట లాలకించుచున్
రచ్చలు గానసించుసుర, రాజముఖామర పాళిఁ గాంచుచున్
నిచ్చలు సన్నిధానముగ, నిల్చునయస్స్వల రాకెనెంచుచున్
హెచ్చినకోర్కెఁ జేదలఁపు, లీకలెత్తఁగ నున్నయత్తరిన్. ౧౧౩

చ. జయవిజయాభిధానలగు, శంకరగేహిని నెచ్చెలుల్మనః
ప్రియమున నంబపంపువన, భేద్యమనస్కుఁడు గ్రౌంచభేదికిం
పయిన ఫలాళి యందుకొని, యచ్చటికింజను దెంచియిచ్చి వే
పయనముసాగి పోవుతఱిఁ, బజ్జనసించుచుఁ గంటివారలన్. ౧౧౪

కం. కనివారొండొరువులు, మంతనమున నేమేమియట్టి, తెఱిముచ్చటలో
య్యనవాఁళు దురోయనిమన మునుపుర్విళు లూరిమోద, మున నాలింపన్.

ఉ. వింటివటేజయా? నుడవవే విజయా! జయశాలిరైనము
క్కంటిసుతుండు దిగ్విజయ, కాలమునందు వికుంఠధామము
దంటిననంటునన్ సరసి, జాక్షునిబిడ్డలఁ జూచి కంతుసం
లుంఠిత చిత్తవృత్తియయి, లోఁబజియెన్ విరహార్తిఁ దూలుచున్. ౧౧౬

ఆ. వె. సకియయమృతవల్లి, సౌందర్యవల్లుల, చక్కఁదనము మనము జననిగారి
యొద్దఁదెలియువార, లుగ్గడింపఁగమువిదు, విందుమేకదమ్మ, యింక కేమి.

చం. తనకొడుకీవిరాళితను, తాపమునన్ జపియించుటాత్మలోఁ
గనిపతి యాజ్ఞచేఁగదలి, కాంచలచేలుని యొద్దకేగి నా
దసలను వేఁడఁబోవునట, తామరసాయత నేత్రిగారియి
య్యనుపమ మోదవారినిధి, యందుమునుంగఁగఁ గందుమిన్నొయిన్. ౧౧౮

గీ. కలికి! దీనికిఁ దార్కాణఁ, గంటివటవె, మనము ఫలము లొసంగుచో, మనసు వేఱు
తలఁపుతోనుండెఁ గానియు, త్తఱి గుహుండు, చనవు మునుపటివలెఁ జేయఁ, జాలెనటవె. ౧౧౯

చ. అనియని వారిత్రోక్తుల జ, యావిజయాంతిర హాస్యగోష్ఠిలో
వినివిని వేశితాత్మనయి, వేడ్కలు తీనెలు సాగమెల్లనం
జనిజని తాను నాగమునఁ, జందనతుందిల కుంజపుంజరం
జనజన హృద్యమైన యొక, చల్లని కానల కోనలోనికిన్. ౧౨౦

గీ. పోవఁ బోవఁదు, భువన సుందర దివ్యరత్నఖచిత భవన, రాజమొకండు
ప్రాతయుదిత తరణి, భానుసహస్రసం వలితపూర్వశైల, కలనఁ దనరె. ౧౨౧

ఉ. అందముగ రత్న రత్నఖచిత, తాధర భూమికం దత్తదంతరా
ళిందములన్ బచాడభట, లీలలు తుంపెసలాడం బొంది య
స్పందమనోజ్ఞ సౌంధవరి, చారిక యందము నొంది కేళికా
మందిర సీమఁ జేరిరి స, మందము, దంబుధి నోలలాడుచున్. ౧౨౨

చ. మనసు విశాల్ మాలియె, కిమన్ముహ నిల్పమి నిందిరంబునం
దనస విధంబు నాదనుఁగు, తండను లేమియు లేక యొంటిమై
ఘనతర రాజయోగలయ, ఘటితగాఢ మనోన్మనీవశ
మ్మునం దపియించు యోగిగతి, మొక్కను వేలుపుం బట్టియున్నెడన్ ౧౨౩

—* శ్రీకుమార స్వామిం జూడ నారదుండే తెంచుట. *—

సీ. నాసాగ్ర భాగవి, న్యస్తలోచన వృత్తి బ్రహ్మము సన్నాన, పదవిం దెలుప,
అంగసం సంగిత, స్వాంగ శాంగద్యుతుల్ నిజకళా స్ఫూర్తితో, గజబిజింప
మారుతాహతిఁ మ్రోయు, మహతీస్వనము సేయు ప్రణవనాదంబుతో, ననుకరింప
స్ఫటికాక్షమాలికా, వలయద్యుతులుహస్తనఖశిఖాచ్ఛవులసం, దడులఁగలయ,

గీ. మహితగంగాంబుపూర్ణక, మండలుప్రశస్తహస్తంబు మెఱయునా, శాస్యసిద్ధి
ఘటనకుతుకైకతానుఁడై, కదలియచటికమరమునివచ్చెఁ గేకివా, హానునిగనగ

క. తెలిగంటి తపసియచ్చటి కరుదెంచిన వార్తఁ దెలుపు, నంతనచరునా
క్కరు నంపితోడుకొని చనికరమతి గౌరవముభక్తి, గడలుకొనంగన్. ౧౨౪

క. నవరత్న పీఠసత్కృత్సవమున గూర్చుండఁ జేసి, సాంగసపర్యా
వివిధోపచార ములనిడి యపుడా వేల్పు గద్దియన్ గుహుఁ డుండెన్ ౧౨౫

ఉ. వేలుపు మౌని యభ్యుదయ, విశ్రుత విక్రముఁ గాంచి మందహా
సాలలితాస్యుఁడై శశిధ, రాత్మజ! తావక దర్శనాప్తి యు
ద్వేలముదాప్తి నించెఁ బని, తృప్తతపః ఫలమెల్ల నబ్బె మ
చ్ఛీలము సార్థమాటపరి, శీలితమయ్యె భవత్కృపాప్తిచేన్. ౧౨౬

చ. అనుటయుఁ దాపసేంద్రవిను, మాయను మానమిఁ గేలుదేవతా
మునిజన పుణ్యమూర్తివిన, ముజ్వలతావక వాక్సుధాభిషే
చనమునఁ దెల్పెఁ గాంచె మది, సంభృతపుణ్య ఫలంబులబ్బెనీ
యనుపమ దృక్ప్రసారము సు,ఖాంబుధి వీచిక మమ్ము ముంచెన్. ౧౨౭

చ. హరుకరుణైక భాజనము, లార్యులు మీరిటు లేగుదెంచుటల్
బరమపవిత్రమయ్యె మఠ, మారవిభూతి శుభాళిశోభిలెన్
జిరసుకృతంబు లుల్లసిలె నేనును మీకు భవత్ప్రపత్పరం
పరలుననంత రాయతను, బాటిలునేమి సివర్య! చెప్పుమా. ౧౨౯

చ. అనవిని పూని యిట్లనును, రాత్మజు శోభన దీయ భావతం
గనిమను చూను వారిసు, ఖబళుగాక కొంతి తేమిసీ
యనుపమ విక్రమానలము, హర్నిశముల్ ఖలకర్మ్య క్రియా
వనపటలిన్ దహింపఁగన, పారకృపారస లోచనాంచలం. ౧౩౦

క. అనవరత తపఃకలనా, వినివేశిత చిత్తవృత్తి, వేడుకఁగొనసీ
యనువునఁ గాలముజరిపెద ననఘ! భవత్కారుణ నాకు, నభిమత మొసఁగన్.

ఉ. అన్నిటలెస్సగాని మఱి, యన్యమెఱుంగను నేఁడు సంశయా
పన్నమువోలెఁ జిత్తమొక, భంగినయున్నది తాపకీయ భా
వోన్నతి నీదుగ్రమ్ముజ్వల, నోపమమయి గుదియించె బోధముం
గన్నది తెల్పుమిత్తఱిని, కాసముఖాంబుజ వాగ్విలాసినీ. ౧౩౨

ఉ. ఎన్నఁడు నాత్మతంత్రతన, హీనమునీమొక నేఁడుదోఁచనీ
కున్నది యన్యచింతసలు, పోపమిచాల దశంబు సాత్వికో
త్పన్న దశావశాకృతిన, పారచలాచల భావసూక్ష్మమి
మిన్నక యుండ ఘోటికిని, మేయరసాస్పద లేపమయ్యెడున్. ౧౩౩

క. నడలఁగనుదులం బాడమెదు, వెడవెడ యూరుపుల మోము, వెలిసిగ్గులనై
తడబాటుల బాటిలునిదె, వెడనిలుచే బరపు వేఁడి, వేటుల తెలిఁగుల్. ౧౩౪

మ. సుధన్వద్యుత్రి హిరణ్యాండ తండములనెం, చర్మవ్యోమ పుష్పోపముల్
తరుణీకోటులు నీకునందమునకున్, దాసీగణప్రాయులై
వ్యవసర్గ సీతలఁ పెట్లో యట్లయగునె, వ్యారడ్డ మూవారలి
కృపరణిన్ వేఱతలంపు లన్మరుగశం, కాతంక మింకేటికిన్. ౧౩౫

ఉ. మానుము స్వాంతచింత, తిర, మాభరమా పరమాదరమ్ములో
నూను మొకింతి తెల్పుమని, యుక్కఁడమంతయుఁ దానెఱుంగన
ట్లానుడి దేవపూనిమన, మారయఁ బల్కిన నల్లనవ్విసే
నానిపచించె మోదకల, నావలనావిల నానమైఖరి. ౧౩౬

మ. మునిచంద్రా! సకలార్థవేత్తలుజగ, న్మూలాస్వహాస్యావలో
కనసంభూత చరాచరాత్మకగుణా, గ్రామముల్ జగద్భావనా
వినివేశమ్మున గోచరింపనిగుణా, వేశంబు లొందెవ్వి? మీ
కనుమానప్రమలేల సర్వమునుజ్ఞా, తార్థంబె యింకేటికిన్. ౧౩౭

ఉ. నామదిఁజూడఁగోరి యిటు, నాటఁగ నాఁడుట గాని చింతయొం
డేమియులేదు ప్రాణిహృద, భీష్టఫలప్రదుఁ డీశుఁడన్యచిం
తామహితత్వ సంపదనె, డంగదియించిన నొందుటెట్టిమా
యామననంబునన్ మదికి, సాఁగడదేహికి నైజమగ్నతల్. ౧౩౮

క. అనిమానసీకయ యుచితంపు టనుపులగోపన మొనర్చి, రాఁడట మునితా
మనమునసారసి గౌరవఘనతన్నా యెడగణించె, గాగుహుఁడనుచున్. ౧౩౯

ఉ. నీమదిధైర్య దార్ఢ్యమును, నీపగణించితి నెంతయేనినీ
ప్రేమమునిండి యున్నదొక, ఓత్తరపుత్వల నంతసేమహా
ద్దామత నీవెఱుంగకవు, భాజనమాత్రునివోలె పోలెదిం
కేమికొఱంత నీతలఁపు, లెల్లఫలించు గిరీశనందనా. ౧౪౦

క. నీవుతలంచిన తలఁపు, ద్దేవతలుంబెద్దలెల్లఁ, దీర్చిరిగానన్
వేవెతలఁ దలంగుమసిరి, గావుతమని నుడివితివిను, కంబుగుమీఁదన్. ౧౪౧

క. శ్రీయుతులౌ లక్ష్మీనా, రాయణులిర్వురును మనసు, రంజిలినీకున్
శ్రేయఃప్రదముగఁ గన్నెల, నీయాలోచించి రభిమ, వేష్టముగాగన్. ౧౪౨

శా. ఈకర్జంబు వికుంఠధామమునల, క్ష్మీశావరోధంబునన్
పాలికల్యాణము జెందెవింటిమిభవ, ద్భాగ్యంబు భవ్యంబుగా
మాకుంబంధుఁడవైతి వింతకుమమున్, నన్నింతుంహో యెంతుహో
నీకుంజిక్కితి మెట్టులైనఁదగదే, నిక్కంబు మేలెంచుమీ. ౧౪౩

క. ఈమాఁట నీకుఁదెల్పితి, సేమముఁగను మిపుడునీదు, చిత్తము దేర్పన్
గామినులు నమృతవల్లియు; గోమలిచెలియలును నెనరు, గొనుసకిచేరన్.

క. సందేశముగానించిరి, సందేహమువలదటంచు, జతురతవెలయన్
బృందారకముని నుడివిను, మందానందమునస్కందు, మదిబారలించెన్.

క. అప్పలుకుల యర్థంబులు, తప్పకమది నరసిగుహుఁడు, ధైర్యము తనలో
మప్పిఁగొనఁడుమకడలక్, దెప్పగఁదాముని యటంచు, ధీరతనొంచెన్. ౧౪౬

గీ. పోయివచ్చెదనని తెల్పి, భువనభూష ణుండు నారదమౌనియు, నూనభక్తి
నిందుధర నందనుఁ డొనర్చు, నిష్టపూజలంది స్వేచ్ఛానువర్తియై, యరిగెనపుడు.

ఉ. వేలుపుమౌని యంతసము, పేతయథాగత వృత్తియైననా
ఫాలవిలోచ నాత్మజుఁడ, పారమనోవ్యథ మున్నువిన్నయ
య్యాళిసమాగమంబునకు, నాసలుగొల్పుచు నుత్సుకత్వలీ
లాలలితాస్యుఁడై తృణచ, లాచలముల్ భ్రమగొల్ప నాత్మలోన్. ౧౪౮

చ. తపసులువారి మాటలుయ, థార్థము లింతియకాదువారిలోఁ
గృపగలవాఁడు దేవముని, కేవలతత్త్వ పదార్థచింతనం
బపరిమితంబు తద్వచన, మన్యపథప్రతిపన్నమేలయా
వ్యపగత సంశయుండనయి, యాత్మసుఖంతు సమర్థనిశ్చితిన్. ౧౪౯

ఉ. ఆదరణీయ మాగదమ, హాత్ములువారి యనన్యలభ్యముల్
వాదనమాంబు నైతగిలి వచ్చినసౌఖ్య కరంపుఁబోజమొం
డేదివిచారణీయమెద, నెంచ సఖీమణి వచ్చుమేలుని
ర్వాదముగా లభించునని, వస్తుగతిన్ గుహుఁడెంచు నంతలోన్. ౧౫౦

—* కళావతి కుమారస్వామిని దర్శించుట. *—

గీ. అతిర సాలాన్వృత్తి నేకాంత, మగుటఁ దెలసి, సకియయును సంధికిచియసూ, స
మయ మునుచు
మింటిపాడకట్టి పురమిపై, వెలసినిలుచు, మించునానిల్చె గుహునివి, క్షించి
యెనుర. ౧౫౧

చ. కలితమృణాళ నాళలతి, కాయతమైన మరాళిపోతము
జులతరతార హారసరి, శోభితహస్త సరోజమైనము
జ్జ్వలముఖ చంద్ర దీధితుల, చందమునన్ నవమందహాసమిం
పొలయఁగఁ జూచ్చికొన్ వెరగు, నుబ్బును దోఁపఁగ నల్లనల్లనన్. ౧౫౨

ఆ. కరములెత్తి మ్రొక్కి, కరుణారసాస్వాద, భరము చూపు గొనలఁ, బట్టుగొల్ప
మనసులోన నిండు, మన్ననఁ బురిఁగొన్న యనువు దెలసి చేర, నరిగి నిలువ.

గీ. మనసి జానల జాజ్జ్వల్య, మానమాన, సముల్లసత్తు శిశిరోష, చారసుఖవు
నోఁ చెఁగన్నులఁ నల్లనై, యొడలు లేచ పడల సుధసోనలో మున్గి, నవసదోఁచె.

ఉ. ఎవ్వరి బోటివో? సరసి, జేకుణ! యేకతమున్న మాకునై
యివ్వన భూమిఁ గ్రుమ్మరుచు, నేకతము న్నడిఁగోరి వచ్చితో
మవ్వము రామణీయకము, మానుషమై రమణీయ మయ్యెనా
కవ్వల రాచరాచ దొరగ, కర్నాజ యాబు లొసంగు శక్తివో. ౧౫౫

క. సురమానినివో? లేకా, సురకామినివో? వి, శేషసుష మానహాసు,
దరరూపరేఖల నసుం, ధరగ్రుమ్మరు విపినదేశ, తామూర్తివో కో? ౧౫౬

క. భవదీయ వాక్సుధారస, భవమాధురి శోకపైక, పరుషధ్వనులకా
జెవుడుపకు నానుపీనుల, కవరుచివోఁ జేసి తెలుపుమా మితసూక్తిన్. ౧౫౭

చ. పలుమరు నిట్లు నల్కుశిఖి, వాహాను హాసవిలాస వక్త్రనై
పులక సముద్గ మస్ఫురణఁ, బొందఁగఁ గన్గొన రెత్తి చూచి యో
జలధిగభీర! యేనసుర, సౌరవ ఘూటుల లోనిదానఁగా
నలవన లక్ష్మిగాను గసు; మాకుక శక్తినిగాను చూడుమీ. ౧౫౮

క. అనుచుం బల్కుచు నెమ్మేయి, జనితములగు పంచశరద, శాగతులమెయిన్
మనమిమ్మియివిస్మృతి గుహాఁ,కస యతమోహాన్ధమున్నఁ, డగునసిత్వరతోఁన్.

వ. సత్వరంబుగా నిట్లని విన్నవించితి, మహానుభావా! యేనుజలధినందనీ
నయనారవింద భువనబాధ వుండును ఖగరాజ సైంధవుని ముద్దుకూఁతుల
గు నమృతవల్లీ సౌందర్య నల్లులకనుగుటిలు పుట్టు చెలి త్తియుం గా నెఱుం
గుము. బహు సహస్ర సఖీజన మధ్యంబున నన్నుగల కంఠీ నాపుంబున మ
న్నించెదరు. మద్వియోగంబున ననేకనాడికా కాలంబు కల్ప కల్పంబుగా
శరపువంత విడరాని నెయ్యంబునను పలాలింతురు, మఱియుం బ్రా
ణాంబులకన్న నతిమధురంబైనను నాకుం దెలుపని యన్యోన్యాంబెఱుంగని మన్న
నలం గన్నుల వింటివాని యానఁగా ను న్నతురు. కావున నివు దిగ్విజయయా
త్రాకాలమ్మున హాధామంబున నతిపురంపు నోర్డోల గంబునఁ దండ్రిచేరు
వం గన్నెలు గూర్చున్న యవసరమ్మున విూరచ్చోటికిం జతుర్భుజదర్శనార్థం
బరు దేంచఁ జూచినది యాదిగా భవదీయ రూపరేఖా విలాస వైభవం బకల
న్నియల మనోమీనమ్ముల నాకర్షింప మహా జాలంబై, భ్రమసిగొల్పుట వలన
సమను భూత సకలసాత్త్విక తత్త్వం బొకట రె ట గొఱుతగా నొలసిన స్వా
స్థాపి వేదనంబునకై నన్నట: బుత్తెంచిరి. అభంగుర విరహ పాండిమంబున
నస్మృతా స్వాదనంబున నైనను రుచినింపమి చేవం విధాను భావంబున బ్ర

వర్తిల్లెదరని సూచించి యుత్తారకారి కంధరా పీఠంబున దాపక సందేశ సముదారంబుల నిముక్తాహారంబులునిచి నమస్కరించి కరంబులు ముకుళించి నిలిచితి. ౧౬౦

ఉ. రాగరసంపు మూర్తులన, రక్తిమ నుగ్రమ్ము విశాలనేత్ర దృ
గ్యోగ మొసర్చి యయ్యెడ న, యోగభరజ్వర వేదనావశ
ప్రాగుది తొంగ ఘర్మజల, పంక్తులు గంధ జలార్ద్రి శాటికా
భోగమునం దెకల్చుచు న, భూత్కృత నిశ్వస న.పు బెల్లునన్. ౧౬౧

గీ. కెలుపిం జూపని యలయికల్, దిపుర లేచి రత్నపీఠంబుడిగి, పువ్వరచితమైన
సెజ్జపై మేను జేర్చియు, చ్చింత నింత సంతనెన్నాగు లేకుండ, నరసి యరసి.

మ. కలకంఠీ! యిటురమ్ము నీపలుకు ను,త్కల్యాణ సంసూచ నో
జ్జ్వలమంత్రావళి వోలె బీజగఘటనా; చ్చాళుక్యముం జెంపె సం
కుల సంకల్పన చోత్సవంబు వెలయస్, గోత్రాలి భూతింజలా
చలభావిప్ర ముదాభియోగము యిష్టంబాప్త మయ్యెంజుమీ. ౧౬౩

మ. నెలతా! నీసహకార వర్తనము ర్వాణించెన్ సదాభోగ మం
జులతల్ గొమ్మలకున్ ఘటిల్లెఁగద మె, చ్చుల్గా మరున్నండ లో
చ్చలితాను గ్రహముల్ బోసంగెఁక నై శాఖాను కూల్యంబయై
కలకంఠీ లలితాంక సార్థకత చొక్కంబయ్యెసం చెన్నఁగన్. ౧౬౪

చ. అలనాఁడంతి పురంబులోన జలజా, స్యల్సిద్ధుకై దండలు
గలమంజీర ఝుళం ఝుళధ్వనులు మ్రో, గన్ వచ్చురాయంచలం
దలఁగఁ జేయఁగ లేచిపోవు తఱిమ,త్స్వాంతంబు వెన్వెంటరా
దొలఁగందోయిము నచ్చటన్నిలిచెఁ ద,త్సూచ్యంబు మచ్ఛేయమై. ౧౬౫

శా. ఆహారమ్ములుగేరి మిత్రిచతుర, వ్యాహారముల్దూరి ప్ర
త్యాహారమ్ములు మెచ్చి యంతనరి సం,హారమ్ములన్ జొచ్చిలో
నీహారంబులు నెండ వానలన కెంతేఁ గాసిఁ దూగాడున
స్నేహామ్ములు గూర్చి తేర్చి రిగడే, యుండింది రాభాలకల్. ౧౬౬

చ. అనికను దమ్ముల్దునెడ, న్రసు పరంపరలంను పుంచి యొ
య్యన సకలాంగ మర్శనము, లంను ముహుర్ముహురుద్ధఘర్మ వా
రివి బొరలించి హారములఁ, బ్రేమర సాంబుధి నోలలార్చ ని
న్వాని తలపై విశాలి నెన్, వందురు తంధరఁ దీర్పనోయునన్. ౧౬౭

ఉ. హారములార! మద్విరహ, జానలతాప నివారణ క్రియా
ధారములార! రాగర స,దన్విత మద్దయి తాకుచాంతర
స్సారములార! మిమ్ముఁ గొన, సారశటీర సుగంధ చెర్చలం
గోసుపాణు లంజనువు, గూర్చి చవుల్ నెలకొల్పికే చెలుల్. ౧౬౮

మ. జలమధ్యంబున శుక్తిసంపుట గుహా, సంవాసముం జెందిని
శ్చలసూత్రాత్మని గూఢ వృత్తి భుజియిం,చెఁ గ్రుచ్చి పూబోండ్లు ర
స్సలులం జేర్చి రితద్వియోగ మెట్టులో,చ్చన్వచ్చు మతిస్వాంత మం
దలి వేణుల్గల రందు గాంచుఁడవు, నాయట్లక్కుఁ జేర్పు న్నరుల్. ౧౬౯

ఉ. ఇంతహితంబు సేసినస,మీహిత బుద్ధిని నీకృపారసా
క్రాంతత మెచ్చు వచ్చెగల, కంఠి! లతాంగులు మద్వియోగచిం
తాంతరి తాంతరంగలయి, యక్కటమోత భ్రమించి రొక్కొ మ
త్స్వాంతము జంచు నించువిలు, దంటనెలంతల నొంత సేయఁడే.

సీ. పలుకు చక్కెరలకై, పగసేయు రాచిల్క తండంబులకు నెంత, తలకిరొక్కొ
కంఠమాధురికినై, కలుషించుగండు గోయిలగుంపులకు నెంత, గలఁగిరొక్కొ
చికిలి జూపులకునై, చేరి బారులుదీరు తేఁటిమూకల కెంత, తెఱలి రొక్కొ
మేనిలో వలపు నగ్గిలిగమ్ముఁ గొనవచ్చు మదలగాలికి నెంత, బెదరిరొక్కొ

గీ. మత్కృతంబైనయీజాలి, మమతసోలి ముద్దుగఁజుట్టినవిరాళి, ముదముదూలి
కనకగముమాలిమరుఁడపై, కొనిశరాళిఁ జెనకపసి బాలికలు పూల, సెజ్జఁ ద్రాలి

మ. రమణీ! నిన్నిటు బంపువేళ లలనా, రత్నంబు లేమేమిలోఁ
దమిపల్కొత్తఁగ నాడిరో కలుగు సిద్ధంబౌత యుందెల్పు మ
క్కమలాక్షీ హృదయేంగితజ్ఞవుగుణా, కల్పంబ వీనూత్నసం
భ్రమసంకోచమిఁ కేలన్వ్యాకరగత. ప్రాణుండ నింకేటికిన్. ౧౭౦

గీ. సచ్ఛతి వహేతు కరుణాల, వాలవేల నానమూనంగఁ దెల్పుమా, నానమూన
వచనరచనలమాయూర, వాహునొద్ద నంజలిఘటించి యిట్లంటి, నమ్మలార.

—* అమృతవల్లీ సందేశము. *—

చ. సరసశిఖామణీ! జనక, సన్నిధి నిఁగని నాదుడెందమున్
విరిభవ దంష్ట్రిఁ జేర్చితిన, నింద్యదయామ యదృక్ప్వరంపశా
ఝరములనోల లార్చికర, సారసమన్మను రోజమండలాం
తరమున నుండీ నాకభియు, దానమొసంగుఁడు వేయునేటికిన్, ౧౭౧

చ. స్మరశతరూప! నీచరణ, సారసయుగ్మము నాశ్రయించితిన్
పరమశివ ప్రకాశమున, నాతెలితేనియ సోనవానలన్
బరిణత చుంబ నంబులను, మాత్రముఁ దీర్ఘముచుఁ బ్రసాదమున్
గరుణ నొసంగి సద్గురుని, కైవడిఁ బాపములార్పఁగాఁ దగున్. ౧౬౫

చ. పరమదయాంతరంగ! నిను, బాయని మేషము కల్పకోటిమై
పరఁగెడు నవ్విలోకనము, పారళృపారస భావ్యమయ్యెనే
కరణిని నాత్మవశ్యలగు, కాంతల నాయతి గాగనాత్మలో
భరముదలంగఁ జేయుమద, పాయము పాయము భోజ్యమై తగన్. ౧౬౬

క. ఈపలుకు లమృతవల్లీ, పాపతిలము లాంబికేయ! పరికించు మనః
కోపడములో సంకల్పజ, తాపజములో తపఁశిలిని, దానమునీకున్, ౧౬౭

—* సౌందర్యవల్లీ సందేశము *—

క. సౌందర్యవల్లి చేసిన, సందేశము విన్నవింతు, సరససుధా ని
ష్యందద యారసలహరీ, తుందిలమగు మానస, సంబుతో, వినుమనఘా. ౧౬౮

ఉ. నీచెలువంబు గాంచి రజ, నీచరభీకర భానుమండలీ
గోచరితాంత రంగనయి, ఘూర్ణిలుఘోరవి యోగజ జ్వర
వ్యాచకి తాయతిందలచు, వంకురితందర నెంద తొందరే
నీచెలు లాగిపట్ట భరియించితిఁ బాచితి బోటి నేటికిన్. ౧౬౯

శా. ఏకద్విత్రి దినావధిన్ శతసహ, స్రేందీవరస్నిగ్ధసా
లోకత్వద్వద నేందుమండలసమా, లోకంబు గాదేనియా
లోకాలోక జగత్ప్రచండ బిరుదా, ఖేల్ మోవియు నేతెంచునీ
భీకృన్మంద మరుద్వవార్మ్యలకునా, వేదింతు మద్దేహమున్. ౧౭౦

శా. భక్తత్రాణధురీణ! నీకుఁగరుణా, పారీణతల్ నైజముల్
భక్తిన్ రక్తిని సక్తినిన్ జరణసేవా, వాంఛనట్లుంటినీ
ముక్తాహారము వోలె నీయురమునన్, మోదింపఁగా లేసచో
ముక్తాహారమునై భజింతుఘనసీ, ర్యుక్తాంబ రాఘాత్మమున్. ౧౭౧

క. ఆతెలివలు పలికినను కు లీ తెలుఁగులు, నేనువచ్చు నెడ నెడలీద
త్యాతతమై యష్టమదశఁ జేతోగతి నరసికిరుణ, నేర్పఁగవలయున్. ౧౭౨

మ. తలిరుంబోణుల పారతంత్ర్యములతో, భానుష్మదోశ్శక్తిగ
ల్గలరాచండకర ప్రతాపముఘటిగా, పాంథాళి వాలింటికిన్
బ్రళయంబోయను మందమారుతముసం, భావింప నుత్పాతసం
డలినాఁదోఁచెఁ ద్విజేకజీవనలుచూ, డఁ జేడె లూహింపఁగన్. ౧౮౩

ఉ. మాటలు వేయునేల బహు, మానముతో విరిబోణులన్నరా
ఘాటకృపాంత రంగగుణ, ఘట్టితదివ్యభవద్విలాపసం
ఘాటసుధాంబురాశినవ, గాహ మొనర్పఁగఁ జేసియేలుకో
మ్మాటవికాబ్జ దీధితుల, యందమునొందఁగ జేయకేశ్వరా. ౧౮౪

క. అనిపలికిగమనసూచన జనితోత్సాహమునఁ గొలువు, సండడి మొక్కిం
తను వెజ్జిఁగి కనఁగఁజేసిన మనమున మద్దైన్యరసము, మానం జేయన్.

చ. తలఁచిపునో జతాపశిఖ, దారులువారు మనంబుదాల్మియున్
జలువనోకిత ప్రమాన్పలచి, ఝమ్మునఁదుమ్మెద లాడుతమ్మిపూ
దలగడ నూతజేసుకొని, తల్పముపైఁపమిఁ గూరుచుండిచే
క్కులఁజెయి పెట్టిపల్కెరస, ఘూర్ణితదృక్ఛవు లుల్లసిల్లఁగన్. ౧౮౬

గీ. తమ్ముగనుటమమ్ము, మమ్ముగాంచుటదమ్ము గుందకుంతములను, గ్రుమ్మిమురుఁడు
వలపుతేటనురులు, వలపైచిబేడస కొదముల ట్లకలయు, వదిమిగదిమె. ౧౮౭

గీ. పరులబుద్ధులకన్యగో, చరత లేమిఁ దమవలపుగొండయంతగాఁ, దలఁచుబోత
కానిపరులనుఁదమయట్ల, కాగవలదె, "యాత్మవత్సర్వభూతాని" యనఁగవినవే.

సీ. అంబుజాక్షునికొల్వు, టంతిపురంపుఁగోఁగనుసన్నఁగా దమ్ము, గాంచుమొదలు
పవలు రేలునునల్వ, పవలు రేలునుబోలె దమకమ్మునన్నుద్రోయఁ, దరముగాక
దృష్ట్మఖాత్మజదశా, ధీనమానసముతో నఖిలమ్మునరుచిగా, నాత్మఁదలఁచి
ఎనయుసేకుపులెవ్వి, యేనియుఁగానక విప్రలంభవ్యథా, విషశనృత్తి

గీ. బొరలుచున్నట్టినన్నుఁదేల్ప, బోటినేటి కరుఁగుదెంచితివింతమే, లమ్యోసుమ్మ
ఇంతకునుమేలువార్త్తరా, దేనిమకుసి వధ్యకోటకిఁదొలుదొల్త, వాఁడఁగానే.

క. కేకారవగర్జాధ్వని భీకరబర్హాభ్రనికర, పృథులంబైవ
శ్లాకాలము బలెనెన్కఁటు కేకింగని బెగడిచూడఁ, గినియుచునెప్పుడున్. ౧౯౦

క. రాకాహిమకరకరనిక రాకారము కాంతమమ్యే, నళిఘుంకారాం
గీకారము తేజమ్యేచు సాకారంబునవిరాళి, యలముటకతనన్. ౧౯౧

ఉ. కన్నులవింటివానివిరి, కైదువుపెట్టుల బెట్టిదంబుగన్
గన్నులకొల్కి మేన్వ్రేశము, గాక నెకానెకసారమైన వే
గన్నులవాసికైననుము, ఖాముఖయూనినుగ్రపసక్తి మ
క్కన్నుల వేల్పునై నంగనం, గాంజనంగా దలపోయ కేమియుర్. ౧౯౨

గీ. అంతమైనయంతకంతమై, యంతరంబుకింతయును లేక సంతతాక్రాంతమగుచు
నంతకంతకు వెగ్గలంబైన, కంతుచింతదాంతరమైయున్న, బాంతన మె. ౧౯౩

గీ. కానంగానననగచాంటి, కావికాస భాసమానాభిలాషినై, భావగర్భ
తాంతిరంబెవ్వరికినివో, నసహమాన వేదనంబొంచు దమకము, ద్వేలమయ్యె.

ఉ. చెప్పెడిదేమి ప్రాణములు, జీవము నెమ్మన మేకె పహాంమన
య్యెప్పుడుకుప్పలందెవసి, యుండుట గాని మఱొండు లేదునీ
విప్పుడువాయి పుష్పశర, వృష్టులమున్గంగ నీకకన్నెలన్
గప్పుము వేగ మత్కుశల, గర్భభవద్వచ నాతపత్రమున్. ౧౯౫

చ. స్మరకరవాల జాలముల, చందమునొదను నెల్లదృక్పరం
పరలంబరిక్షత బయిన, ప్రాణ్వడెనుస్తన మజరీమిళ
ద్వరఘరి రంభణ జన్మృత, వల్లిరో! జీవనదంబుపోల్కిబం
ధురతకమర్త్య పర్షముల, దోగగ సేయక నిల్వనేర్తునే. ౧౯౬

మ. తమిత్రోనీమధు రాధరాదరసుధా, ధారాసమాస్వాదసం
భ్రమవృత్తిన్నినుసింపు, కౌంగిళులంజే, ర్పంగల్గు భాగ్యంబునం
యమివాగ్రంథ నిబాధన గ్రధితమా, నయ్యోతి జీవంతమన్
స్వమతస్థాపక యుక్తి నమ్మియసుమీ, సౌందర్య వల్లీసతీ. ౧౯౭

క. అనిమనవిరి బోణులలో, వనుమసిమనసిచ్చిపలికె, వనిపలికిసఖీ
వనజాక్షితమ్మిడండలు, వనితలకంఠములయందు, వైచిమృదూక్తిన్. ౧౯౮

క. తమకంబిసువురి మెదనొక, ఘమఘమితమక మ్మృతవల్లి, స్వాయత్తమనః
ప్రమదక్షునం దమనవశులీ, యమకున్ సౌందర్యవల్లి, కనిమదిం దోంచెన్.

వ. అనికలకంఠి తనపోయివచ్చిన వృత్తాంతంబు సవిస్తరముగాం దెలిపిన నెల్లవారలు సంతసిల్లి యుల్లంబున నప్పల్లవాధరన్ మెచ్చి ప్రశంసించిరి. అప్పుడక్కన్నియ లిక్కువలు ససంభ్రమాలింగన సరసపరిహార చతురవచోరచ నాదులఁ ప్రేమాలంబనం బొనర్చి పల్లభుండాత్మ వశుండగుటకు సంతసించి యత్త

న్నివాడలు కన్నులనద్దుచును రమ్ములం బాల్చుచు విచ్చలవిడిం జెప్పు పెరిగిన
మోహంపు ముమ్మరమ్మున మునింగి. ౨౦౦

ఉ. దండలు కేలనందుకొని, తావులు గ్రమ్మఁగ దండనాథు కే
లండలుగాంచేఁ గాఁగలవ, లంబికతోఁడనె గగ్గెనంచున
య్యండజరాజయానలుకు, చాగ్రములందిడి కన్నుదమ్ములొం
డొండనుబట్టి చికంఠముల, నుంచితదీక్షణ బద్ధతృష్ణలై. ౨౦౧

ఉ. తమ్ములజాపఁ డంచుఁగను, దమ్ములనొత్తుచు గందు తేఁటిమో
త్తమ్ములు ఝమ్ముఝుమ్మనని, తావులు గ్రమ్మఁగ, మేల్కడానియుం
దమ్ములు పాణినాథభుజ, దండములేయని యాపరానిమో
దమ్ములఁ దక్కరగ్రహణ, ధన్యలమైతి మటంచునుబ్బుచున్. ౨౦౨

ఆ. వలపుగలిగి మించి, వారిలోసవసించి మిత్రసంపదలకు, మిగులనలరి
అమృతమూర్తి నొంది, యాత్మేశు నెద్దఁ జేరైనవారు విహారంబుచు నెంచి

క. రాజీవమ్ముల సరిదగు, రాజీవమ్ములను సిల్వ, రతిపతి శరనో
రాజీవమ్ములఁ దండబడు, రాజీవమ్ముల విధంబు, రాయిడిపడఁగన్. ౨౦౪

ఉ. తల్లికి నునిక్కపట్టులయి, తండ్రికి గగ్గన సొంపుఁ గూర్చరం
జల్లుమనన్న లిర్వురకుఁ, జిత్రసుఖాసన సర్వమర్దనా
త్యుల్లసనమ్ము గూర్చిన ప్రరోపకృతుల్ విభుఁ గూర్చువారలై
మొల్లమి మమ్ముఁ దేర్చితిరె, మోహనమాలికలార! చూడఁగన్. ౨౦౫

మ. అని సౌగంధికమాలికల్గని తదు, ద్యచ్చేతనాచేతన
త్వనిరూఢస్థితిఁ దక్కయుష్టము, దశా, వ్యాప్తిన్ మనోభీష్టసా
ధనవాంఛారతి నుత్సుకత్వ పదవీ, తామ్యద్ధృదంభోజలై
వనితారత్నము లప్పటప్పటికి దీ, వ్యన్మన్మథోద్దీపతన్. ౨౦౬

ఆ. వేగలేక మోహ, వేగపీడిత హృదా వేగలత్ప్రియాను, రాగజలధి
నాగలేకస్మరశ, రంగత జ్వాలనార్చి వేగవేగ నంత, వేసుజొచ్చె. ౨౦౭

—* ఉష్ణకాలము *—

చ. వలపుగ బుల్కొనన్ బోరలు, వాసనలన్, బయికొన్నమై యలం
తలతల మున్కలై యలము, దర్పక కృద్దశ మీఁదశావ శా

కులతలఁ జెందసికలత, కూనలఁగావగుసూఁడు రాగము
క్కలమగు తధ్వజధ్వనుల, కైవశివేఁకువ కోళ్లుకోయనన్. ౨౦౮

మ. సమయారాధ్యుఁడు పుష్కరాభ్రతటినీ, సంస్నాతుఁడై ప్రాక్ప్రభా
విమలాచ్ఛాదన మల్ధరించి కుముద, ప్రేంఖద్రజఃపాళిభ
స్మము భృంగాక్షసరుల్వహించి శివపూజంజేయఁ బూర్వాద్రిహ
స్తమునన్ స్ఫాటికలింగరీతిఁ దగెనం, తన్ వేగు జుక్కయ్యెడన్. ౨౦౯

మ. రజనీకాంతతమోగ్ర హారర్తతజకో, రధ్యానముల్ సేయుచున్
బ్రజలంభీతిల సేయఁగా హిమమహో, న్మత్తజ్ఞఁ డాత్మప్రభా
వ్రజభూతిన్ బలియిచ్చి పశ్చిమసము, ద్రస్నాతగాఁజేయసం
ఘ్రిజతం బార్చుచుఁ దోడ్కపోయె ననఁగా, రేజాతె రేరాజనన్. ౨౧౦

సీ. విటవిటీజనరహో, రటనపర్యుషితాంగ రాగఘుమఘుమసమా, భోగములను
సద్యోదళత్కంజ, జఠరరోలంబస మ్మర్దసౌరభరజో, మర్దనముల
విరహిణీసంతాప, కరఖరజ్వరసము చ్ఛ్వాసన సోష్ణసుగంధ, చాలనముల
చక్రవాకీమిధ, స్సంజల్పనావక్ర చక్రపక్షోత్క్షేప, సంభ్రమముల

గీ. పాంతగూద్భోధకీముల్తాంచు, బహువిహంగపక్షవిక్షేప నిష్ఠ్యూత, పల్లవాగ్ర
తుహినపరిరంభ సంరంభ, ధూర్వహములు గంధవహములు జగమెల్ల, గల
యనలమే. ౨౧౧

మ. అమలాహర్ముఖయోగితాంకరహ, స్వాభ్యాసిమై చక్రచం
క్రమనాడీకల నాభియోగములఁజో, క్కంగానధోవక్త్రతా
కమలంబుల్ దలలెత్తి విచ్చెనదియూఁ, గాదేనిసర్వర్ణనం
క్రమమున్ హాంస సుఖోపలబ్ధియుర, సౌత్కట్యంబు నాటిల్లునే. ౨౧౨

చ. పగలుసమాగమం బధిక, పాతకమందురు పెద్దలెల్లనీ
మగనిస్వభావ మట్టిదది, మానఁడుసీయని కన్నుమూసెనా
నాగముకుళించె నౌనదిప్ర, దోషసమాగమ మన్నబంటునీ
మగడవు గాదొయుంచునగు, మాడ్కినిదావికసించెఁ దమ్మియున్. ౨౧౩

గీ. దివికిఁదేజంబుతమురయిన, భువికిమేము రాజనందన గృహరాజ, రంజనముల
తరమెకావునననోక్షస్య, దైశ్యమెట్లు తప్పంనుమాద్రినుడుదీశ, తక్షులుమాసె.

సీ. కలకంఠకలకంఠ కాకలీకాహళా రవహళాహళికలు, తనువు నెఱప
సితగరుత్త్రేంకార, తతభేరికాధ్వనుల్ భృంగగానములతో, బెరసి మెరయ
శుకముఖద్విజకోటి, శుక్తి కోలాహల మవిరతోత్సవముగా, నందగింప
మాలతీమల్లికా, మహితవల్లీవధూ కుసుమోత్కరము సేస, కొమరుఁజెల్వ
గీ. చక్రవాక కరగ్రహ, సాహ వేళ నెదురుకోలకుఁ జనుదెంచు, నెడనమాల్య
నవదుకూలోల్లభము లెత్తి, నారవంగదిశలు చెలివొందఁ దూరుపు, తెల్లవఱియె.
చ. కువలయమాక్రమించియరి, కోటులనెల్ల దృణీకరించి కా
లవశతఁ దొంటిరాజు లెడ, లంగనినుండొకఁ డేఁచవచ్చుచో
నవతరహాటకధ్వజము, పాటిరసా ప్రథమాంశువొప్పెను
తనమణితోరణంబులన, సాగినతూరుపు ఠేట్టుచారికల్. తి.ర.

—* ప్రాతఃకాలము. *—

సీ. ప్రభాతీకృధ్వాంత, పంక్తి కంఠాన్వయో న్మూలనశ్రీరామ, మూర్తియనగ
దినరాత్రనిధివిధూ, ర్దివ్యలింగాకృతి జ్వాలమాలాకృతి, స్తంభమనఁగ
భువనత్రయీయజ్ఞ, పూర్ణాహుతీకృతి శుమముగ్ర జపకరుఁగా, చార్యుఁడనఁగ
విబుధలోకధురీణ, విస్ఫురత్సౌధాగ్ర ఘటితదీప్యద్రత్న, కలశమనఁగ
గీ. హరిహరిత్కామినీకుచా, తరచిరత్న రత్నరుచకప్రభావ్యాప్తి, రహిఁవహించి
మించుతొలిమించుగములరా, ణించునించు చండకరుఁడెక్కెఁ దూరపుఁ గొండకొనల
సీ. జేజేలరారాణి, చికిలికెంపులదండ గాలినెచ్చెలికల్కి, కేలుదమ్మి
జమునియిల్లాలిదా, సనపుఁబువ్వులగుత్తి తొలివేల్పుచెలిఁనుచెం, దొవలబంతి
మున్నీటిగాబోటి, మొనగోటిగోరింట పద్మేరనవరాల, బరిణెలక్క
జక్కులశేకొమ్మ, సందిటిబంతులు ముక్కంటిప్రోయాలి, మోవి తేనె
గీ. గానిజిగురెండగాదనఁ, గాజగమ్ము దరుణకిరణారుణాభ, సరణిఁదనరి
హరిదఖిశపుఁసర, పాంగణములు గలయబాలాతపచ్ఛాయ, లలమెదెసల.
ఉ. అప్పుడుజాగరారుణక, టాక్షములాతుల మీఁదఁజెందొవల్
గప్పఁగనప్ప డంతుకలు, గంతునిశాత విపాఠఘాటముల్
దుప్పులుడుల్పువాఁడురవి, తొయ్యలులీతనిఁ జూడజాలరో
యుప్పరమెత్తిరమ్మ సను, యోచితమూతల తాళపత్రముల్. ౨౯

క. తలవాకిలిఁ దియ్యకుఁడీ, తలసోరణ గండ్లవెంటఁ, దళుకుల ఝళుకుల్
తులకించెను కనిపెట్టుఁడు, తలకెదరవివేణులెట్లు, తా ళ్వదరమ్మా. ౨౨౧

ఉ. మారుసికోనలో ననదు, మల్లె దొ వడిగ్గియ చెంతఁగాల్యముల్
గామినులాచరించెదరు, గాతమటంచన నెట్ట కేలకుల్
భామినులల్ల నల్లవిరి, పాన్పులడిగ్గిల తాళపత్రముల్
గోమలులూపి గంబిడఁగఁ, గొందలముల్ సవరించి మెల్లనల్. ౨౨౨

క. ఆరామమధ్య దీర్ఘిక, నారాములు గాల్యకృత్య, మాన్చుచుగాకి
శ్రీరామాహృదయేశకృ, పారామతవలస్రశేము, మందెదమనుచుల్. ౨౨౩

క. కల్పములై నిమిషములా, కల్పములై నవమృగాల, కాండములతిసా
కల్పములై మినములుదృణ, కల్పములై జీవనములు, గడువా జొచ్చెల్,

క. అనియీకథ వినిపించిన, వినిపూనులు గుహునిమీఁది, వృత్తాంతంబుల్
వినవలతు మానతీవే, యనియడిగిన సూతుఁడిట్టు, లనియె మునులకుల్.

——* ఆశ్వాసాంతము. *——

శా. బాహాసాధ సుఖోఘలంభ సుభగం, భాపైక విస్రంభపా
రాహీరాడహి భూధరాష్ట కలభ, ప్రస్తావ నేచ్చాపము
త్సాహాక్షోణి తలాధిరాజ్య లసనా, సంరంభ గంభీస
న్నాహాసాహస విక్రమార్క జయసద్, భాకాళి దాసానుజా. ౨౨౫

క. ధాటీరా హుత్తరట, ఘోటీరింఖాగ్ర దళద, కుంతితకుతజ
శ్శాటీపరి పాటీకల, నాటీకిత పుష్కరాంబ, రాఖ్యశ్లాఘా. ౨౨౬

తరళ. రాజరాజ విభవ ఖచర, రాజతేజ ముఖజితాం
భోజభోజ చతురగుణస, మాజమాజ సుందరా
రాజరాజ దతులకీర్తి, భాజభూజ నాప్తగో
రాజరాజ మానధర్మ, రామచంద్ర నందనా. ౨౨౭

## గద్యం.

ఇతి శ్రీమదుభయ భాషారసజ్ఞ ...ష్ట్రాగ్ర నృశ్యన్నాట కాలంకార
గ్రన్థాన్ధ్రప్రబన్ధ బన్ధుర కవితానిబన్ధన శ్రీమద్వేము నారాధ్య
వంశపయః పారావార రాకా సుధాకర (ములుగు) శ్రీ
పాపయారాధ్య విరచితంబగు సరసహృదయానంద
రంజనంబను మహాప్రబన్ధంబు నందు
తృతీయాశ్వాసము.

# సరసహృదయానురంజనము.

## చతుర్థాశ్వాసము.





రాజరాజ వైభవ !
రాజద్వైరి మాళి, రాజన్య యశ
స్సారసమద గజనిహత
కుఠ్మీరా ! సుగుణాభి రామ ! కుశలవ రామా ! ౧

తే. గీ. అవధరింపుము విరిబోఁడు, లమృతవల్లి దేవవల్లులమదిలోనఁ, దెలిపియాని
వలపు బుగులును బాగలుట, దెలసితల్లి యనుఁగు సకినంపి తోడితే, మ్మను
చుఁ బలికె. ౨

——* గౌరీ పూజ. *——

ఉ. అవ్విరిబోఁడి వోయికమ, లాత్ములఁగన్గొని ప్రేమఁదెల్పి యో
జవ్వనులార! మీజనని, సాగరనందని తండ్రిసన్నిధిన్
దవ్వులనున్న నన్నుఁగను, దమ్ములసైగలఁ బిల్చిదండయ
క్కవ్వపుఁగొండ దాఁటివినఁ, గాఁజనఁగావలె నన్నవచ్చితిన్. 3

శా. గౌరీపూజకు వేళయయ్యెఁ దడయం, గారాదు మీతోడిక
న్యారత్నంబులు గూడికుంకు మహరి, ద్రామంత్ర శాస్త్రాబ్జలై
మీరాకల్గని పెట్టియుండిరిఁకనె, మ్మీబూజ నల్సల్పఁగా
రారమ్మాయని తోడితెమ్మనియెగా, రానన్పు దుండింటికిన్. ౪

క. రారమ్మా జాగేటికి, లేరమ్మా తల్లిమిమ్ము, లీలావతులా
రా!రమ్మని నన్నంపె విచారిమ్మిఁక యేలకోర్కె, సఫలంబాయెన్, ౫

మ. అనిసర్ణ మేనులు జెమ్మటింప జలజా, స్యల్గూగ్మి రట్టమ్యోసం
చనిసా షత్రశలై పెనఁగుసడన, య్యాళిలల్ వెలింగండియో

యనుమానమ్ముల నేమికొండ పాడనై, యభ్రింక షంబైనమా
ఘనవాంఛాస్థితి ముజ్జగంబెఱుఁగుశం, కాతంక మింకేటికిన్. ౬

చ. అటియునుగాక మీరుచూ్రద, ఁటాంతరహాస్యర హాస్యగోపనా
స్పదచతు రత్వసంపదఁబ్రఁ, శస్తికినెక్కిన వారలాటమె
ల్లిదమొకో జేరజంపుసట, లేనిది తెల్లము చాలుఁచాలుపో
పదపదరమ్మ సిగ్గుపడ, భావ్యమె భవ్యమె తల్లిపట్టులన్. ౭

తే. గీ. తానుచిర్భాత లైపిరు, ల్దాల్చినేఁడు కలిమిఁయిల్లాలురతనఁపు, గద్దెమీఁదఁ
గూరుచున్నది తిన్నెపై, గానిలిపి పూజకెడలేదులేరమ్మ, పౌలతులార. ౮

మ. జగదీశుండగు శౌరిభాగవతపుం, జంబుల్ దనుం గొల్వసిం
పుగ నేడంతి పురంబులోపలరమా, పూర్ణేందు బింబాస్యతో
భగవత్పూర్చన మాచరించి భుజియిం, పంగాచియుండెన్ సహిం
పఁగరాదిచ్చట జాగులేవ గదర, మ్మాయింటికిం బోవఁగన్. ౯

తే. గీ. తల్లిగండ్రిలుమీకునై, తల్లులార! యెవరెవరుజూచుచున్నారి, దేమిజాగు
పోవుదమురమ్మటంచును, బుజ్జగించి, కరములాలించిబోటియు, ల్కమ్మగొనుచు.

క. నైదండ లొండొరులతోఁ గైదండలు గీలుకొల్పి, కదలుటవలరా
వేదండము లొండొరుశుం, డాదండము లలమికదలు, టయగాఁదోఁచెన్.

సీ. ప్రతిపదోపన్యాస, భావసంకోచంబు, నడలలోనుడులలో నాటుకొనఁగ
ఇష్టసందర్శనో, త్కృష్టమందాక్షుంబు, తలఁపులోవలపులోఁ దారసిలఁగ
ప్రకటానురాగవి, భ్రమణలీలాదృష్టి, చెలువుపైఁజెలువుపైఁ, జెంగలింప
నధికానుకంపాను, యాయితల్ పూబోఁడ్లు, చెలిమితో బలిమితోఁ జిగురుగొనఁగ

తే. గీ. విరహగహనావ గాహనో, ద్విగ్నహృదయ లగుచునగుచుఁ జెలుల్ రాగ, నలుకు కులుకు
బెళుకు దులకించు సొంపెల్ల మెలుపెం, పిసలు గూయ నతి వలపోరి నగుదెంచి, రంతిపురికి ౧౨

చ. రతనఁపుఁ బావలంతజవ, రాంద్రిడనంఘ్రిలఁ దాల్చి వల్పెముల్
వితతకటీతటంబులబ, లించిమణీమయ నూత్నపీఠులం
దతివలు గూరుచుండశిర, సంటిరిబోఁడ్లు సుగంధతైలపి
ష్టృతఘున సారచఁదనవ, టీరపరాగ పరాగచర్చలన్. ౧౩

సీ. కళుకుమేనిమి బిందియలఁదెచ్చి పన్నీట, జలకమార్చెననుంగుసకియయొకర్తు
జిలుఁగుబావ్రాంచుపం చలమేని దడియార్చి, కురులు క్రొమ్ముడి గొల్పెగొమ్మయొకర్తు
గళితంపువలిపెంబు వెలిపట్టు పుట్టముల్, గట్టించెనెరజాణ కల్కియొకర్తు
యపరంజిసీటుప్రావా, లలముబిక్కటంపుఁగఁ, చలలుగీల్కొలిపెఁ బైదలియొకర్తు
తే. గీ. ఘోఁఘుమఘుమ వలపునెక్కొనిన ధూపధూమములు గూర్చెముసుగిడి, భామయొకర్తు
కుంకుమముదీర్చి తిలకముల్గుదురు పఱచి కన్నెలనలంకరించిరి, కాంతలిట్లు.

ఉ. అందెలుఁ గంకణంబులును, హారములుఁ గ్రొవ్విరి పూలు రాగిడీల్
సందిటిదండలుంగ్రములు, జత్తులు నత్తులు ముక్కుముంగరల్
గెందొవకుసంతసపుఁ, గీల్జడలుఁ మగరాల కమ్మలుం
జందములందముల్ దొలఁగ, జక్కొరబోండ్ల నలంకరించిరి. ౧౫

కం. మెఱుగులు మలఁచిన తెఱఁగున గిరికొను తళతళల హొయలు, గీల్కొను చెలువుం
చిరుసలరియు లోఁజేసం గరకరి యిసుమంత లేక, కన్నెల మిన్నల్. ౧౬

సీ. సముదితస్మిత పూర్ణ, సామరస్య ములచే, వదన పాండిమముల, వ్వాలనడంచి
పలుమారు బాలెపెత్తు, వలఁపుఁ జెమ్మటసోన, పాదసంచారదంభమునగప్పి
మాటిమాటికి గ్రమ్మును మతలోని పరాకు, సకులయా గమనవాంఛలన గ్రమ్మి
జాగరారుణనేత్ర, చకచకల్ స్వాశ్రితా, త్యనురాగ కైతవో, ద్ధతుల మాటి
తే. గీ. నద్ధపంచాయుధోద్దీపనమునఁ బొడము భావములు దత్తదనుగూపఁ భావనమున
మాటుపరచుచు నంతంత, మమత బెనఁగు జనకు పంచాయుధునిఁ జేరఁ, జనిరి చెలులు. ౧౭

చం. ఎదురుగనేగి సందిళుల, నెత్తిశిరమ్ములు మూరుకొంచుఁ భే
రెదఁ గదియించి శౌరిసుమ, సేలినతల్లులు వీరటంచు సం
ముదముద లిర్పఁ గల్మిచెలి, ముందిట డించినఁ జేరఁబిల్చియ
మ్మదవతి యూనుపీఠముల, మన్ననసేయుచుఁ గారవింపఁగన్. ౧౮

తే. గీ. తమమనమ్మునఁ బొరలును, ద్దానువిరహ వేదనాభరమిందిరా, విష్ణువులకు
దెలియమిగ నెంచిహర్షించి, రెలమిచెలులు వారిసార్వజ్ఞమెఱుగంగ నేర రైరి ౧౯

తే. గీ. చిఱుతరత సంవృగద్దియల్, చేడెలిడఁగఁ దల్లికిరుపార్శ్వములనిల్పి, తత్పరతను
బుధహరుని రాణి సంకల్ప, పూర్వకముగఁ బూజఁ జేసిరి యపరంజి, పూలఁ
జెలులు. ౨౦

సీ. ధ్యాన మానందకం, దస్థురజ్యోతికి, నావాహనముగు హో, నంతమణికి
సింహాస సమ్మునా, శ్రీస్వరూపిణికిని నర్ఘ్యపాద్యములు బ, హ్మాదిజనని
కభిషేకమఖిలాబ్జ, జాండవిగ్రహకును, గంధపుష్పాక్షతల్, గనకఘృణికి
ధూపదీపములు సింజధుర వైరివాహకుర సరసాన్నములును, రాజ్యదాత్రి

తే. గీ. కనుమ సద్భక్తిఁ బూజించి, వినుతిఁజేసి యవతల తాంబూల నీరాజ, నా
దులొసఁగి
సప్రదక్షిణముగ మ్రొక్కి, జననితోడనక్షతలుదాల్చి శౌదల, లంగ్జెలులు. ౨౧

తే. గీ. పూర్ణభోగోపలబ్ధిన, పూర్వముదముఁగాంచికరుణించెనా బ్రసాదించెగౌరి
యంతలో దివ్య పటహదు, ర్దాంతరవము గప్పుకొనె నుప్పరపు గడల్, గ్ర
మ్మికొనుచు ౨౨

సీ. నిఖిలాత్మ భావనా, నిర్నిద్రసర్నిమే, షాభ్యాసులైన బ్రహ్మర్షివరులు
వ్యంజనా సూచిత, స్వస్వరూప బ్రహ్మ, శోధనా ప్నుతరస, శ్రుతిచయంబు
జడచిద్వి వేదనా, సిద్ధాంత సాలాస్య, చతురాప్నరొంగనా, శతశతములు
బ్రహ్మాది సంపిద్వి, రక్త చింతా క్రాంత, పరిణత ప్రమదసిం, ధురగణంబు

తే. గీ. లలమదారాపథంబెల్ల, ననుపమానదివ్యశోభామ చప్పికల్ దీటుకొనఁగ
బహుసహస్రాభ్ర మణికాంతి, బర్వె నవఁగఁ బ్రదమ చిజ్జ్యోతి సాకార, భరిత
మయ్యె ౨౩

చం. ఉపనిష దంగనా జనము, లూడిగముల్ పచరింప దుంపసిం
గఁపుఁ బలుకత్తలాని పయి, కారణ పల్యయ నంబమ్చి యీఁ
గపులుల సృష్టి చెక్కడఁపు గందువలీనఖ లీన మూనిచా
కకుపుఘు ముకుంజొకాటఁపుని, గాఁచమలీను చెలంగు లీలలన్. ౨౪

శా. స్వాత్మజ్యోతి వెలుంగఁ దా నెడలిస్వ, స్వానంద వాగాసిలో
స్వాత్మే శుంబొడఁగాంచి శ్రీనగరిత, త్స్వాంక స్థితింగాంచిన
స్వాత్మా ఖండనిజ స్వరూపము త్రిఖండాయత్త మాగారివి
శ్వాత్మ్మా సోదరుశౌరిఁ గాంచుటనునై, యచ్చోటికే తేరఁగన్. ౨౫

మ. అఖిలాండేశ్వరి నాకలోకవినికం, బాత్మీయుఁడు బ్రహ్మాత్మభూ
ముఖపుత్త్రావళితో మరుద్గణముతో, నాంకత్త్వర్షి సంఘంబుతో
నిఖిలస్త్రీపరివారముల్గొలువఁగా, నిర్ణిద్ర గంభీరతా
ముఖసంప్రక్రియ దివ్యదుందుభితతుల్, మ్రోయంగ సముత్సాహియై. ౨౬

ఉ. అండజ వాహనంబునహ్రి, దంతర దంతుర మోదవారియొం
డొండఁదరంగ ముల్దుముక, నుజ్జ్వలదివ్య చమూసహస్రము
ద్దండతఁ జుట్టునుంగొలువఁ, దామరిసాక్షుఁడు శంభురాణికిన్
గొండలు నాభుజాంబులవి, కుంఠతఁదొంగ వికుంఠ వీధులన్. ౨౭

గీ. ఎదురుగానేగుటయునింది, రేశురాక కలరిరాకాశశిజ్యోత్స్న ననుకరించు
మన్దహాసంబు నెమ్మోము, నన్దగింప నిన్దుధరురాణి నిరుపమా, నన్దమొందె.

సీ. భస్మత్రిపుండ్రాంక, ఫాలభాగములతో సరిలేనిరుద్రాక్ష, సరులతోడఁ
బంచాక్షరీమంత్ర, పారాయణములతో శివనామచింతనో, త్సవముతోడ
శివశక్తిసామర, స్యవివేకకలనతో శైవసిద్ధాంతని, శ్చయముతోడ
లింగాంగ సంబాధ, లీలావిభూతితో నిశ్చలధ్యానని, ర్ణీతితోడ

గీ. శంభుసారూప్యధారులై, సంచరించు ప్రమథులతివేలసంఖ్యులై, భవునిరాణిఁ
గలసి యెదురుదెంచి హాళిప్తు, రాంగణము లెల్లఁ గ్రమ్మ కైలాస పురవరాంగ,
ణము లయ్యె. ౨౮

గీ. అట్టియేకాత్మఁదస్తున్న, దైకమత్య మతితరానన్దకరమయ్యె, నఖిలమునకుఁ
బుష్పవర్షంబులురివెన, బ్బురముగాగ జయజయధ్వనులపుష్టాక, సమ్ముగ్రమ్మె.

ఉ. శారదదృగబ్జ మాలికలు, శాంకరి పైఁగలయంగఁ బర్వుచో
శారదదృగుత్పలంబులును, గంజదళాక్షునిఁగప్పె నొండొరుల్
గౌరవమింత యింతయనఁ గాంబనియేమొక తేజమిద్వరై
వారనివేద శాస్త్రముల, నంతముఖంబుల మ్రోయుచుఁగదా. 3౦

గీ. ఏమిచెప్పంగవచ్చును, హేశురాణి నలిననేత్రునిఁగాంచియు, నందబాష్ప
పూర్ణయగుటయునీహార, పూర్ణచంద్రకోటిసంకాశమైమోము, కొమరుడనరె

ఆ. ఇల్లువెండికొండ, విల్లుబంగరుకొండ బట్టినట్టిశివునిఁ, జెట్టబట్టి
నట్టియన్నపూర్ణ, యఖిలలోకేశ్వరి కన్నయింటిసిరులఁ, గాంచిపొంగె. 33

ఉ. కన్నదియెన్నఁడో తొలుతఁ, గన్నదియెవ్వరొ మున్నెఱుంగరీ
యన్నయుఁ జెల్లెలుం బోడము, టానిగఁబ్రోది గణించుమక్కువన్

మున్నుఖగేంద్ర వాహమును, బ్రోలనె దివ్యమృగేంద్ర వాహముల్
జెన్నలరంగ వచ్చిరిలు, సేరఁగ స్వస్వ చమూసమేతులై. ౩౪

చ. ఖగపతి ధోరణమ్ము డిగి, కాంచనచేలుఁడు చేయివీచినన్
యుగపదుపస్థితిన్ నిలచె, యూథపయూథ సనాథయూథినీ
యుగళము దత్ప్రసన్న శరఃఫూత్కారముల్ జరిచారికాతతుల్
బాగడుచు వేల సంఖ్యలుగఁ, బాల్చిరి శ్రీభగవత్కృపాప్తిచే. ౩౫

క. పట్టిరి వెలిఁ గొడుగులు భువి జుట్టియెడు గడుగు నడుగు, జొంపము వెన్నుం
డిట్టలముగఁ జేయొసఁగఁగ, గట్టులవిలుకానిరాణి, కడుమోదమునన్. ౩౬

క. కంఠీరవంబు డిగియుత్కంఠన్ రతనంపుఁబాదు, కలుచెలులిడనై
కుంతపుర భాగవతకల, కంతులునివ్వాళు లిడఁగఁ, గదుణాగనుచున్. ౩౭

సీ. గంధర్వ కామినీ, గణము వీణలు మీటఁ గిన్నరాంగనలసం, గీతమొలయ
సురసతీచయముచా, మరముఖల్లునవేయ విద్యాధరాంగ, ల్వినుతిసేయ
యమికామినులుహారి, ద్రాక్షతంబులుసల్ల గరుడకాంతలుబరా, బరులుసేయ
సిద్ధాప్సరలుసము, ద్దీప్తి నాట్యముసల్ప యక్షభామినులుకో, లాటమాడఁ,

గీ. దల్లిసద్భక్తజనకల్ప, వల్లి త్రిపుర సుందరీదేవిగో, విందమందిరమున
నడుచు మనునల్లనల్లనఁ, గడచివచ్చి యంతిపురముఁ బ్రవేశించె, సతిముదమున.

సీ. పసపుకుంకుమనిండు, పళ్లెరంబులతోడఁ బరిపక్వఫలపరం, పరలతోడ
ఘనసారసురభిచం, దనసుగంధములతో నతిభవ్యకరశు, భాక్షతలతోడ
బహుళకల్పద్రుమ, ప్రసవమాలికలతో రమణీయధూపధూ, మములతోడ
బహుదీపసాహస్ర, భరితపాత్రలతోడ నసులామృతోపహా, రములతోడ

గీ. గలిమిజవరాలుసిరులిచ్చు, గరితతనకు నాడుబిడ్డ జగన్మాత, యరుగుదెంచు
వార్తవిని యభిముఖి, యనుచు వచ్చెఁ బుణ్యసతులు వేవేలు గొల్వఁగ, సం
తసమున. ౩౮

క. అన్యోన్యపరీరంభణ మన్యోన్యస్మితవిలోక, మన్యోన్యముదం
బన్యోన్యహాస్యచతురో పన్యాసంబుమరు రమణు, బరఁగెనడవడిన్. ౪౦

ఉ. అంతట దంపతుల్ రమయు, నంబుజనాభుఁడు శంభురాణిని
భ్యంతర మందిరంబుసక, వారములో నుపచారముల్ వధూ
సంతతు లాచరింపఁగని, చక్కఁగ నేగి మహార్హ పీఠిపై
నెంతయు భక్తినిల్పి సద, భీష్టము చేకురఁ జట్టు నిల్చుచున్. ౪౧

క. రతిభోగమలాస్త్రేడుభా రతితో గమలాసనుండు, రహిఁ బ్రెమొక్కంగా
సతి వేడ్కఁ దేవవల్లీ యుతుఁడైమెతానమృతవల్లి, యును మ్రొక్కంగన్. ౪౨
ఉ. కన్నుల నాదరింపుచును, ఖండితదీవన లిచ్చుచుం గృప
న్మన్నన సేయుచున్ జనువు, మాటలఁ దేల్చుచు వారివారిన
త్యున్నతి గారవించితన, తోరననిల్చిన ముద్దుకన్నెలం
జెన్నలరారఁ గౌగిళులు, జేరిచియంకము లందునిల్పుచున్. ౪౩
క. చెక్కులు నొక్కుచుఁ గౌగిట, మక్కువనొత్తుచును జాల, మాలిమిఁ గొనుతే
జక్కెరబొమ్మల నెక్కున, కక్కసపుం జనువుఁ గొల్పి, కన్నులఁ సగుచున్. ౪౪
శా. అన్నా! కన్నెలు మాకుమరునకునీ, దైయన్న నారయ్యనే
మున్నెన్నండును సిగ్గెఱుఁగనిదియే, మున్నెన్న యప్పైనసం
పన్నంబయ్యెడు గాదెయింత కనఁబై, పైనంత భాగ్యంబుమా
కున్నె! యంచనుశౌరి సల్కవినుచున్, యోగాంత రవ్యాజతన్. ౪౫
గీ. మాట మఱపించి యౌచిత్య, మహిత వృత్తి నున్న యెడసామ యికులుసా,
హసోన్నాద
భాసురముగనుభోజనా, చనరమనుచు విన్నవించినఁ బతికన్ను, సన్నరమయు.
గీ. తానియోగింపఁ జేటికల్, తదనుమతిని, మత్తియఁ పుటారతులు దెచ్చి, ముందు
నిలువ
నీశ్వరేశ్వరియభ్యంగ, మిచ్చగించి కదలెసభయెల్లసాచితీ, కలనమసలె. ౪౬
సీ. గంధతైలపుఁబునెనొ, క్కతే దేవితలయంటె చెలియోర్తుకలపంపు, నలుగువిడిచె
గోజ్జంగి నీటితో, మజ్జనంబిడె నోర్తుతడపుచేఁ దడియార్చెఁ, దరుణి యోర్తు
గళితంపు వెలిపట్టు, గట్టించె సకియోర్తు పొపైన ధూపము, వ్రించెనోర్తు
పట్టు కంచల గబ్బి, పాలిండ్లనిడెనోర్తు నిఖిల భూషలు మేన, నినిచె నోర్తు
గీ. రత్నసింహాసనముఁ బెట్టె, రమణియోర్తు ఇాపుటపరంజిపళ్ళెరం, బిడియెనోర్తు
శీతతోదకములగిండి, జేర్చెనోర్తు విమలజళత్రాళ వృత్తంబు, విసరెనోర్తు ౪౭
కం. కమలా కమలా తునుధా కమ లాసను లొక్క మొగిని, గన కాద్రి ధను
కమలాక్షుసన్నిధిరతీ కమల స్త్రీల తోడఁ బఙ్క్తి, గలసి యిరుగడన్ ౪౮
మ. బహు సాహస్రసు వాసినీ సహితులై, భర్త్రాత్త సింహాసనో
ద్వహులై యుండఁగ నిత్యతృప్తిక సుధాం, ధఃపాయ సాపూపసూ

సహావిర్భావజన రంజనంబు గనుపింప, శక్తిశక్తిసద్దీవిర
స్వాహాసంసూచక పాచకవ్రజమునా నాంస్య సంధాయి గన్. ౫౦

వ. అట్టి సమయంబున, నశేష శేష భావపర్య వసన్నాంబను, నిఖిల బ్రహ్మాది పరి
వారమ్ములతోఁ, లక్ష్మీ నారాయణు లిరువురు, హరి చందనాది కలపంబు, లొ
సంగి, హారిద్రా కాశ్మీ రమ్ములర్పించి, నక్షత్రప్రసూన మాత్ర పుష్పమ్ములిడి,
కాత్యాయని నభ్యర్థించి, తదనుగ్రహ ప్రాప్త పూర్ణానంద పాత్రులై, సపరి
వారంబుగ, భుజింపఁజేసి తదనుమతిని స్వస్వపీఠాధిరోహణంబుల నానందిం
చుచు, నమృతర సాస్వాద నోల్లాస సముత్సాహులై, భుజించిరి, పరాశ
క్తియుంగర పాదప్రక్షాళనంబు లొనర్చి, వీటికా చర్వణంబున ఘుమఘుమి
తమృగమదల వంగైలాసు గంధంబులు, సభా సదులకుఁ బ్రమోద గంధంబుల
నుగ్రహింప, మందారపల్లవా నల్ప తల్పంబున, సుఖాసీనయై, కరకంకణ ఝ
ణత్కారంబులు,దిక్కులంబిక్కటిల్ల, మృదులపలదవ్యజనంబులువీచుచు, బడ
పల్లవమ్ములొత్తుచు, భూషణమ్ములచిక్కులుసవరించుచు, నపరిమితదేవభామినీ
జనమ్ములుగొలువ, గొలువై, యున్న, యవసరంబున. ౫౧

క. భుజియించియంత, శుచియై గజవరముఁడపుడుదివ్య, గంధాంకసుమ
వ్రజమాల్యా లంకృతుఁడై విజయోల్లాసముగ సభకు, విచ్చేయంగన్. ౫౨

మ. కలవారెల్లఁ గృతాహ్నిక కృత్యులయియు, గ్రగ్రాహి సన్న్యాసం
కలనావృత్తుల సేగుదెంచిసభవే, డ్కంబిబిక్కటిల్లంగను
జ్వలసంరంభ పయోధిమంద నపదా, శ్చర్యాను సంధానమై
కలరానంబుల నొప్పెవచ్చెదరుసాం, గంబైన మోదంబునన్. ౫౩

మ. హరియిల్లాలు సువాసినీజనముపే, లైలక్షలైకోటులై
పరివేష్టింపఁగ వెంటవెంట సొబగుం, బట్టంపు రాణుల్సనన్
సరసీజాక్షులు భారతీరతులురా, సంపూర్ణ శృంగారము
త్తిరసోద్వృత్తి సభాగ్రభాగమునకే, తెంచెన్ సముత్సాహతన్. ౫౪

గీ. వలపుజిగురింపశ్రీదేవి, వనజనాభు దండరతిదేవిపుష్పకో దండుదండ
శారదాదేవిపంకజా, సనునిదండ నిలిచిరెల్లనుందగుచోట్ల, నిలచిరపుడు. ౫౫

క. జననీజనకులయనుమతిఁ గనుసన్నలగట్టులిల్లు, కామిని చెంతన్
జననెచ్చెలి యమృతవల్లియు నొనరంగ సౌంధర్యవల్లి, యుసుఁల్చిరాగన్. ౫౬

—— * మహర్షులు వైకుంఠమునకు విచ్చేయుట. * ——

శా. శాలంకాయన గౌతమాత్రికణభుక్, సానంద వాసిష్ఠజా
బాలిత్యాసన రైభ్యకశ్యపభర, ద్వాజాది మౌనుల్ త్రిలో
కాలంబంబగు గార్గికోర్కెఁ గనికా, ర్యాలోచనం బెంచిలో
కాలోకంబులు దాటివచ్చిరిమహా, ర్హంబైన వైకుంఠముల్. ౫౮
క. ఫణిశాయిమునులరాకలు, ఫణిహారులు దెల్పవారి, పటుతరవాచా
ఫణితివిని పిలువనంపెను, ఫణిభూషణు సాధ్వికడకుఁ, బటుమోదమునన్.
క. నాగాయణి నారాయణు, లారాధింపంగ వార, లయ్యెడువురని
త్యాయాపేక్షఁ గొల్చి యుండిరి, గౌరవసతినుతులవారి, కరుణల్గనుచున్. ౫౯

—— * కుమారుని వివాహ ప్రయత్నము. * ——

ఉ. అయ్యెడభృవా విలాసముల, నాసభికారవ మోసరించిమో
మొయ్యరమార మాధిపుల, యోలముత్రిప్ప సహాసశోభలన్
దియ్యముగొల్చుచున్ జనవు, దెల్పుచుశాంకరి పల్కెనన్న! యే
మయ్య! భవత్సకాశమున, సాంజలినై యొకకోర్కెఁ దెల్పెదన్. ౬౦
గీ. సకలగుణశేఖ రాస్థాన, చక్రవర్తి వితరణగుణంబటనినీకు, విశదపఱచు
దానఁగానటులయ్యునే, తాదృగర్థ సూచనమున స్వతంత్రత, బూరవుఁ గంటి.
ఆ. మాకుమారయ్యకునుమీకు, నూర్తెలమృత, వల్లిసౌందర్యవల్లుల, వాంఛ జేసె
యముగఁదలపోసివచ్చితి, రయ్యమీరుదంపతులుపెండ్లిసేయుంగఁ దగినవారు.
ఉ. తల్లినెఱుంగ నట్టులనె, తండ్రినెఱుంగను పుట్టినింటిపే
రెల్లయునీనకాని మఱి, యెద్దియు లేనిది నీవెఱుగవే
తెల్లమునాడు భాగ్యమున, దేవుఁడు చేసిన కార్యసిద్ధినా
యుల్లము పల్లవిం పఁగరు ణోదధి, భిక్షలనివ్వఁగా, దగున్. ౬౩
ఆ. ఏండ్లకెట్టులైన, యీనన్ను గురియించి వరుఁడైన భుజగ, మండనుఁడు
కార్యఘటనకేమొ, కడువిదగ్ధవుగాన పోయిరమ్మటంచు, బుచ్చెనన్ను. ౬౪
క. నామాటజిన్నపుచ్చక మోమోటము బెంచిమనుత, సొనయుగఁ దగమా
స్వామినిగా ర్హాద్యశుభో ద్దాముని గాసేయనగును, దారప్రార్థిన్. ౬౫
ఉ. ఎక్కువభోగ భాగ్యముల, కేమికొఱంత తదర్థమైవగన్
దక్కువనన్ను నిచ్చుకతి, తల్లియుఁదండ్రియు నేమిజూచిరో

మొక్కులపేరఁటాలనయి, ముజ్జగమేలితి నేఁటిపాకశా
దక్కుఁడవీఁ కేమి పూమకయి, డండనుబంగరుకొండ యుండఁగన్. ౬౬
క. సీతోర్వియ్యంబాడఁగ జేతోమోదంబుకడలి, చెలువునఁబొంగన్
బ్రీతిపడి వేఁడితిని నీ చేతివిసామేలు తెలియఁ, జిత్తములోనన్. ౬౭
వ. అనిపలికిన. ౬౮
చ. పురహర భామినీవచన, పూర్ణతమెచ్చి సభాసదుల్ మహా
శ్వేతహృదయంబుఁ గాంచితిమి, వచ్చుటసంప్రతి పన్నమయ్యెము
దరధరు దాప్తవత్సలుఁడు, నాయనుదప్ప దోడబుట్టువున్
గరిమకుఁ దావలంబనెను, గానిపుఱొండు దలఁపఁ దేమియున్. ౬౯
చ. అదియిటులుండె వారిశౌఆ, గంతయుఁదెల్ల మొకండుకోపియున్
బట్టపడి వేళ్ళాకంబు బహు, భక్తి యొకండు దిగంబరుండుభూ
విభుతుల్యభావలిట్లు పెను, వేదురుమామ యెఱింగి యెట్టులీ
సువతులనట్టి కాఁపురము, జొచ్చెనన దలపోయుతండ్రియున్. ౭౦
చ. సిరులకు నాలవాలముఁ జి, సిద్ధికిమూలము, శేషసద్గుణా
కరమణి సర్వమంగళజ, గన్నతయామె భరించునట్టి కాఁ
పురమగి యన్నిలంతలకు, భోగములందు కొఱంతలేదుతా
మగలిరి జొంపమైవిబుధ, మంజులమై జగమెచ్చఁ గాంచదే. ౭౧
గీ. కలిమిఁ వేముల కేమిమా, కంజనాభునకును సైదోడుగాఁ దత, స్నందనులకుఁ
గన్నియాలనీకదీరునే, వెన్నుఁ డివ్వఁ దలఁచెనేని యుసిరి కేమి, వెలితిగలదు. ౭౨
మ. అసహాయంబుగ ముజ్జగంబులభుజా, హంకార లీలాసము
ల్లసనప్రౌఢిఁ మనాక్రమించిసురపా, ల ప్రస్తుత్యుగ్రోన్నయ
ప్రభసమానుండు వరుండుగల్గఁగవధూ, భాగ్యంబు నాకువ్వఁగా
వసమేమువ్విగి బోండ్లకన్నజగమ, బ్రాబొప్పఁ గై సేయదే. ౭౩
క. అని యనివారితవాచా వినియోగరహస్యకలన, విహరించుసభా
జనులను రాకాహిమకర, ఘనదీధితు లొనయఁ గన్ను, గవఁగనుఁ గొనుచున్.
చ. అచలధనుష్కుఁ డేలిమొగ, మైజలజంబకుఁ డిట్లుపల్కు నో
ఖచరనుతాసు భావభిజ, గద్రమణీయమునా నాకె కాదునీ
వచనమునీకు సంతసమ, వశ్యము సేయుట కింటె వేఱెత
త్రిచరగుణాభి సంధిఫల, దాయకమున్నదె ముజ్జగంబులన్. ౭౫

చ. అతులకలా కలాపసము, దంచిత హారతనంబు హేమసం
గతమయికాంతిఁ జొప్పడిన, కైవడిసద్గుణ వాసనాసమం
చితమతి నీసపర్యలకుఁ, జిక్కఁ కనుంట ప్రకాశమొద్దిని
గ్మలికిరుణాగ్ర వర్తివిధి, శ్రీకరపస్తు యుగంబుఁ గూర్పఁడే. ౭౬

క. కన్నియలఁగన్నవారలు, గన్నెటిఁగిజగంబుమెచ్చ, గలబాంధవసం
పన్నతఁ గోరెదరసుగుణా, భ్యున్నతులగువారుడాగి, యుందురతల్లీ. ౭౭

ఉ. హాటక గర్భకోటులకు, సాగరహూగత మేర్చుసాజగ
న్నాటకసూత్ర ధాత్రిశివి, నాయమెసన్నదుగా భవన్నిరా
ఘాటమనోభిరామమునఁ, గన్గొనరానిది యేదనీదయా
వాటికిఁబాత్ర భూతులకు, వశ్యముసర్వ విభూతులంబికా. ౭౮

క. నీవాంఛితమున సిద్ధము, గావింపఁగ వశమెసర్వ, కారణమవ్వసం
భావించి పనులుగాను మొసఁ, లీవిధియిట్టుదని తెల్ప నెవ్వరుజగతిన్. ౭౯

ఉ. ఇంటికివచ్చి కన్నియల, నిమ్మనివేఁడిన దానవమ్మనీ
మంటిజగజ్జనిత్రికథి, వాంఛితసిద్ధికిఁ గానివానిదు
ష్కంటక జీవితంబువిత, గాదలఁతుఁ మరుమాట లేలమొ
పుంటికి నీము వాప్తికిని, బాల్పడియుండుమగాదెశాంకరీ. ౮౦

మ. గుణవంతుం డభిమానశాలిసమర, క్రూరాసురానీనిబ
ర్హణనిస్తంద్ర భుజాబలుండమున సుబ్రహ్మణ్యుఁ డల్లుండుగా
గణుతింపంగల దెట్టి మానతరవచి, స్సాకారంబు సెలంద్రగియా
గ్రణి గానెంచుచుఁ బట్టిచోసుతలనీ, గంగంట భాగ్యంబెకా ౮౧

గీ. అన్నఇటులుండనిమ్మమా, యమ్మనీకు మోదమొవఁగూర్పకంచెనీ, ముజ్జగమున
నస్మదిష్టంబు గలదెము, న్యాంబు మనసు రంజిలివ సింపుమమ్మయా, సైడ
ముఁ కొమ్మ. ౮౨

మ. అనియంభోరుహపత్ర నేత్రుఁడు చిత, వ్యాహారముల్ సల్పెమొ
య్యనదేవిసలిధంబున స్మైలకు నెయ్యంపుంగు మాటీదృములు
ఘునకారుణ్యారవాబ్ధి నత్తరులనమా, స్కారంబుఁ జేయించెనె
ర్గొంకనువాత్సల్యంపు మేనయత్తవ్రసుఖా, క్రోధంబ్రుఁ డీనచనెన్. ౮౩

## —* లక్ష్మీదేవి శివసంపదను నిందించుట. *—

గీ. ఇంత సంరంభ మాలించి, యిందు వదన సారసాలాస సభికులా, శ్చర్యమంద
నెల్లవారలఁగనుఁగొంచు, నిట్టులనియె మృధుల వాచావిభూతిన, గ్మలిఁదలిర్ప.

చ. సరిసరి యేటి మాటలిఁకఁ జాలుసభాసదులార! వింటిరే
పరిణయబాంధవంబుసను, భావమటంచన విందుమిందునె
పృరుసున మాకువారికిని, భవ్యముభాగ్యను కొండమీదికాఁ
పురమది కొండక్రిందిబలు, పోకలుమాయలి మున్నెఱుంగరే. ౮౫

సీ. ఏనాఁటివారలో, యెఱుఁగరించుకయుమా ప్రకృతివారలుగారు, పురులుగాని
గుణవంతులా కారు, గుఱుతులేమియు లేవు బ్రహ్మవిద్వేషమ్ము, పట్టుగొమ్మ
జాతిమాలినవారు, సదసద్వలక్షణాల్ పరమమాంగళ్యసం, చరణపరులు
మానవంబెఱుఁగరు, మర్యాదలును లేవుదుస్సహాయులుజగ, ద్రోహకృతులు

గీ. వారితో బాంధవంపుబాత్తు, వసముగాదు తెలసికలియంగ రాదన్న, పలుకువినమె
ఇట్లుకన్నెలనివ్వంగ, నిచ్చగించు మనసునకునంత దాజోలి, మానుటొప్పు.

చ. భ్రమపడిరూఢుబిడ్డయని, పండుగపబ్బములన్ సువాసినీ
క్రమమునఁ బిల్వనాపుటయొ, కానుకనాఁడును లేదుబ్రాహ్మణ
ప్రమదకుఁ బచ్చుటక్షతలు, పైనిటులల్ దనపేర మ్రొక్కుకుం
టమియుఁది బంధుభావమెక, డిందిసరాగము కిట్లుగగ్గునే. ౮౬

గీ. అన్నియిటులుండనిమ్ము లి, య్యాపురాలు పెండ్లిపెద్దలతోఁగూడఁ, బేర్మెనేఁటయుఁ
గొడుకుఁ గోడఁ్రడ కలిసియే, కొండ గుహలఁ జెలువుగ గృహ ప్రవేశమ్ము,
సేయునొక్కొ. ౮౮

గీ. తాపసమెగాని సత్వంబు, తలఁపఁరాదు రాజసము పేరుఁజెప్పంగ, రాదుమున్నె
దిరాశ్రితుల చక్కదనమెన్న, నలవిగాదు త్రిపథులు చతుష్పదులుగారె, తె
లసి చూడ. ౮౯

సీ. గజవర్ధనంబును, గజమర్ధనంబును భుజగసిక్షణమును, భుజగభూష
మంధకావనమంధ, కాపహారంబును వృషభసంహాతియును, వృషభగతియు
హరిణమారణమును, హరిణధారణమును గోపాలకత్వంబు, గోనికృతియు
సర్వాశంసనం, బర్వాధ్వసయు విశ్వపాలనమును, విశ్వహృతియు

గీ. గాఁగహరిహారచర్యలి, క్కరణిఁదనరి తలఁపనన్యోన్యవైరంబు, దార్చుచుండు
నట్టివారలువిద్యుణకు, లగుటఁగనఁగ బ్రహ్మసృష్టికిఁబ్రతిసృష్టి, పగిదియయ్యె.

ఉ. కావునఁ బ్రాణవల్లభుని, ఖండితవాక్యము విన్నయంతనా
భావము సంచరించెడినె, సంబిడకీరుచి తంబెఱుంగుఁడం
చీవిధిఁ దత్సభాసదుల, కిందిర తెల్పఁగ గోష్ఠియెల్లను
చ్చాపచ వాగ్విలాసమున, సందడిదండిగ కొల్వునంతటన్. ౯౧

గీ. స్వామి సర్వజ్ఞుఁ డీశుండు, సాంబమూర్తి యీరయ నాగత మెఱిఁగిమీ, రే గుఁ డనుచు
దమ్మునంపుటవలనన, త్తాపసేందు లేకముఖముగనిలిచికే, వెత్తికొనుచు.

శా. వాచారంభణమంల్ వికారములుభా, వద్వైధ ముల్మానుఁడీ
వాచాతీతము నిర్వికారమఖిలా, ద్వైతంబు శైవంబసం
కోచప్రౌఢిమఁ దత్వనిశ్చిత జగత్రోద్ధంబుఁ గావింపనా
లోచించెన్ రమవాగ్విగర్హితలుజా, లున్ సభ్యు లోర్పుడీఁకన్. ౯౩

గీ. అని సభాస్తార కోటుల, ననున యించి కలశవారాశి తనయ చెంగటికి సరగి
భాసవాల్గొర వెల్లన, ప్పరమ సాధ్వియించుక మృదూక్తి లాలించి,యిట్లులనిరి.

——* మహర్షులు లక్ష్మీదేవికి శివతత్వముం దెలుపుట. *——

ఉ. కారణ తత్వ రాసులకుఁ, గారణమై జగదంత రాత్మయై
ప్రేరకుఁడై చరాచరవి, భేదవిశేష గుణావ ధానియై
పూరితకర్మ యంత్రఫల, భోగవిరాగ యుగస్వ తంత్రుడై
సారములేని సంసృతుల, పారమునొందఁగఁ జేయుతానయై. ౯౪

గీ. శాశ్వతజ్యోతికరణి జొ, క్కమునకిలగతుఁడునై సర్వపరతాది, ఘనతఁబొలి
యప్రతర్క్యమునిర్దేశ్య, మప్రమేయమైన బ్రహ్మంబుశశిధరుం, డమ్మకొమ్మ ౯౫

గీ. ప్రకృతిపురుషులకాదిమ. ప్రకృతియైన కాలమునకుమహాకాల, కలనఁ గూర్చి
తనప్రకాశమ్మునసర్వత, స్వప్రకాశకముగ భాసకభాసక, త్వమురహించె. ౯౬

సీ. అణువుకణువునై, దియాది మధ్యాంతంబు లరయంగ రానిమ, మహాత్ము
కల్పించి తాఁ జొచ్చి, కలయ నేకంబమై కలసి యున్నంటిపైఁ, గలయ రాక
తార కజ్యోతియై, తరుణార్క సాహస్ర దివ్యప్రభావళి, దీపులడఁగ,
అతుల బాహ్య భ్యంత, రాఖండసచ్చిదా పోజ్యోతిరాత్మయై, పొలిచినిలిచి.

గీ. గుణములకు నందరాకని, ర్గుణపరాత్మ భావసంప్రతి పన్నస్వ, భావు లకును
కొంగు బంగార మైనయ, కొ్కండ వింటి దంట మహిమంబుఁ దెలియంగిద
రమటమ్మ ౯౮
క. భేదత్రయరహిత ముఃశ్రుతి నాదా తీతమ్ము నిత్య, వైభవము మహా
వేదాంత ప్రతిపాద్యము నాదా తీతమ్ము ప్రమథ, నాథుండమ్మా. ౯౯
క. తత్త్వాహంకారమహ త్తత్వంబుల మాయ తోడఁ, దనలో నిడియ
త్తత్త్వంపద లక్ష్యార్థము సాత్వికుఁ డీశ్వరుఁడటందుఁ, జనువుదురబలా. ౧౦౦
క. లోకంబులు లేవుతదా లోకంబులు లేవుసకల, లోకా ధిపులుఁ
లోకస్రష్టలు లేరొక కేకద్వజజనకుఁ డవల, కేకలువేయఁ. ౧౦౧
గీ. అట్టిమున్ప్రాకృతజ్యోతి, యఖిలసాక్షి యీశ్వ రేశ్వరుఁడాత్మైక్య, హేతువైన
చంద్రశేఖరుతత్త్వంబు, సకలలోకసుప్రసిద్ధంబు నిగమసంస్తుత్యమమ్మ. ౧౦౨
ఉ. పాకృత సాక్య సంపదల, పైమదిఁ బెట్టక స్వస్వ రూపవే
ద్యాకలి తస్వ భావుఁడయి, యట్లు జరించుట కాని కేవలా
ప్రాకృత దివ్య వైభవమ, పారము తత్కరు గాలవాప్తిన
స్తోకవిభూతి నందుటలు, చోద్యమె సర్వసు రాసురాళికిఁ. ౧౦౩
క. అద్దేవునియాదలకిం, చిద్దళ మింద్రాది సురల, సిరులకు మూలం
బద్దేవు ముద్దు కొమరుం, డద్దిర నీకల్లుఁ డవుట, యది యసదానె. ౧౦౪
వ. అదియునుం గాకభవదీయ వాక్తరంగిణీత రంగంబులంబోలుశశి ధరజగిద్దురంధ రితాసముల్లంఘున జంఘాలంబులగు శబ్దకదంబులనుపామరోత్ప్రేక్ష సొల్లుంత నసూచకంబు లయ్యునంత ర్వాణుల కనంతసముల్లాసరుచకంబులై నిరంతరా నుస్యూతచరమ పరమ పదార్థ విరమ సౌఖ్యంబావహించె, ననాదిత్వంబున వ్యాకృతపరతత్వంబును పరత్వంబునుగుణరాహిత్యంబున నిర్ద్వైత్వంబునుకా రణకారణత్వంబును, కేవలతత్వంబును జగద్వలక్షణత్వంబును సర్వసమత్వం బును, ససంబంధిత్వంబున్ప్రమేయత్వంబును ససాధ్యత్వంబువిశ్వభోజ కత్వం బునగోచరత్వంబును సర్వగత్వంబును మొదలగు నిర్విశేష బ్రహ్మార్థంబునకు సముద్యోతకంబులై యస్మదాదులకు బ్రహ్మానందంబు త్రావించె మఱియు భేదసాధకంబులగు చేష్టాచళుక్యంబులు లోకంబుల నఖిల జీవోపకారంబులై యప్పరమేశ్వరు లీలావిభూతుల నిరుద్ధమ్ములైయఘటితఘట నాపటియ్యంబు

